# అంతర్జ్యోతి

## హెలెన్ కెల్లర్

— ఆత్మకథ

అనువాదం:

"సుభద్రానందన్‌పాల్"




ఉమా పబ్లిషర్సు,

విజయవాడ-1

వెల రు 2-0-0

# Preface

## సింహావలోకనం

1955 వ సంవత్సరం జూన్ 27వ తేదీకి హెలెన్ కెల్లర్‌కి 75 సంవత్సరాలు నిండాయి. ఈ సమయంలో 30 సంవత్సరాలకి పైగా ఆమెతో సన్నిహితంగా వున్న నెల్లా బ్రాడీ హెన్నీ వ్రాసిన కొన్ని విషయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

హెలెన్ బాల్యంలో ఆమె వయస్సుకంటె పెద్దదిగా కనుపించేది. ఇప్పుడు ఆమె వృద్ధురాలు ఆమెకి ఇప్పుడు వయస్సే లేదు! భగవత్స్వరూపమైన అంతరాత్మ మీద నమ్మకముంచి ఆత్మకి వినాశనం లేదనే గట్టి నమ్మకంతో, ఉత్సాహంతో ఆమె తన 75వ పుట్టిన రోజు పండుగ చేసుకుంది. మరణమున్నా, వృద్ధాప్యమున్నా కించిత్తైనా భయం లేకుండా, జనన మరణాలు ఒకే నాణెంయొక్క రెండు వైపులనీ మరణానంతరం, నిసమాధికి ఆవల సువిస్తారమైన, మహోన్నతమైన జీవితం కలదని, నమ్మిన ధైర్యవంతురాలు హెలెన్. ఈ మహా సత్యాన్ని ఆమె స్వీడిష్ మహర్షి ఎమాన్యూల్ స్వీడెన్‌బర్గ్ ద్వారా నేర్చుకొన్నది.

ప్రేమ ఎక్కడైతే వుంటుందో, భగవంతుడు అక్కడే వున్నాడని, భగవంతుడు ఎక్కడ వున్నాడో శాంతి అక్కడే

వుంటుందని ఆమె దృఢంగా నమ్మింది. 47 సంవత్సరాల క్రితం ఆత్మకి నాశనం లేదనే తన నమ్మకాన్ని స్ఫుటపరచి, తనతో ప్రయాణం సాగించిన మిష్టర్ జాన్ హిట్జ్ పరమపదించారు. కాని తన నమ్మకం సడలకుండా, ఒంటరిగా తానే ఆ నమ్మకంతో హెలెన్ ముందుకు సాగిపోతూంది ఈనాటికీ, తన ఆత్మ ఏ విధంగా ప్రబోధిస్తుందో, తదనుగుణంగా ధైర్యంతో ముందుకు సాగిపొమ్మని ఆమెకు మొట్టమొదట చెప్పినది అమె ఉపాధ్యాయిని సల్లివాన్. ఆత్మకి నాశనంలేదనే అభిప్రాయంతో తాను ఏకీభవించలేనప్పుడు, హెలెన్ని, తన అభిప్రాయంతో ప్రసక్తి లేకుండా, ముందుకు సాగిపొమ్మని చెప్పిన ధైర్యవంతురాలు సల్లివాన్ అందుచేతనే శారీరకంగా హెలెన్ కెల్లర్కి జూన్ 27 వ తేదీ పుట్టినరోజు అయినా, మానసికంగా మార్చి 3 వ తేదీ ఆమెకు పుట్టిన రోజు పండుగ. 1887వ సంవత్సరం మార్చి 3 వ తేదీని మిస్ సల్లివాన్ టస్కంబియాకి వచ్చింది! ఆ దినం నుంచే హెలెన్ అంధకారం నుంచీ, నిశ్శబ్ద వాతావరణంనుంచీ విముక్తి పొందింది! సల్లివాన్ జీవితరహస్యాల నెన్నిటినో హెలెన్కి చెప్పింది. జీవిత మాధుర్యాన్ని ఆమెకు చవి చూపించింది.

హెలెన్ ఆశ్చర్యకరమైన ఎన్నో సంఘటనలను చూచింది. ఇంకా ఎన్నో చూడగలననేనమ్మకం అమెకువుంది; ఆశ్చర్యకరమైన సంఘటన లంటే యాటం, హైడ్రోజన్, కోబాల్ట్ బాంబులు, మారణాయుధాలూ కావు! (ఇవి అంటే ఆమెకి కించిత్తైనా భయంలేదు.) వేలకొలది అంధులు, చెవిటి

వారు, అంగవైకల్యాన్ని పొందినవారు, రోగపీడితులు, క్రమంగా పునరావాస సౌకర్యాలను పొందడాన్ని ఆమె స్వయంగా చూస్తూంది. వారంతా తనతోటిసోదరులని ఆమెకు తెలుసు. వైద్యశాలలలోను, తమఇండ్లలోను, కర్మాగారాల లోను వుండే వీరిదగ్గరకి వెళ్ళి, ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో, స్వేచ్ఛతో తమతోటి సోదరులతో ముందుకు సాగిపోవలసి నదిగా వారిని ప్రబోధించింది. విశ్వ వ్యాప్తమైన ఈ స్నేహ బంధమే ప్రపంచశాంతి సౌహార్ద్రాలకి తోడ్పడగలవని ఆమె దృఢంగా నమ్మింది. ఈమార్పు క్రమంగా రాగలదనినమ్మడం వలననే, అంధకారమయమైన తన జీవితంలో ఓరిమినీ, ప్రశాంతతనీ ఆమె అలవరచుకొన్నది. హెలెన్ అంధకార వాతావరణాన్ని మనం 'టెలివిజన్' ద్వారా సులభముగా తెలిసికొనవచ్చును. టెలివిజన్ తెరముందు కూర్చొనండి. శబ్దం వచ్చే స్విచ్‌ని మూసివేయండి. ఇప్పుడు మీరు చెవిటివారు. హెలెన్‌లా పూర్తిగా చెవిటివారు కాకపోయినా మీరు విన దలచుకొన్న శబ్దాలు మాత్రం వినలేరు. మీకళ్ళుమూసుకోండి. ఇప్పుడు మీరు అంధులు. ఈ పరిస్థితులను ఊహించుకొని, మీరు కూడా మీ జీవితయాత్రని ధైర్యంగా సాగించాలి!! హెలెన్‌కి జీవితముందుండే ఆసక్తి అంతగొప్పది. హెలెన్‌ని చూడడానికివచ్చిన ప్రతి ఒక్కరూ తమ్ముతాముమరచి ఆమెతో ఐక్యమౌతారు! జో డేవిడ్ సన్ అన్నట్లు !! హెలెన్‌తో వున్నప్పుడు మనమందరం మంచివాళ్ళం అవుతాం!"

చిన్నతనంలోకంటె ఆమె మనస్సు ఈ వయస్సులో పరిస్థితులకి అనుగుణంగా మార్పు చెందగలదు. కాని ఆమె మనస్సు దృఢమైనది. వాదనకి మారే స్వభావంకాదు ఆమెది. సరియైన కారణంలేనిదే తాను నమ్మిన అభిప్రాయాల్ని మార్చుకోన లేని ధైర్యవంతురాలు. ఐన్‌స్టీన్ చెప్పిన "పవిత్రమైన ఉత్సాహం" ఆమెను నడిపిస్తోంది. లేనిపోని ఆడంబరంకాని దైన్యంకాని, అహంభావంకాని వాస్తవాన్నుంచి ఆమెను వేరు చేయలేవు. వాస్తవిక దృక్పథంతోనే ఆమె జీవిత సమస్యల్ని ఎదుర్కొంటుంది. అందుచేతనే పరాజయం అన్నది ఆమెఎరుగదు.

ప్రభాత సమయంలో ప్రతి దినం అనాఘ్రాత పుష్పాల పరిమళాల్ని ఆస్వాదిస్తూ, మంచుబిందువులతో కూడిన పచ్చిక పరుపుల మీద నడచివెళ్ళివస్తుంటుంది హెలెన్ ఈ నాటికీ! దారిలో ఒక రేగుపండునో, ద్రాక్షపండునో కోస్తూ, ఒక గులాబీ పువ్వునో, మరువం రెమ్మనో విదుల్చుతూ, పూల నుంచి వేచిన పుప్పొడి సువాసనని ఆఘ్రాణిస్తూ చేలలో వేసే ఎముకలపోడి ఘాటుని కనిపెడుతూ, ఆమె అనుదినం ఉదయం వాహ్యాళికి వెళ్ళివస్తుంటే ఆమెతో వున్న ఏ మామూలు మనిషైనా ఆమె ఇంద్రియాల అతీతశక్తులకి విస్తుపోతాడు!

తానొక విశిష్టవ్యక్తిననే సంగతి ఎవరో ఒకరు జ్ఞాపకం చేస్తే కాని, ఆమెకు అధ్యాసవున్నట్లే కనుపించదు. పత్రికా విలేకరులు తరుచువచ్చి పొగడ్తలతో ముంచివేయడం ఆమెకి కష్టంగావుంటుంది. ఇదివినా, పత్రికా ప్రపంచంమీద ఆమెకు ఎంతో గౌరవంవుంది. "నాకార్యకలాపాలలో పత్రికలవారెంతో

తోడ్పడినారు.” అని చెప్పింది హెలెన్. తక్కిన సామాన్య ప్రజల నుండి తనను వేరుచేయడం ఆమెకు ఇష్టంలేదు. ఆమె జీవితాశయం కూడా ఇదే!

గాయపడిన సైనికులమధ్య హెలెన్ వున్నప్పుడు, చికిత్స పొందుతూన్న సైనికులు ఆమెను తమ ఆప్తురాలిగా భావించి, గౌరవించినప్పుడు ఆమె ఆనందానికి మేరలేకపోయింది. ఈవిధమైన గౌరవాలను తాను ఏవిధమైన సంకోచం లేకుండా హృదయ పూర్వకంగా స్వీకరించగలనని ఆమె చెప్పింది! ఎప్పుడైనా ఏసంస్థ ఐనా తనను గౌరవించడానికి నిశ్చయించి నప్పుడు అలాంటి నిర్ణయంచేసేముందు తనబధిరత్వాన్ని, అంధత్వాన్ని లెక్కలోనికి తీసుకొనరాదని ఆమె అభిప్రాయం.

ఆమె జీవితంలో పరాజయం, ఆశాభంగం, విచారం ఆమెను కలిగినమాట వాస్తవమే. ఈలాంటి మహోపద్రవాలు ఆమె జీవితకాలంలో రెండు పర్యాయములు సంభవించాయి. వీటిలో మొదటిది 1936వ సంవత్సరంలో ఉపాధ్యాయిని సల్లివాన్ మృతి. దాదాపు అర్ధశతాబ్దకాలం ఒకరినొకరు విడువక, ఒకరి కష్టసుఖాలలో మరియొకరు పాల్గొంటూ, ఒకరిని విడచి మరియొకరు మనడమే అసంభవం అనేవిధంగావున్న హెలెన్ సల్లివాన్‌ల సహకార జీవనానికి అఘాతం వాటిల్లింది. సల్లివాను భౌతిక దేహానికి అంత్యక్రియలు జరిపేరోజుకి ముందు రోజున ఒక పత్రికా విలేకరి, ఇంట్లో అడుగు పెడుతూ!! ఇంకేముంది, నాటకం ఆఖరయింది!” అన్నాడు. అదృష్టవశాత్తూ ఆ విలేకరిపేరూ, పత్రిక పేరు ఎవరికి తెలియదుకాని; అతనింకా

జీవించి వుంటే వార్తా పత్రికల్ని చదువుతూనే వున్నాడని భావిద్దాం!!

సల్లివాన్ మరణానంతరం కొన్ని నెలలతరువాత అంధుల తరఫున ఉపన్యాసాలివ్వడానికి తనసహవాసిని పోలీథామ్సన్‌తో జపాను వెళ్ళింది. అంతకుముందు 1931వ సంవత్సరంలో ఇదేపని మీాద యుగోస్లావియా వెళ్ళినపుడు అంధులకు ఆమెచేస్తూన్న సేవని ప్రశంశిస్తూ కింగ్ అలెగ్జాండర్ ఆమెకు ఒక పతకాన్ని బహూకరించాడు; తొలిసారిగా ఆమె బహుదూరపు ప్రయాణం చేసినది 1937 లో జపాన్‌కె వెళ్ళడమే. ఆతరువాత ప్రపంచమే ఆమెకు సేవారంగమైంది.

'అమెరికన్ ఫౌండేషన్ ఫర్ బ్లైండ్' 'అమెరికన్ ఫౌండేషన్ ఫర్ ఓవర్‌సీస్ బ్లైండ్' సంస్థల కౌన్సిలర్‌గా, అసంఖ్యాకమైన అంధుల సంస్థల, ప్రభుత్వముల సహాయ సహకారములతో హెలెన్ పూర్వ, పశ్చిమార్ధగోళాలలో వివిధ దేశాలను సందర్శించి, అంధుల సంస్థల నిర్వహణాలో అనేక నూతన పద్ధతులను ప్రవేశపెట్టి, వారికి పాఠశాలలు, ముద్రణాలయాలు, పరిశ్రమల కేంద్రాలు స్థాపించడంలో తోడ్పడి, అంధులకు ఒక నూతన మార్గాన్ని చూపించి వారిపాలిట ఆశాజ్యోతి అయింది.

యుద్ధములో అంధులైనవారి పునరావాస సమస్యలపై తన సలహా ఇవ్వడానికి అక్కడి పరిస్థితులను స్వయంగా పరిశీలించడానికి వెళ్ళినప్పుడు, ఆమె జీవితంలో రెండవ ఉప

ద్రవం సంభవించింది. 'కనెక్టికట్'లో వున్న ఆమెఇల్లు దగ్ధమైపోయింది. ఆమె ప్రాణతుల్యంగా భద్రపరచుకున్న జ్ఞాపకచిహ్నాలు, అమూల్యమైన పుస్తకాలయం, ఉత్తరాలు, కాగితాలు, అన్నిటికంటె ముఖ్యంగా తాను వ్రాస్తూన్న సల్లివాన్ జీవితచరిత్ర దగ్ధమైపోయాయి–ఈ దుఃఖవార్త నిని ఆమె భరించలేకపోయింది. అయినా తన కర్తవ్యాన్ని తాను నెరవేర్చింది!–ఆమె ఇల్లు దగ్ధమైపోయినా "అంతరాత్మ అనేఇల్లు భద్రంగానేఉంది. హెలెన్ స్నేహితులు ఆమెకు ఒక కొత్త ఇంటిని కట్టిఇచ్చారు. క్రమంగా ఎప్పటి ఉత్సాహాన్నో కూడ దీసుకొని సల్లివాన్ జీవితచరిత్రని పూర్తి చేసింది. ఈ పనిని తాను పూర్తి చేసి వుండకపోతే అదిక్షంతవ్యంకాని మహాపరాధంగాభావించి వుండేది. "టీచర్–ఎట్రిబ్యూట్ టూ యానీసల్లివాన్ మేసీ, బైది ఫాస్టర్ చైల్డ్ ఆఫ్ హెర్ మైండ్" అనే ఈ పుస్తకం ఇటీవలనే ప్రచురణార్థం పంపబడింది. ఈ పుస్తకం ప్రచురణ కర్తలకి పంపగానే హెలెన్ దూర ప్రాచ్యాన్నీ, భారతదేశాన్నీ సందర్శించడానికి బయలుదేరింది. వేలకొలది మైళ్ళు ప్రయాణంచేసి, లెక్కలేనన్ని ఉపన్యాసాలివ్వడానికి హెలెన్ బయలుదేరే సమయంలో. ఈ ప్రయాణం నుండి తిరిగి అమెరికా రాగానే, ఆమె 'రిటైర్' కాబోతున్నదనే వదంతులు బయలుదేరాయి. హెలెన్ వద్దనుండి మాత్రం ఇవి రాలేదు "బహుశా నేను చేసే దూర ప్రయాణాలలో ఇదే ఆఖరు కావచ్చు"నని ఆమె అన్నమాట వాస్తవమే! 1951లో దక్షిణాఫ్రికా వెళ్లినప్పుడూ, 1952 లో మధ్య ప్రాచ్యానికి

వెళ్ళినప్పుడు, 1953లో లాటిన్ అమెరికా వెళ్ళినప్పుడూ, ఆమె ఈ విధంగానే అన్నది. అందుచేత ఎవరూ పై విధంగా భావించ నక్కరలేదు.

హెలెన్ జీవితంలో 'రిటైర్ మెంట్' అన్నది కష్టమేగాక, అసంభవంకూడా. అనేక సంస్థలలోవున్న తన సభ్యత్వాన్ని ఆమె వదలుకున్నా, ప్రతిదినం వచ్చే వందలకొలది ఉత్తరాలకి ఆమె సమాధానాల నివ్వడానికే దాదాపు ఎనిమిది గంటలు పడుతుంది ప్రతిదినం! ఈ ఉత్తరాలని చేతితో వ్రాయవలసి వస్తే ఆమె ఒక్క ఉత్తరం కూడా వ్రాయగలిగి వుండేది కాదు! ఈ విషయంలో 'టైప్ రైటర్' ఆమెకొక వరంలా దొరికిందనే చెప్పాలి.

ఈమెకు వచ్చే ఉత్తరాలలో అప్పుతీర్చి పెట్టమనో, తాకట్టులు విడిపించమనో, ఉద్యోగంచూసి పెట్టమనో, వధువునో, వరుణ్ణో చూసిపెట్టమనో, కొత్తగా కనిపెట్టబడిన వాటికి డబ్బుపెట్టుబడి పెట్టమనో, పెద్ద పెద్దవాళ్ళకి పరిచయ పత్రాలిమ్మనో, తాముచదువవలసిన విషయాల్ని తెలియజేయమనో, అంగవైకల్యానికి లోనైన తమబిడ్డల విషయంలో ఏమి చేయవలసినదీ సలహా ఇమ్మనో; వారికి వచ్చిన అవకాశాన్ని పోగొట్టమనో (ఆమెచేతిలో ఏదో మాజిక్ వున్నట్లు!) ఈ విధమైన విజ్ఞప్తులతో రకరకాల ఉత్తరాలు వస్తూంటాయి. ఆఖరి ప్రయత్నంగా దగ్గర అంధులనుంచీ, చెవిటివారి దగ్గరనుంచీ బధిరాంధుల వద్దనుంచీ వచ్చే ఉత్తరాలు ఎంతోదయనీయంగా

వుంటాయి! ఇంకొకరకపు ఉత్తరాలున్నాయి. తమకున్న రెండు కండ్లలో ఒక దానిని ఆమెకి అమర్చితే ఆమెకి చూపువచ్చే పక్షంలో, సంతోషపూర్వకంగా మేము ఇవ్వడానికి సిద్ధంగా వున్నామనీ, కండ్లువుండి కూడా ప్రయోజనంలేని మాజీవితాలు ఆవిధంగా ధన్యమౌతాయనీ ఈఉత్తరాలలో వ్రాస్తుంటారు!!! ఆమెజీవించి వుండటమే తమకొక మహాద్భాగ్యంగా వున్నదనీ వేయికాలాలపాటు ఆమె జీవించి వుండాలనీ మరి కొందరు వ్రాస్తారు!

చాల రోజులుగా హెలెన్ స్నేహితులు ఆమెను విశ్రాంతి తీసుకొనవలసినదిగా ఒత్తిడి చేస్తున్నారు. కాని ఈ ఒక సమావేశానికే రావలసిందనీ, ఈ ఒక్క పుస్తకమే వ్రాయవలసిందనీ, అంధులకి తయారుచేయబడిన ఈఒక్క ప్రణాళికనూ పరిశీలించి ఆశీర్వదించవలసిందనీ ఆస్నేహితులే ఆమెను కోరుతూంటారు! ఆమెతన సహజోత్సాహంతో వీటిని నెరవేర్చుతూ వుంటుంది. కాని ఆమెకి కూడా సమస్యలు లేకపోలేదు. ఆమె చేతులే, ఆమెదైనందినజీవితంలో ముఖ్యాంగాలు. రాత్రింబవళ్లు చదవడానికి, టైప్ చేయడానికి, వినడానికి, ప్రతిచిన్నవిషయానికీ వాటినే ఉపయోగించాలి. ఈ పనులన్నిటినీ చేసి చేసి అవి అలసి పోతుంటాయి. మామూలుగా చేసే ఖాతాఖానికి కూడా ఆమె తన వ్రేళ్ళను ఉపయోగించవలసిందే! విరామంలేకుండా పనిచేసి చేసి, మొద్దుబారిపోయిన వ్రేళ్ళను చేతులను చూచి ఆమె చాలా ఆదుర్దాచెందుతూంటుంది. అయినా తనపనికి ఇవేమీ అడ్డురావు!

ఈ బాధలబందీలేవి లేకుండా ప్రశాంతంగా పల్లెసీను లోని ఇంటిలో కూర్చొని, ప్లాటోనీ, తక్కిన వేదాంత గ్రంథాలనీ చదువుకోవాలనీ, తనచిన్ననాటి రోజుల్ని తిరిగి గడపాలని హెలెన్ కలలుగంటూంటుంది. కాని ఇదంతాజరిగే దెక్కడ? ఏ పుస్తకమో పుచ్చుకొని కూర్చొనేసరికి, అత్యవసరంగా ఎక్కడికో (బహుశా ఏ జాంజిబార్‌కో!) రావలసిందిగాపిలుపు వస్తుంది. అంతే, అంతటితో వ్రతభంగమౌతుంది !!

ఇటీవల భారత దేశానికి వచ్చినపుడు హెలెన్ కెల్లర్ ప్రధాని నెహ్రూనీ, ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాద్‌నీ, ఉప రాష్ట్రపతి రాధాకృష్ణనీ కలసికొన్నది.

నెహ్రూ ముఖాన్ని ఆమె తడవిచూచి, ఆతరువాత తన సంతోషాన్ని పట్టలేక, మహోన్నతాదర్శమూర్తి నెహ్రూని స్పృశించగానే నాలో ఒక నూతన భావం ఉదయించింది ! ఆయన ముఖాన్ని తాకడానికి నేను ఆయనఅనుమతిని కోరాను. ఆయన తక్షణందానికి అంగీకరించారు. ప్రశాంత గంభీరమైన, ఆలోచనానిమగ్నమైన ఆయన ఫాలభాగాన్ని స్పృశించి నేను చకితురాలనయ్యాను. ప్రపంచ శాంతి సాధనకోసం నెహ్రూ గావించిన అవిరళకృషి, ప్రపంచ దేశాలలో భారతదేశాన్ని మకుటాయమానంగా చేసింది. ఇంకా నేను భారతీయకవితని గురించీ, భగవద్గీతను గురించీ ఆయనతో మాట్లాడాను. భగవద్గీత ఉత్తమానువాదాలను కొన్నిటిని నాకుచెప్పి వాటిని చదువవలసినదిగా సలహా ఇచ్చారుఅని పత్రికా విలేకరులతో చెప్పింది.

ప్రెసిడెంట్ రాజేంద్ర ప్రసాద్‌నిగురించిచెప్తూ "ఆయన భారతమాత అనుంగుబిడ్డడు. ఆయనలో ఎదుటవారిని ఆకర్షించే ఒక చక్కని సమ్మోహన శక్తివుంది." అని చెప్పింది.

డాక్టర్. రాధాకృష్ణన్‌నిగురించి మాట్లాడుతూ "ఆయనతోడి నా సంభాషణ మరుపురానిది!" అన్నది.

మద్రాసు వచ్చినప్పుడు హెలెన్ కెల్లర్‌కి అనేకసంస్థలు వినతి పత్రాలను సమర్పించాయి. పోలీథామ్సన్ సహాయంతో మద్రాస్ విశ్వ విద్యాలయపు సెనేట్ భవనంలో జరిగిన ఒక బ్రహ్మాండమైన విద్యార్థుల, అధ్యాపకుల సమావేశంలో ప్రసంగిస్తూ విద్యార్థులు వేసినకొన్ని ప్రశ్నలకి ఈక్రింది విధంగా సమాధానం చెప్పింది.

ప్రశ్న:- మీ కళాశాల చదువునిగురించి మీ ఉద్దేశంచెప్పండి.

సమాధానం:- నా కళాశాల చదువు సంతోషంగానే గడచింది. కొన్ని కష్టాలు లేకపోలేదనుకోండి! ఉదాహరణకి గ్రుడ్డివారికి పనికివచ్చే 'బ్రెయిలీలిపి' పుస్తకాలు ఆరోజుల్లో చాలా అరుదుగా వుండేవి. ఎడారిలో ప్రయాణంచేసే ఒంటరిప్రయాణీకునివలె వుండేదాన్ని! 1904వ సంవత్సరం తరువాత బ్రెయిలీలిపిలోకొన్ని పుస్తకాలు వచ్చాయి. అందులో షేక్స్పియర్ నాటకాలు కూడా వున్నాయి. ఆ తరువాత ఎన్నో పుస్తకాలువచ్చాయనుకోండి. ఇప్పుడు మీదేశంలోకూడా అవి చాలా దొరుకుతున్నాయనుకుంటాను.

ప్రశ్న :- మీకళాశాలలో ఏ యే విషయాలను (Subjects) మీరు ఎక్కువ అభిమానంతో చదివారు?

సమాధానం:- రాజకీయశాస్త్రం, వేదాంతం, గణితశాస్త్రం, గ్రీక్, లాటిన్, ఫ్రెంచ్, జెర్మన్,

ప్రశ్న :- అన్నిటిలో మీకు ఎక్కువగా నచ్చిన విషయాలేవి ?

సమాధానం:- వేదాంతశాస్త్రం, దేశచరిత్ర.

ప్రశ్న :- వేదాంతం అటే మీకంత అభిమానమెందుకు ?

సమాధానం:- చీకటికీ, నిశ్శబ్దానికీ, అందని ఉన్నత పథాలకు నన్ను వేదాంతం తీసుకుపోగలిగింది కనుక !

ప్రశ్న :- లెక్కలవిషయమండీ?

సమాధానం:- లెక్కలకీ, నాకూ ఎప్పుడూపడేదికాదు (నవ్వు) కాని ఇప్పుడుదానికి నేను విచారిస్తున్నాను. ఏమంటే సంగీతం, వాస్తుశాస్త్రం, ఇంకా ఎన్నింటికో లెక్కలు ముఖ్యం.

ప్రశ్న :- మీ జీవితంమీద ఏ యే రచయితల ప్రభావం పడిందండీ?

సమాధానం:- ముఖ్యంగా సోక్రటీస్, ప్లేటో మున్నగువారు.

ప్రశ్న :- మీ అంగవైకల్యం వల్ల మీరు నిరుత్సాహం చెందుతారా?

సమాధానం:- చెందను, (హర్షధ్వానాలు) బహుశా నాలో వుండే ఈ అవకరాల ద్వారా. భగవంతుడు నాలాంటి అనేకమంది నిర్భాగ్యులకు సేవ చేయడానికి, నన్నొక సాధనంగా ఉపయోగించు కుంటూన్నాడేమో? గ్రుడ్డి వారిలో చాలామంది శారీరకంగానూ, మానసికంగానూ ఆరోగ్యవంతులే. వారు శరీర కష్టంతో కూడుకొనిన పను లనుకూడా చేయగలరు. పాఠశాలలకి వెళ్ళడానికి వయసు ముదిరిన అంధులకి-సేవచేయడానికి. ఏదో ఒకపనికావాలి. ఈకనీసపు మానవహక్కు వారికివుంది. తాము ఏదో ఒక పనిచేయగలమనే ధైర్యం వీరికి వుంటుంది. కాని ఆ అవ కాశమే వీరికి కల్పింపబడాలి. ఈఅవకాశం కోసమే వీరంతా ఎదురు చూస్తూన్నారు.

అంధుల పునరావాసానికి ప్రభుత్వము, తక్కిన సంస్థలు తప్పక శక్తివంచన లేకుండా తోడ్పడగలరని నేను విశ్వ సిస్తూన్నాను. మద్రాసులో అంధుల సంస్థలు చేసే కృషి అత్యంత ప్రశంసనీయమైనది. అని హెలెన్ కెల్లర్ చెప్పింది.

"మద్రాసు రాష్ట్రంలో బధిరాంధులకి సానుభూతి చూపించే ప్రజలెంతోమంది వున్నారు. వారి సహాయ సహ కారాలతో, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల సహాయంతో మీ నగ రాలలో అనేక పునరావాస కేంద్రాలను స్థాపించ వచ్చును. తద్వారా వారి జీవన ప్రమాణాన్ని కూడా వృద్ధిచేయవచ్చును.

ఈ విధంగా సంఘం మరింత సంపన్నమౌతుంది. మీరంతా సంతోషంతో వర్ధిల్లుతారు”

బధిరాంధప్రజల నీరవ నిబిడాంధకారమయ హృదయాలలో ఆశాజ్యోతిని వెలిగించిన హెలెన్ కెల్లర్ జీవితం నిజంగా ఆదర్శ ప్రాయమైనది. ఆమె ధన్యురాలు!



# పీఠిక

ఈ పుస్తకంలో మన మొక అద్భుతమైన వ్యక్తిని కలసికొనబోతూన్నాం. ఇది ఒక వ్యక్తి జీవితచరిత్ర కనుక "కలసికొను" అనేమాటని ఉపయోగించడమే సమంజసం. ఈ పుస్తకంలో మిస్. కెల్లర్ స్వంతమాటలతో తన జీవిత చరిత్రని మనకి చెప్పబోతూంది. ఒక వ్యక్తి ఏదైనా వ్రాసినప్పుడు దానిలో తన వ్యక్తిత్వాన్ని ఏదో ఒకరూపంలో వ్యక్తం చేయకుండా ఉండడం కష్టం. అందుచేత ఇంకొకరు తననుగురించి వ్రాసిన దానికంటె హెలెన్ కెల్లర్ స్వయంగా తన జీవిత చరిత్రను మనకు చెప్తూంటే ఎంత రసవంతంగా వుంటుందో వేరే చెప్పనక్కరలేదు.

ఈ పుస్తకంలో కొన్నివిషయాలను ఆమె మనకుచెప్పకుండా వదలివేస్తుంది! ఈ విషయాలు అంత ముఖ్యమైనవి కావని ఆమె అనుకొని వుంటుంది. ఎంతటి మహత్తర విజయాలు సాధించినా వాటిని అతి సామాన్యమైన విషయాలుగా పరిగణించడం మహాపురుషుల లక్షణం, సముద్ర తరంగాలలో సాగిపోతూన్న నావ తాను వెంబడించే వస్తువును తన కెరటాలతో తానేముందుకు గెంటినట్లు, మహాపురుషుల గమ్యస్థానం ముందుకు సాగిపోయే వారి పవిత్రపాదాలముందు ముందుగా తొలగుతూంటుంది!

ఉన్నత లక్ష్యాలు, అత్యంత ధైర్య స్థైర్యాలు ఆమె వినమ్రతకి తోడుకాగా, హెలెన్ కెల్లర్ చెవిటి మూగవారిలో 'ఉన్నత విద్య' నభ్యసించిన వారిలో తానే ప్రథమ వ్యక్తి ననే విషయాన్ని ఏమంత అభినందించుకొన దగినదిగా పరిగణించదు. "కళాశాలలలో ప్రతి సంవత్సరం వేనవేలు ఉన్నత విద్య నభ్యసించి, పట్టాలు పొందుతూన్నారు. అందరిలాగే నేనూ విద్యనభ్యసించాను. దీనిలో నన్ను ప్రత్యేకంగా అభినందించ వలసిన విషయం ఏముంది?" అని హెలెన్ కెల్లర్ అన్నదంటే, ఆమె మనస్తత్వాన్ని మనం సులభంగా అర్థం చేసుకోవచ్చు. "అందరివలెనే తానూ వుండడం" ఆమెచేసే ప్రతిపనికీ ఆధార మైనది. ఏ అంగవైకల్యమూ లేని సామాన్య మానవునిలా జీవించవలెననే ప్రగాఢవాంఛయే, తన ఆలోచనలను కార్య రూపంలో పెట్టడానికి తగిన మనోనిశ్చయాన్నీ ధైర్యాన్నీ ఆమెకు కలిగించింది. తన అంగవైకల్యం కారణంగా కలిగిన అవరోధాలను అధిగమించడానికి హెలెన్ కెల్లర్ ఎంతో శక్తిని వినియోగింపవలసి వచ్చేది. అందుచేతనే తాను చేసిన ప్రతి పనినీ, ఎంతో విలువైనదిగా ఆమె పరిగణించేది. ఒకపర్యాయం మేడమ్ మేటర్‌లింక్‌తో మాట్లాడుతూ "మనం ఎవరు అన్నది ముఖ్యంకాదు. మనం ఏమిచేయగలిగాం అన్నదే ముఖ్యం" అని హెలెన్ కెల్లర్ అన్నది. హెలెన్ కెల్లర్ జీవిత చరిత్ర చదువుతూంటే ఏ దృక్పథంలో చూసినా ఆమె జీవితంలో ఒక ఘన విజయాన్ని సాధించినదని నిస్సందేహంగా చెప్పగలం. మార్క్ ట్వెయిన్ అంతటి మహావ్యక్తి "పందొమ్మిదవశతాబ్దపు విశిష్ట

వ్యక్తులలో నెపోలియన్ ఒకడు; హెలెన్ కెల్లర్ ఒకతె." అనడంలో ఆశ్చర్యమేముంది?

తన పందొమ్మిదివ మాసంలో హెలెన్ తీవ్రమైన జ్వరానికి గురిఅయింది. దానివలన ఆమెకు తీవ్రమైన చెవుడు వచ్చి, చూపు, మాట పోయాయి. అంతవరకూ అందరివలెనే వుండే హెలెన్ ఒక్క సారిగా అంధురాలై, చెవిటిదై, మూగదై బాల్యంలో తొలి ఐదు సంవత్సరాలూ అతి విషాదకరంగా గడిపింది. అయినా ఆ అంధకారంలోనే ఆమె మానసికం గానూ, శారీరకంగానూ శక్తివంచనలేకుండ బాహ్యప్రపం చంతో సంబంధం పెట్టుకోనడానికి ప్రయత్నించింది. ఆమెకు ఈ ప్రయత్నంలో చక్కని సహాయంకూడ లభించింది. ఈ విధంగా అంగవైకల్యాన్ని పొందిన ఏశిశువుకూ ఆమెకు సమ కూరినన్ని సౌకర్యాలు లభించలేదనే చెప్పాలి.

హెలెన్ 1880వ సంవత్సరంలో సహజసౌందర్య భరిత మైన వాతావరణంలో, ఒక క్రమబద్ధమైన జీవితాన్ని గడుపు తూన్న సంపన్న కుటుంబములో జన్మించింది. తల్లిదండ్రులు హెలెన్‌ని ఎంతో ప్రేమతో పెంచారు. ఆడుకోనడానికి హెలెన్‌కి తన చిట్టిచెల్లెలు, ఇంకా పెద్దపిల్లలు ఎంతోమంది తన చుట్టూవుండటంచేత ఆమె చిన్నతనం సంతోషంగా గడ చింది. అయినా ఇంటిదగ్గర ఆటపాటలతో మాత్రమే సంతృప్తిచెందక, హెలెన్ బాహ్యప్రపంచంలో ఎంతో దగ్గర సంబంధం పెట్టుకొన్నది. విజ్ఞానశాస్త్రంద్వారా ఏవిధమైన సహాయం లభించగలదో అదిఅంతా హెలెన్‌కి ఇవ్వబడింది.

ప్రపంచంలోని అనేక ప్రదేశాలకు తిరగడంవలన ఆమె తన ప్రయాణాలలో వివిధ ప్రదేశాలనిగురించి, ప్రజలనుగురించి ఎంతో విజ్ఞానాన్ని సంపాదించింది. సామాన్యకుటుంబాలలోని పిల్లలకు దొరకని సదుపాయాలెన్నో హెలెన్‌కి లభించాయి.

పదిహేను సంవత్సరాల వయస్సు రాకమునుపే హెలెన్ సుప్రశిద్ధ నేత్రవైద్యుడు డాక్టర్ ఛిస్‌హోమ్‌ని చూడడానికి బాల్టిమోర్ వెళ్ళింది; డాక్టర్ అలెగ్జాండర్ గ్రాహం బెల్‌తో సంప్రదించడానికి వాషింగ్టన్ వెళ్ళింది. అంధులకు బోస్టన్‌లోవున్న 'పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూషన్' లోనూ, 'హోరేస్‌మాన్ స్కూల్'లోనూ కొంతకాలంవుంది. పెన్సిల్వేనియాలోని హాల్టన్‌లో కొంతకాలం ఆమె ఒక ఉపాధ్యాయుని దగ్గర విద్యాభ్యాసంచేసింది. తరువాత 'సింసినాటీ'కి వైద్యులతో సంప్రదించడానికి వెళ్ళింది. ఆతరువాత న్యూయార్క్‌లోని చెవిటివారికి స్థాపింపబడిన 'రైట్‌హ్యూమాసన్'స్కూలుకి వెళ్ళింది—ఇంతేకాక వినోదార్థం నయాగరా జలపాతాన్ని చూడడానికి, చికాగోలో జరిగిన ప్రపంచ వస్తుప్రదర్శనానికీ వెళ్ళింది. ఇంతేకాక హెలెన్‌కి ఎంతోసంతోషాన్ని కలిగించినన్యూ ఇంగ్లండ్ సముద్రతీరానికీ, ఛాంబర్లిన్ దంపతుల నివాసస్థలమైన మసాఛూసెట్స్‌లోని రెడ్‌ఫారంకీ ఆమె వెళ్ళింది.

ఈ ప్రదేశాలకు వెళ్ళినప్పుడు ఆమెతో ఆమె ఉపాధ్యాయిని మిస్. సల్లివాన్ ఎప్పుడూ హెలెన్‌ని విడవకుండా ఉండేది. అప్పుడప్పుడు హెలెన్ తల్లిదండ్రులు, ఒకరిద్దరు

బంధువులూ ఆమెతో వుండేవారు కాని హెలెన్ చాలా భాగం తల్లిదండ్రులను విడచి ఉండవలసివచ్చేది. కాని ఈ ఎడబాటును ఆమె తల్లిదండ్రులు ఎంతో ధైర్యంతో సహించి, హెలెన్‌ని పెంచి పెద్దనిచేసేభారం మిస్. సల్లివాన్‌పైన వుంచారు. అదృష్టవశాత్తూ, ఏతల్లిదండ్రులూ వహించలేని భారాన్ని మిస్. సల్లివాన్ వహించి, హెలెన్ జీవితస్యందనానికి, ఎంతో సమర్థతతో సారథ్యంవహించింది.

కెల్లర్ దంపతులు తమ బిడ్డవిషయంలో ఊహించలేనంత సమర్థతతో మిస్. సల్లివాన్ హెలెన్‌ని తర్ఫీదుచేసింది. నిద్రాణమైన హెలెన్ ఆత్మని జాగృతంచేసి, ఆమెకు ఒక మార్గాన్ని చూపించినది మిస్. సల్లివాన్! సంవత్సరాలతరపడి హెలెన్ కెల్లర్ తన ఉపాధ్యాయిని సల్లివాన్ కండ్లద్వారా చూసింది, చెవులద్వారా విన్నది; కంఠంద్వారా మాట్లాడింది! ఒక్కమాటలో చెప్పాలంటే వారి శరీరాలు వేరైనా ఆత్మలు ఒక్కటే! మేము ఇద్దరం వేరనేసంగతి నాకెప్పుడూ జ్ఞాపకమేరాదు. ప్రకృతి రామణీయకతకి ముగ్ధురాలనై, ఆనందంతో ఉప్పొంగిపోవడం స్వతస్సిద్ధంగా నాలోనేవున్నదో, లేక మిస్. సల్లివాన్ దయవలన నాకు అబ్బిందో వేరుగా చెప్పడం కష్టమె. ఆమెనుంచి నేను వేరుకాదనీ, ఆమె అడుగుజాడలలో నేను పురోగమిస్తున్నాననీమాత్రం నిస్సందేహంగా చెప్పగలను—నాసంతోషం, విజ్ఞానం, నాకోర్కెలు, ఆశయాలు అన్నీ ఆవిడపెట్టినభిక్షే. ప్రేమపూరితమైన ఆమె స్పర్శవల్లనే, నిద్రాణమైన ఈ శక్తులన్నీ నాలో మేల్కొన్నాయి.॥

అంటుంది తరచుగా హెలెన్ కెల్లర్-ఉపాధ్యాయిని మిస్. సలి వాన్. తన చాకచక్యంవల్లనే గాక, ఉదారాశయాలతో, ప్రేమతో తనవిధిని ఆమెఎంతో చక్కగా నిర్వర్తించింది. సల్లి వాన్ సహాయమే లేకపోతే, తన ఆశయాలు, ఆశలు నెర వేరకపోవడమేకాక, దుర్భరమైన అంధకారంలో తడుము కుంటూ, అంగవైకల్యంతో జీవితాంతంవరకూ హెలెన్ కెల్లర్ బాధపడుతూవుండేది.

హెలెన్ అనేక పర్యాయాలు ఆశాభంగాలకి గురి అయింది. తాత్కాలికంగా అపజయాల్నికూడా పొందింది. కాని అవన్నీ ఆమె మహోన్నత లక్ష్యాల నీడలుమాత్రమే. పుట్టుకతోనే శారీరకంగాను, మానసికంగాను హెలెన్ కెల్లర్ మంచిశక్తిని సంపాదించింది, ఉపాధ్యాయిని సల్లివాన్ ఆశక్తిని మంచిమార్గంలో పెట్టింది.

ప్రకృతినుంచి మనం నేర్చుకోనవలసిన పాఠాల ప్రాము ఖ్యతని గుర్తించిన సల్లివాన్ తన శిష్యురాలైన హెలెన్ మన స్సుపై అచిన్నవయస్సులోనే ప్రకృతిప్రభావాన్ని పడేటట్లు చేసింది. ప్రకృతి రమణీయకతకి ప్రసిద్ధిచెందిన దక్షిణ ప్రాంతంలోవున్న హెలెన్ ఇల్లు ఈ తొలిపాఠాలకి ఎంతగానో తోడ్పడింది. ఆ భవనానికి చుట్టూవున్న తోటలోని పువ్వుల నుండి, పండ్లనుండి వచ్చే పరిమళాన్ని హెలెన్ కెల్లర్ గ్రహింపగలిగింది. ఆవిధంగానే అడవి చెట్లపరిమళాన్ని, పొలాలనుండి వచ్చే సువాసననీ ఆమె గ్రహించగలిగింది. తన

చేతితో స్పృశించడంద్వారా ఎదిగే మొక్కలనీ, ఎండ వేడిమినీ, ప్రకృతిలోని అనేకమైన వింతలనీ ఆమె గ్రహింపగలిగింది. ఇంతేకాక కెల్లర్‌కుటుంబానికి చెందిన అనేక పెంపుడు జంతువులని హెలెన్ ఎంతో ప్రేమతో చెలిమి చేసికొన్నది. "బెల్లీ" అనేకుక్క, "బ్లాక్‌బ్యూటీ" అనే పోనీ "నెడ్" అనే గాడిద హెలెన్‌కి మంచి స్నేహితులైనాయి. పువ్వులన్నా, పెంపుడు జంతువులన్నా నేటికీ హెలెన్‌కి ప్రాణం! ప్రకృతికి సన్నిహితంగా వుండేటట్లుచేసి, దానిని అర్థంచేసికొనేటట్లు చేయడంలో మిస్. సల్లివాన్, హెలెన్ కెల్లర్ భావి జీవిత సౌధానికి చక్కని పునాదివేసింది. "అందరినీ ప్రేమించడం, నమ్రత నలవరచుకొనడం" ఈరెండూ సల్లివాన్ హెలెన్‌కి నేర్పిన తొలిపాఠాలు. ఈ సుగుణాలే హెలెన్ జీవితానికి మార్గదర్శకాలైనాయి.

హెలెన్ కెల్లర్ బాల్యంలో ముఖ్యంగా పిల్లలమధ్య తిరుగుతూ, ఆడుకొనడానికి ఎక్కువ అవకాశాలు కల్పింపబడ్డాయి. హెలెన్ చిన్నపిల్లగా వున్నప్పుడు తన ఇష్టంవచ్చినట్లు తిరగడానికి ఆమెని వదలేవారు. ఆవిధంగా తిరుగుతూ, క్రిందపడుతూ, గాయాలుతింటూ తనంతట తానేలేస్తూ లక్ష్యం చేయకుండా తిరుగుతూవుండేది హెలెన్. మిస్. సల్లివాన్ రాగానే ఆమెతో ప్రతిరోజూ చాలాదూరం నడచివెళ్ళేది. శీతకాలంలో ఆ ఇద్దరూ మంచుమీద జారుతూ ఆడుకొనేవారు హెలెన్ గుర్రంమీద స్వారిచేసేది. మూడుచక్రాల సైకిలు తొక్కేది. తెడ్లువేస్తూ పడవకూడా నడిపేది. ఈతనేర్చుకొన

గానే భయంలేకుండా నీటి అడుగునకు మునిగి ఈతకొట్టేది. అంతేకాక అందరితో కలసిమెలసి తిరగడంలో అందరివలనే సామాన్య జీవితానికి అలవాటుపడింది. అనేకరకాల మనుష్యుల్ని కలసికొనడంవలన హెలెన్ కెల్లర్ వారి మనస్తత్వాలనీ, సమస్యలనీ అర్థంచేసుకొనగలిగింది. అందువలననే ఆమె సానుభూతి ఒకరిద్దరియెడల పరిమితంకాక విశ్వజనీనమైనది. ఈ విధమైన సహానుభూతి ఆమె జీవితాన్ని ఏవిధంగా తీర్చిదిద్దినదీ ఈ పుస్తకంలో మనం చదువబోతూన్నాం.

మిస్. సల్లివాన్ తనశిష్యురాలిని తరిఫీదు చేయడంలో ఉపయోగించిన రెండవపద్ధతి "అప్రయత్నంగా ఆపిల్లకు కలిగిన భావాలను" విపులీకరించి, ఆమెకు దానినిగురించి పూర్తిగా తెలియజేయడం-ఏవిధమైన అంగవైకల్యమూలేనీ పిల్లలకు ఈ పద్ధతి చాలామంచిదే. కాని అంగవైకల్యానికి గురియైన హెలెన్‌కి ఈపద్ధతి నవలంబించడం ఎంతకిష్టమైనదో వేరే చెప్పనక్కరలేదు. మొదట ఆమెలో విజ్ఞానతృష్ణ కలిగించాలి; తరువాత ఆమెకు కలిగిన సందేహాలకు తగిన సమాధానాల ద్వారా ఆమెకు విద్యగరపాలి.

హెలెన్ తన చిన్నతనంలో అనేక ఉద్రేకాలకు లోనయ్యేది. కాని తన అవసరాలేమిటో, వాటిని ఏవిధంగా వ్యక్తంచేయాలో తెలియక బాధపడేది. ఈ కష్టాన్ని అధిగమించడానికి మిస్. సల్లివాన్ ఒక ప్రత్యేక పద్ధతిని కనిపెట్టింది. తనచుట్టూ ఏమిజరుగుతూందో హెలెన్ చేతిలో తనవ్రేళ్ళతో

వ్రాసి, "హస్తాక్షరమాల" ద్వారా తెలియజెప్పేది. తమ పరిసరాలను వర్ణించుతూ, తమచుట్టుప్రక్కలనున్న జనం ఏమిచేస్తూన్నదీచెప్తూ వారి సంభాషణలను యథాతథంగా ఈ "అక్షర మాల" ద్వారా సల్లివాన్ హెలెన్ కెల్లర్ కి తెలియజెప్పేది. హెలెన్ తన సమాధానంలో కొన్ని మాటలకి తడబడుతుంటే మిస్. సల్లివాన్ వాటికి హెలెన్ కిచెప్తూ, ఇతరులతో మాట్లాడ టానికి కావలసిన శబ్ద పరిజ్ఞానాన్ని ఎంతో ఓరిమితో హెలెన్ కి కలిగించింది. తనకు అంతవరకూ తెలిసిన మాటల మధ్య ఈ క్రొత్తమాటలను అమర్చుకొనడానికి హెలెన్ ఎంతో శ్రమపడి సాధించేది. ప్రతిచిన్నవిషయాన్నీ తెలిసికొనడానికి హెలెన్ ఎన్నోప్రశ్నలు వేసేది. సల్లివాన్ ఇచ్చేసమాధానా లను అవగాహన చేసికొనడానికి మరికొన్ని ప్రశ్నలువేసేది. మిస్. సల్లివాన్ వాటికి ఎంతో ఓరిమితో సమాధానాలు చెప్పి ఆమెను సంతృప్తిపరచేది

భాషనేర్పడంలోకూడా సల్లివాన్ మొదటినుంచీ హెలెన్ కెల్లర్ కి ఈక్రిందిపద్ధతిని బోధించింది. ఒక వచనంలో మధ్యమధ్య కొన్నిమాటలు తెలియకపోతే, ఆమాటలు తాను చెప్పి వాటిని పూర్తిచేయించేది. హెలెన్ వ్రాయనేర్చినప్పటి నుంచీ ఒక్కతప్పుకూడా లేకుండా ఒక వచనాన్నిగాని, కొన్ని పంక్తులనుగాని అనేక పర్యాయాలు వ్రాయించేది. ఇదేవిధంగా చదవడంలోకూడా తప్పులులేకుండా ఎన్నో పర్యాయాలు వల్లింపజేసేది. ఉత్తమసాహిత్యాన్నే సల్లివాన్ హెలెన్ కు తానుచదివి వినిపించి, తరువాత ఆమెచేత చదివించేది. తాను

చదివినదాని అర్థం తెలియకపోయినా ఎన్నో కొత్తపదాలు హెలెన్‌కు కంఠస్థం కావడంచేత తరువాత తరువాత స్వంత అనుభవంవలన వాటి అర్థాన్ని సులువుగా అర్థంచేసుకో గలిగింది. తాను మాట్లాడేటప్పుడుకూడా ఆయా సందర్భాలలో ఈ మాటలు తమంతటతామే జ్ఞప్తికివచ్చి ధారాశుద్ధితో ఆమె మాట్లాడటానికి ఎంతో తోడ్పడ్డాయి. తన ఆలోచనలను వ్యక్తంచేయటానికి భాష అవసరమైనట్లే, భాషకి అతీతంగా ఆలోచనలు మనజాలవు. క్రొత్తక్రొత్తపదాలను నేర్చుకోనడం వల్ల హెలెన్ మనస్సు వికసించడమేకాక, తన ఆలోచనలను ఈ భాషద్వారా ఆమె వ్యక్తంచేయగలిగింది. భాషను ఒక బోధనాంశంగాకాకుండా, తన ఆలోచనలను వ్యక్తంచేసే సాధనంగా మాత్రమే సల్లివాన్ ఆమెకు నేర్పింది. హెలెన్ స్నేహితులందరిచేతను ప్రశ్నలు వేయించడంద్వారా మిస్. సల్లివాన్ ఆమె మనస్సులో వున్నవిషయాలు, ఆమెకిష్టమైన వాటిని గురించి చెప్పించేది. చదవడం, వ్రాయడం, మాట్లాడటం ఈ మూడు పద్ధతులద్వారా హెలెన్ కెల్లర్ ఎంతో చక్కని శిక్షణను పొందింది. హెలెన్ ఇంత చక్కగా, వ్రాయగలిగిందంటే, మిస్. సల్లివాన్ క్రమశిక్షణ దీనికి కారణమని వేరే చెప్పనక్కరలేదు.

అంగ వైకల్యాన్ని పొందిన పిల్లలకు ఇతరులవలెనే విద్య గరపడం, వారికి ఏవిషయంలో ఎక్కువ ఇష్టంవుంటుందో దానిని నేర్పడం, ఉత్తమ సాహిత్యాన్ని బోధిస్తూ, వారి వారి మనస్సులలోవున్న ఆలోచనలను ఇతరులకు వ్యక్తంచేసే అవ

కాశం కలిగించడం, ఈ మూడు పద్ధతులూ ఆధునిక విద్యా బోధన ప్రమాణాల దృష్ట్యా అంగీకరింపబడినవే. కాని హెలెన్ కెల్లర్ చదువుకొనే ఆరోజులలో ఈ పైపద్ధతులు అంగీకరింప బడలేదు. మిస్. సల్లివాన్ తనంతటతానే అనేక విషయాలను ఒక్కటొక్కటిగా, జాగ్రతగా పరిశీలించడంద్వారా పై పద్ధతులను ప్రవేశపెట్టింది. బోధనా పద్ధతులపై ప్రత్యేకశిక్షణావకాశాలులేని ఆరోజులలో, తన ఇరవైయవయేట మిస్. సల్లివాన్ ఈ నూతన పద్ధతులద్వారా హెలెన్‌ని విద్యావంతురాలిని చేసిందంటే ఆమె ఒక మహత్తర విజయాన్ని సాధించిందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

చిన్నతనంనుంచీ హెలెన్ కెల్లర్ ప్రతిఒక్కరినీ ఎంతో ప్రేమతో చూసేది-లోకంలో అందరూ ఇతరులని ప్రేమతో చూడరనే విషయాన్ని తెలిసికొని హెలెన్ నిశ్చేష్టురాలైంది! జీవితంలో ఈ దురభిప్రాయం ఆమెకి కలగడం నిజంగా దురదృష్టమే! ఎందుచేతనంటే ఎంతటి కఠినాత్ములైనా ఆమె సమక్షంలో సాధువులవడం, సౌమ్యులు ఆమెను హృదయపూర్వకంగా అభినందించడం పరిపాటి!

హెలన్ చిన్నతనంలో జుగుప్సాకరమైన, హేయమైన సాహిత్యాని చదవడంకాని, బీభత్స దృశ్యాల వర్ణనవినడంకాని జరుగకుండా ప్రత్యేకమైన శ్రద్ధ తీసికొనబడింది. కాని ఆమె పెరిగి పెద్దకాగానే తనంతట తాను జీవితపు నైచ్యాన్ని, దయనీయమైన పరిస్థితుల్ని తెలుసుకుంది. అందుచేతనే మేడమ్ మేటర్‌లింక్ చూడడానికి వచ్చినప్పుడు "హెలెన్‌కి తెలియని

విషయమంటూ ఏమీలేదు. ఏవిషయమూదాచకుండా ఆమెకు నేను చెప్పాను. అదీకాక ఆమెకు ప్రతివిషయం అంతబాగా తెలుసు» అన్నది మిస్. సల్లివాన్ (అప్పుడు మేసీసతి.) “ఈ ప్రపంచంలోని కష్టాలగురించి నాకు తెలియనిదేమీలేదు” అని హెలెన్ తనంతటతానే చెప్పింది! తనలాగే అంగవైకల్యానికి గురియైన దురదృష్టవంతులయెడల ఆమెకు ప్రత్యేకమైన అభిమానంవుండేది. తనకు ఏమి సౌకార్యాలున్నాయో, వారికి ఆవిధమైన సౌకార్యాలు లేవని తెలిసికొని ఎంతో బాధపడింది. హెలెన్ కెల్లర్ తన పన్నెండవయేటనే ఒక ప్రదర్శనంద్వారా రెండువేల డాలర్లను ఒక అంధుల పాఠశాల సహాయర్థం సేకరించింది! అంతకుముందే అంధులైన తనస్నేహితులకు తాను అనేకవిధాల సహాయంచేసింది. హెలెన్ కళాశాలలో చదువుతూండగా అంధులకు పనిసౌకర్యాలు కల్పించే ఒక బిల్లుపై మసాచూసెట్స్ లెజిస్లేచర్‌లో మాట్లాడవలసినదిగా ఆమె ఆహ్వానింపబడింది! తరువాత కొద్దికాలానికి న్యూయార్క్‌లో నేత్ర, కర్ణవ్యాధులలో నిపుణులైన వైద్యుల సమక్షంలో ఆమె ప్రసంగించిది. ఆమెకు యుక్తవయస్సు వచ్చినప్పటినుంచీ అంధులసహాయార్థంస్థాపింపబడిన అనేకసంస్థలతో దగ్గరసంబంధం కలిగివుంది. న్యూఇంగ్లండ్ అంధశరణాలయానికి ఆమె ధర్మకర్త్రిగావుండి– అంధులకు పనికివచ్చే ‘బ్రెయిలీ’ భాషలోను, ఎత్తుఅక్షరాలలోను, ఇతోధికముగా పుస్తకములు తీసికొని రావడానికి అమె మహత్తరమైనకృషిని సాగించింది. మేసీసతితో యూరప్‌లో పర్యటించి, ఉపన్యాసాలద్వారా అంధుల సహాయార్థం ఇరవైలక్షల డాలర్లు సేకరించింది.

"తనకంటె దురదృష్టవంతులైనవారికి సహాయం చేయడంలో తన బాధ్యతను గుర్తించి, ఆ లక్ష్యసాధనకై నిర్విరామంగా కృషిచేయడమే" హెలెన్ కెల్లర్ జీవితలక్ష్యం, సర్వజనీనమైన ఆమె ప్రేమయే ఈమహత్తరకార్యానికి ఆమెలో మరింత బలాన్నికూర్చుతూంది! బధిరాంధురాలైన హెలెన్‌ని తనలక్ష్యాన్నుంచి ప్రపంచపు టల్లకల్లోలాలు దూరంచేయలేకపోతూన్నాయి. ఈవిధమైనఏకాగ్రత విద్యాభ్యాసనంలోకూడా ఎంతగానో తోడ్పడింది. తరువాత జీవితసమస్యల నెదుర్కొనడంలోకూడా ఈ ఏకాగ్రత హెలెన్‌కి ఎంతగానో తోడ్పడింది.

బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా "తన లోకము"లో జీవించడం విపరీత పరిణామాలకి దారితీస్తుంది! కాని హెలెన్ కెల్లర్ జీవితచరిత్రచదువుతూంటే ఏఅంగ వైకల్యమూ లేని సామాన్యమానవులకు, హెలెన్ కెల్లర్‌కీ ఎంతసారూప్యం వుందో తెల్లమవుతుంది. తనకుగలిగి అంగవైకల్యానికి అత్యంత ధైర్యంతోనూ సహనంతోను హెలెన్ కెల్లర్ తట్టుకొనగలిగింది కాని, ధైర్యము చాలని మరొకరైతే ఏనాడో ఓటమిని అంగీకరించివుండేవారు! జీవితంలోని హాస్యసంఘటనలు ఆమె దృష్టిని ఎన్నడూ తప్పించుకుపోలేదు. కాని అంగవైకల్యం కారణంగా చేసిన తప్పిదాలకి ఇతరులను ఎన్నడూ ఆమె అపహాస్యంచేసిఎరుగదు! ఇతరుల అభిప్రాయముతో తాను ఏకీభవించకపోయిన వారియెడల గౌరవం ఆమెకు ఎన్నడూ తగ్గలేదు. ఈవిధంగా ఒకరిని ప్రేమిస్తూ. ఒకరిచేతప్రేమింపబడుతూ జీవితపథాన ఆమె పురోగమిస్తూంది. ఆమె సంతోషం నలుగు

రికీ వ్యాపించే లక్షణంకలది! పదహారేండ్ల బాలికగా హెలెన్ పదహారువందల సంత్సరాలు జీవించాలని అనుకునేది! యువతిగాఆమె అప్పుడప్పుడువిచారమును పొందియుండవచ్చునుకాని అవి ఆమెజీవితంలో ఛాయలు మాత్రమే. ఆమె యశస్సు చిరస్థాయిగా వుంటుందనడంలో సందేహంలేదు.



# మొదటి ప్రకరణము

ఒక విధమైన భయంతో ఈ నా జీవితచరిత్రని వ్రాయడానికి ప్రారంభిస్తున్నాను. నా చిన్నతనపు జీవితాన్ని ఆవరించివుండే బంగారపు తెరను తొలగించడానికి నామనస్సు ఎందుచేతనో సంకోచిస్తుంది! స్వీయచరిత్ర వ్రాయడం సులభమైన పనికాదు. నా చిన్ననాటి అనుభవాలను, ఈనాటి నా జీవితంతో పోల్చిచూస్తే ఏది వాస్తవమో, ఏది భ్రమో విడిగా చెప్పడం కష్టమే. కాని, నా చిన్ననాటి అనుభవాలు కొన్ని మరపురాకుండా, నేటికీ జ్ఞాపకం వస్తూనేవుంటాయి. "ఈ జైలు జీవితపు తక్కిన అనుభవాలుమాత్రం ఛాయామాత్రంగానే వుండిపోయాయి!" అంతేకాక అనేక క్రొత్తవిషయాలను కనుగొన్న ఉత్సాహాతిశయంలో నా చిన్నతనపు సంఘటన లెన్నో వాటి ప్రాధాన్యతని కోల్పోయాయి. అందుచేత మీకు విసుగుకలిగించకుండా ఆ సంఘటనలలో ముఖ్యమైన వాటిని మీకు ఈ పుస్తకంలో వివరించడానికి ప్రయత్నిస్తాను.

ఉత్తర అలబామాలోని టస్కంబియా అనేపట్టణంలో 1880 వ సంవత్సరం జూన్ 27 వ తేదీని నేను పుట్టాను. స్విట్జర్లాండ్ దేశస్థుడైన కాస్పర్ కెల్లర్ కుటుంబానికి చెందినవాడు మా తండ్రి. ఆయనతరువాత మేరీలాండ్ లో స్థిరనివాసం

ఏర్పరచుకొన్నాడు. మా పూర్వీకులలో స్విస్‌జాతికి చెందిన ఒకరు జ్యూరిచ్‌లో చెవిటివారికి ఉపాధ్యాయునిగా ఉండేవారు. ఆయన చెవిటివారికి విద్యనేర్పడం విషయంలో ఒక పుస్తకాన్నికూడా వ్రాశారు. నాకు పూర్వం మాకుటుంబంలో పుస్తకం వ్రాసిన సందర్భం ఇది ఒక్కటే ననుకుంటాను.

కాస్పర్ కెల్లర్ కొడుకైన మా తాత అలబామాలోని విశాలమైన ప్రదేశాలు కొని అక్కడే స్థిరపడిపోయాడు. ప్రతి సంవత్సరం మా తాత టస్కంబియా నుంచి ఫిలడెల్ఫియాకి దాదాపు 760 మైళ్ళ దూరం గుర్రంమీద వెళ్ళి, వ్యవసాయానికి కావలసిన వస్తువులన్నీ కొని తెచ్చేవాడు. ఈ ప్రయాణపు విశేషాలు తెలియజేసే ఉత్తరాలెన్నో నేటికీ వున్నాయి.

మానాయనమ్మ కెల్లర్, అలెగ్జాండర్ మూర్ కూతురు; వర్జీనియా గవర్నర్ అలెగ్జాండర్ స్పాట్స్‌వుడ్ మనుమరాలు. మా నాయన ఆర్థర్ హెచ్. కెల్లర్ కాన్ఫెడరేట్ ఆర్మీలో కెప్టెనుగా పనిచేశాడు. మా అమ్మ కేట్ ఆడమ్స్ ఆయనకు రెండవ భార్య. ఆయనకంటె వయస్సులో బాగా చిన్నది కూడా!

నాకు జబ్బుచేసి చూపుపోయి, చెవుడు వచ్చినరోజుల వరకూ నేను ఒక పెద్ద చదరపుగది, ఇంకొక చిన్నగది వున్న ఇంట్లో వుండేదాన్ని. ఆ చిన్నగదిలో మా నౌకరు ఒకనీగ్రో కుర్రవాడు నిద్రపోయేవాడు. మిస్. సల్లివాన్ నాకు చదువు చెప్పడానికి వచ్చిన మొదటిరోజులలో నన్ను ఈ ఇంటికే తీసుకువెళ్ళి కొద్ది వారాలవరకూ నన్ను ఒంటరిగా తనతో

వుంచుకొని, నాకు క్రమశిక్షణ అలవాటు చేసింది. మాకు భోజనంకూడా ఇంటిదగ్గరనుంచి ఇక్కడికి వచ్చేది. మాకు కావలసినప్పుడు ఆ నీగ్రో నౌకరు నిప్పుచేయడం, తక్కిన చిన్నపనులు చేసేవాడు. మా దేశపు దక్షిణప్రాంతాన్ని కాపురముండే ఇంటికి దగ్గరలో అవసరం వచ్చినప్పుడు ఉప యోగించడానికి ఇంకొక చిన్న కట్టడం నిర్మించడం ఆచారం. ఇలాంటి కట్టడాన్నే మా నాయన అంతర్యుద్ధంతరువాత కట్టాడు ఆయన మా అమ్మని పెళ్ళి చేసుకోగానే ఇద్దరూ ఈ ఇంట్లో కాపురంపెట్టారు. ద్రాక్షతీగలు, తీగగులాబి, జూకామందా రాలు ఈ ఇంటిపైకి గుబురుగా ప్రాకి అది ఒక పొదరింటిలా వుండేది.

పచ్చగులాబీలు, మెట్టతామరలు వరండాముందుభాగం లో ఒక తెరలా వరండాని కప్పుతూవుండేవి. తేనెటీగలు, చిన్నచిన్నపక్షులూ ఎడతెరిపి లేకుండా ఏటి పువ్వులచుట్టూ తిరుగుతూ ధ్వని చేస్తూవుండేవి. కెల్లర్ కుటుంబం నివసించే పెద్దభవంతి 'ఐవీగ్రీన్' ఈ గులాబి పొదరింటికి దగ్గరలోనే వుంది. ఆ ఇంటి ప్రహరీని తక్కిన చెట్లనీ 'ఇంగ్లీష్ ఐవీ' తీగలు గుబురుగా అల్లుకొని వుండటంవల్ల దీనికి 'ఐవీగ్రీన్' అనే పేరు పెట్టారు. ఈ భవంతికి ఆనుకొనివున్న పురాతనపుతోట నా చిన్నతనంలో ఆడుకొనడానికి ఒక స్వర్గసీమలా వుండేది!

మిస్. సల్లివాన్ రాకముందే మా తోటకి నలుచదరం గా వేసిన చెట్లకట్టవని వరుసగా తాకుతూ నడిచివెళ్ళేదాన్ని. గాలితోపాటు వచ్చే సువాసననిబట్టి ఊదాపూవులనీ, కలువ పూవులనీ గుర్తించగలిగేదాన్ని! ఎప్పుడైనా కోపము వచ్చి

నప్పుడు నా వేడిముఖాన్ని చల్లటి ఆకుల్లోను, గడ్డిలోను దాచుకొని ఊరటను పొందేదాన్ని. ఆ పూలతోటలో ప్రపం చాన్నే మరచిపోయి సంతోషంతో ఉప్పొంగిపోతూ ఒక చోటునుంచి ఇంకొకచోటికి తిరుగుతూవుంటే ఎంతహాయిగా వుండేది! ఆఖరికి ఆ తోటచివర కాలిపోయిన వేసవి విడిది పైకప్పునికప్పిన ద్రాక్షతీగని తగలగానే అది ఫలానాఅని ఇట్టే తెలుసుకొనేదాన్ని! ఇక్కడకూడా తీగలనుండి వ్రేలాడే రక రకాల పూలు, తీగమల్లెపూలు, ఎంతో చక్కని సువాసనని వెదజల్లేవి. అక్కడే అపురూపంగా పరిమళాన్ని వెదజల్లే 'సీతాకోకచిలుక కలువలు' (ఈపూలరేకులు సీతాకోకచిలుక రెక్కలవలె వుంటాయి) ఎంత నాజూకుగావుండేవి! అన్నిటి కంటే గులాబిఅంటే నా కెందుచేతనో చెప్పలేనంతఅభిమానం. ఈదక్షిణపు ఇంటిదగ్గరవుండే తీగగులాబులు మా ఉత్తరపు మకాం దగ్గర వుండేవికావు. ఈ దక్షిణపు ఇంటి వసారాపై మంచి పొడుగుపాటి తోరణాలవలె ఈ తీగగులాబులు వ్రే లాడుతూ వాతావరణాన్ని పరిమళభరితంచేసేవి. ఉదయం మంచునీటితో కడగబడిన ఈ పూలగుత్తుల సువాసన మన స్సుని మత్తెక్కించి, 'ఇది నందనవనం కాదుకదా' అనిపించేది!

చాలమంది వలెనే నా జీవితపు తొలిరోజులు అతి సామాన్యంగా గడచిపోయాయి. ఏ కుటుంబంలోనైనా తొలి బిడ్డని ఎంతో గారాబంగా పెంచుతారు. అదేవిధంగా నేనూ ఎంతోగారాబంగా పెరిగాను, మొట్టమొదటిబిడ్డకు పేరుఘనం గా పెట్టాలనేవిషయంమీద తర్జనభర్జనలు జరిగాయి. మా నాయన నాకు మా పూర్వీకురాలైన 'మిల్డ్రెడ్ కేంప్‌బెల్'

పేరు పెట్టాలని నిశ్చయించి, ఇది తన తుదినిర్ణయమనీ, ఇక తర్జనభర్జనలలో తాను పాల్గొనటంలేదనీ చెప్పి వెళ్ళిపోయాడు. 'మిల్డ్రెడ్ కేంప్‌బెల్' అంటే ఆయనకు చెప్పలేనంతఅభిమానం తన తల్లిపేరు 'హెలెన్ ఈవ్రెట్' నాకుపెట్టాలని మాఅమ్మ పట్టుపట్టింది. నన్ను చర్చికి తీసుకువెళుతూండగా హడావిడిలో మా నాయన దారిలో ఈ పేరు మరచిపోయాడు! తీరా చర్చిలో మతగురువు 'పిల్లపేరు ఏమిటని అడిగేసరికి' ఈపిల్లకి అమ్మమ్మపేరు పెట్టాలని అనుకున్నామనీ ఆ ముసలావిడపేరు హెలెన్ ఆడమ్స్ అనీ చెప్పాడు!

బాగా చిన్నతనంలోనే ఎంతో తెలివితేటలతో చూసిన విషయాన్నల్లా 'ఇది ఫలానా' అన్నట్లు చేతులువూపుతూ చెప్పేదాన్నిట! ఇతరులు ఏమిచేస్తూంటే దానిని నేనుకూడా చేసి చూపించేదానినట. ఆరవమాసంలోనే 'హౌ డూయూ' అని చిలుకపలుకుల్లా వల్లించానుట! ఇంతకంటె ఆశ్చర్యకరమైన విషయం 'టీ, టీ, టీ' అని స్పష్టంగా మాట్లాడుతూ అందరినీ ఆశ్చర్యంలో ముంచానుట! నాకుజబ్బుచేసి వినేశక్తి, చూపు పోయినతరువాతకూడా చిన్నతనంలో నేను నేర్చుకొన్న మాటలలో ఒకటిమాత్రం నాకు బాగా జ్ఞాపకంవుంది. అది 'వాటర్' అన్నమాట. నాకు మాట్లాడేశక్తి పోయిన తరువాతకూడా 'వాటర్' అని పలుకడానికి చాలాశ్రమపడ్డాను కాని ఆ మాట వర్ణక్రమం నేర్చుకొన్నతరువాత 'వా-వా' అని మాత్రం అనగలిగాను.

నాకు ఒకేఒకటి సంవత్సరపు వయస్సులో నేను నడచినట్లు నాతో చెప్పారు. నాకు మాఅమ్మ నీళ్ళుపోసి ఒడిలో

కూర్చోపెట్టుకొన్న సమయంలో ఎండలో అటూఇటూ కదలే ఆకులనీడని చూచి, మా అమ్మఒడిలోనుంచి నునుపైన నేల మీదికి తటాలున జారి ఆ కదిలే ఆకుల నీడలదగ్గరికి పరుగెత్తే దానినట! కాని ఆ కుతూహలం తగ్గిపోగానే ఇంక నిలబడలేక క్రిందపడిపోయి మా అమ్మవైపు చేతులుచాపి ఎత్తుకొనమని ఏడ్చేదానినట !

కాని ఈ సంతోషం ఆట్టేరోజులు వుండలేదు. పక్షుల కిల కిలారావాలతో వసంతకాలం ఇట్టే గడచిపోయింది. గులాబిపూలతో, పండ్ల గుత్తులతో వేసవి గడచిపోయింది. ఆకు రాలు కాలం కెంపు, బంగారువన్నె కాంతులతో కళ్ళ ముందునుంచి తరలిపోయింది. అంతటితో భయంకరమైన ఫిబ్రవరిమాసం ప్రవేశించింది. నాకువచ్చిన వ్యాధి చెవుల ద్వారా వినే శక్తినీ, కన్నులద్వారా చూచే శక్తినీ కబళించి, దారుణాంధకారంలో నన్ను ముంచివేసింది. అప్పుడే పుట్టిన పసిపాపవలె నాలో వ్యక్తావ్యక్త వివేచన నశించింది. తల లోనూ, పొట్టలోనూవుండే రక్తనాళాలు గడ్డకట్టుకుపోవడం వల్ల ఈ వ్యాధివచ్చిందని అందరూ అన్నారు. బహుశా నేను జీవించనేమోనని డాక్టర్ చెప్పాడు. కాని, ఒకనాటి ఉదయం ఆకస్మాత్తుగా జ్వరం తగ్గిపోయింది! ఎంత వేగంగా జ్వరం వచ్చిందో, అంత వేగంగా జ్వరం తగ్గిపోవడం చూసి మా ఇంట్లో అందరూ సంతోషం పట్టలేకపోయారు. కాని ఒక్కరూ, ఆఖరికి డాక్టర్ కూడా నాకు చూపూ, వినపడడం శాశ్వతంగా పోతుందని అనుకోలేకపోయారు !

ఆ జ్వరం ఇప్పటికీ నాకు కొంచెం జ్ఞాపకం వుంది.

కలతనిద్దురలో మధ్యమధ్య ఉలిక్కిపడి పైకిలేవడం, విపరీతమైన బాధతో మూలుగుతూండగా మా అమ్మ ఆప్యాయంగా నన్ను బుజ్జగిస్తూ తనదగ్గరకి తీసుకోనడం ఎప్పటికీ నాకు మరపురాదు. ఆ జ్వరతీవ్రతలో విపరీతమైన వేడితో వేగిపోయే నా పొడికన్నులను గోడవైపుకి తిప్పుకోనేదాన్ని వెలుతురు చూడలేక! అంతవరకూ ఎంతగానో ప్రేమించే వెలుతురు నానాటికీ దూరమైపోసాగింది. చెదురు మదురుగా గుర్తుకువచ్చే ఈ సంఘటనలు నాకు ఒక పాడుకలగా మాత్రమే మిగిలిపోయాయి. క్రమంగా ఈ నిశ్శబ్దానికీ, అంధకారానికీ అలవాటుపడిపోయాను. కాని నాకీ మార్పు మార్పుగానే కనుపించలేదు! నా ఉపాధ్యాయిని మిస్ సల్లివానే వచ్చి దీర్ఘ తమస్సులో మునిగివున్న నా ఆత్మని మేల్కొల్పింది. కాని, నా జీవితపు తొలి పందొమ్మిది మాసాలలోనూ చూచిన సువిశాలమైన పచ్చని పొలాలూ, కాంతివంతమైన ఆకాశం, పువ్వులతోనూ, పండ్లతోనూ నిండిన చెట్లూ, వీటి మధురస్మృతులను నా వ్యాధి మనోవీధినుండి పూర్తిగా తుడిచివేయలేకపోయింది. ఒక్కసారి వెలుతురు చూసినప్పుడు ఆ వెలుతురు మనకి చూపించినవాటిని మనం ఎలా మరచిపోగలం ?



# రెండవ ప్రకరణము

నాకు జబ్బుచేసినతరువాత కొన్ని నెలలవరకూ ఏమి జరిగిందో నాకేమీ జ్ఞాపకం రావటంలేదు. మా అమ్మ ఇంటిపనులు చేసుకుంటూండగా కొంగుపట్టుకొని ఆమె వెంట నడవడం, ఆమె కూర్చున్నప్పుడు ఒడిలో కూర్చోనడం మాత్రం నాకు జ్ఞాపకమున్నాయి. నా చేతులుతాకిన ప్రతి వస్తువునీ, ఫలానా అని గ్రహింపగలిగేవి. చుట్టుపట్ల ఏ వస్తువు కదలినా ఆ కదలికనుబట్టి వానిని గ్రహించేదాన్ని. ఈవిధంగా ఎన్నో విషయాలు తెలిసికొన్నాను. త్వరలోనే ఇతరులతో నాలోని అభిప్రాయాలు చెప్పాలని ఎంతో ప్రయత్నించి, మోటసంజ్ఞలద్వారా నా అభిప్రాయాన్ని వ్యక్తం చేయడానికి ఎంతో ప్రయత్నించాను. తల అటూ ఇటూ కదలిస్తే "కాదనీ" తల ముందుకివంచితే ''అవుననీ'' చేతిని తనవైపు లాగుకుంటే "రమ్మని" ముందుకుతోస్తే "పొమ్మనీ" ఈ గురుతులతో సంజ్ఞలుచేసేదాన్ని. నాకు రొట్టెకావలిస్తే రొట్టెను చీలికలుగా కోయడం, వాటికి వెన్నరాయడం చేతితో చూపించేదాన్ని. భోజనానికి 'ఐస్‌క్రీమ్' తయారు చేయమని మా అమ్మతో చెప్పడానికి నీటిని గడ్డకట్టించే యంత్రం ఏ విధంగా పనిచేస్తుందో ఆవిధంగా సంజ్ఞలుచేసి,

తరువాత చల్లదనాన్ని సూచించడానికి శరీరాన్ని వణకించే దాన్ని. గుర్తులద్వారా మా అమ్మ నాకెన్నో విషయాలు సులభంగా నేర్పింది. ఫలానా వస్తువు తెమ్మని మా అమ్మ చెప్పగానే మేడమీదికిగాని, ఇంట్లో ఏ భాగానికైనాగాని క్షణంలో వెళ్ళి ఆ వస్తువుని తెచ్చి మా అమ్మకి ఇచ్చేదాన్ని. ఎంతో ప్రేమతో నన్ను పెంచి, తన తెలివితేటలను నాకు పంచిఇచ్చిన మా అమ్మకి నేను సదా ఎంతో ఋణపడి వున్నాను.

నా చుట్టుప్రక్కల ఏమిజరుగుతున్నదీ సులభంగా నేను గ్రహించేదాన్ని. నాకు ఐదేళ్ళ వయస్సువున్నప్పుడే ఇంటికి తెచ్చిన ఇస్త్రీగుడ్డల్ని జాగ్రత్తగా మడతపెట్టి, ఇంట్లో దాచడం నేర్చుకున్నాను. నా గుడ్డల్ని తక్కినవాటినుంచి వేరుచేసుకొనడంకూడా నాకు అలవాటైంది. మా అమ్మా, అత్తా వేసుకొన్న దుస్తులనిబట్టి బయటికి వెళ్ళబోతూన్నట్లు తెలిసికొని నన్నుకూడా తీసుకువెళ్ళమని ప్రాధేయపడేదాన్ని. మా ఇంటికి అతిథులువచ్చినప్పుడు సంతోషంగా కాలక్షేపం చేయడానికి నే నెక్కడవున్నా కబురుపంపించేవారు. ఆఖర్ని అతిథులు వెళ్ళిపోయేటప్పుడు నేనే చేతులు ఊపుతూ వారికి "టా టా" చెప్పేదాన్ని.

ఒకనాడు కొంతమంది మా అమ్మని చూడటానికి వచ్చారు. ఏధితలుపుల శబ్దాన్నిబట్టి ఎవరో అతిథులువచ్చినట్లు గ్రహించి, క్షణంలో మేడమీదికి పరుగెత్తి అతిథులు వచ్చి నప్పుడు వేసుకొనే దుస్తులువేసుకొని, అద్దంముందు నిలుచుని అందరూ చూసేటట్లే తలకి నూనెరాసుకొని, మొగంనిండా

పౌడరు మెత్తుకొని, ఆ తరువాత ముఖాన్ని పూర్తిగా కప్పి, మడతలు మడతలుగా బుజాలక్రిందకి వ్రేలాడేటట్లు మేలి ముసుగు వేసుకొని, నడుముకి చుట్టూ ఎత్తుగా గుండ్రంగా బుట్టలా ఉండే ఉల్లిపొరమడతల పరికిణీని కట్టుకొని అతిథులకు స్వాగతం చెప్పడానికి క్రిందికి వెళ్ళాను. ఈవిధంగా ఇతరులు ముస్తాబుచేసుకొనడం నేను చాలాసార్లు చూశాను.

తక్కిన అందరి జీవితమువలెగాక నా జీవితము వేరనే విషయం నేను ఎప్పుడు గ్రహించినదీ నాకు జ్ఞాపకంలేదు. కాని నా ఉపాధ్యాయిని రాకపూర్వమే ఈ సంగతి నేను గ్రహించాను. మా అమ్మ, నా స్నేహితులు నాలాగ సంజ్ఞలుచేయక, ఏదైనా చెప్పవలసివచ్చినప్పుడు నోటితోనే చెప్పేవారనే సంగతి నేను గ్రహించాను. ఒక్కొక్కప్పుడు ఇద్దరు మాట్లాడుకొంటూండగా నేను వారి పెదిమల్ని తాకే దాన్ని. కాని వాళ్ళు మాట్లాడుకొంటూన్నది అర్థంకాక విసుగుకొనేదాన్ని. నా పెదిమల్ని కదల్చుతూ, నా శక్తి కొలదీ ఏవేవో సంజ్ఞలుచేసేదాన్ని. కాని దీనివలన ఏ విధమైన ఫలితమూ లేకపోయేది. ఇక కోపం పట్టలేక కాళ్ళూ, చేతులూ తన్నుకుంటూ బిగ్గరగా అరచి, అరచి బాగా అలసిపోయేదాన్ని. నా చిన్నతనంలో ఎంతో పెంకిగా వుండేదాన్ని. నాకు బాగా కోపంవచ్చినప్పుడు నర్సు 'ఎల్లా'ని కోపం తీరేవరకూ కొట్టేదాన్ని. కాని కోపం తగ్గిపోగానే 'ఎల్లా'ని ఎందుకు కొట్టేనా అని బాధపడేదాన్ని. కాని నాకు కావలసిన వస్తువు నాకు రానప్పుడుమాత్రం ఈ పశ్చా

త్తాపం ఎక్కడికిపోయేదో కాని మా 'ఎల్లా'కి మాత్రం దెబ్బలు తప్పేవికావు మళ్ళీ !

మా వంటమనిషికూతురు మార్తా వాషింగ్టన్ అనే నల్లపిల్లా, 'బెల్లీ' అనే వేటకుక్కా నన్నెప్పుడూ విడవకుండా వుండేవారు. నేనుచేసే సంజ్ఞల్ని అర్థంచేసుకొని, మార్తా వాషింగ్టన్ నేను చెప్పినట్లు చేసేది. 'మార్తా' మీద అధికారంచెలాయించడం నాకు సరదాగా వుండేది. నా పెంకిపట్టు బాగా తెలిసిన మార్తా నాకు ఎప్పుడూ వ్యతిరేకంగా చెప్పేదికాదు. పట్టుదలవచ్చిందంటే చివరివరకూ పోట్లాడి గెలుస్తానని ఆ పిల్లకి తెలుసు. ప్రతిరోజూ మా వంటఇంటిలో రొట్టెపిండి కలిపి ఉండలు చేయడంలోనూ, 'ఐస్‌క్రీమ్' తయారుచేయడంలోనూ, కాఫీపొడి చేయడంలోనూ సాయంచేస్తూ చాలాసేపు గడపేవాళ్ళం. దీని తరువాత బూర్లమూకుడు అడుగున మిగిలిన రొట్టెకోసం దెబ్బలాడుకొనేవాళ్ళం. వంటఇంటి గుమ్మాలమీదికి గుంపులుగా వచ్చిన కోళ్ళకి ఆహారంవేస్తూ దగ్గరికి వచ్చిన కోళ్ళకి చేతులతోనే తిండిపెడుతూ సరదాగా కాలక్షేపం చేసేవాళ్ళం. దగ్గరకి వచ్చిన సీమకోళ్ళని చేతులతో నిమురుతూ వాటికి ఆహారం పెట్టడం ఎంతో సరదాగా వుండేది. ఒకనాడు పెద్ద సీమకోడి ఒకటి నా చేతిలోవున్న సీమ వంగపండుని ముక్కుతో పొడుచుకుపోయింది! ఇదిచూచిఅప్పుడే మా వంటవాడు కాల్చిన రొట్టెను దొంగతనంగా తీసుకుపోయి కర్రల లాటువెనుక కూర్చొని అంతాతినేశాం. ఆ తరువాత మాత్రం కడుపునొప్పితో ఎంతబాధపడ్డానో చెప్పలేను !

ఆ సీమకోడి ఈవిధంగా కడుపునొప్పితో బాధపడిందో లేదో నాకు తెలియదు.

మా ఇంటవుండే గినియాకోడి ఎవరికీ కనబడనిస్థలంలో గూడుకట్టి, అందులో గ్రుడ్లని పెట్టేది. ఎత్తుగా పెరిగినగడ్డిలో దాని గ్రుడ్లకోసం తడుముతూ వెతకడమంటే నాకెంతో సరదాగావుండేది. ఈ గ్రుడ్లని వెతకడానికి వెళ్ళేటప్పుడు మార్తా వాషింగ్టన్‌తో నా రెండు చేతుల్నీ చేర్చి, నేలమీదగుండ్రంగా పెట్టి చూపిస్తూ సంజ్ఞచేసేదాన్ని. గినియాకోడి గ్రుడ్లనివెతక డానికి బయలుదేరడానికి ఈ సంజ్ఞ నేను చేస్తున్నట్లు మార్తా సులభంగా గ్రహించేది. ఆఖరికి గినియాకోడి కట్టిన గూడు మాకు కనిపించగానే, ఆగూటిలోపలి గ్రుడ్లని ఇంటికి తీసుకు వెళ్ళడంలో మార్తా అయితే క్రిందపడవేస్తుందని, నేనేవాటిని ఇంటికి తీసుకువస్తానని చేతులతో సంజ్ఞలుచేసి మార్తాకి చెప్పేదాన్ని.

ధాన్యపుగాదులు, గుర్రపుశాలలు, ప్రొద్దుట, సాయంత్రం ఆవులని పాలుపిదికే స్థలం, వీటిదగ్గరికి ప్రతిరోజూ నేనూ, మార్తా వెళ్ళి చాలాసేపు సరదాగా గడిపేవాళ్ళం. ఆవుల పాలు పితుకుతూండగా నేను వాటిని చేతులతో నిమిరేదాన్ని. పాలు పితికేవాళ్ళు నన్నేమీ అనేవారుకాదు! కాని ఆవులచేత మాత్రం తప్పనిసరిగా తన్నులు తినేదాన్ని నా చిలిపితనానికి శిక్షగా!

క్రిస్ట్‌మస్ పండుగకి చేసే సన్నాహాలు నా కెంతో సరదాగా వుండేవి. ఘుమఘుమలాడే రకరకాలపిండివంటలతో మా ఇల్లు నిండిపోయేది. అల్లరిచేయకుండా వుండటానికి

నాకూ, మార్తా వాషింగ్టన్‌కీ తీయతీయని తాయిలాలెన్నో ముట్టేవి. పిండివంటలలోకి ఏలకులపొడినూరడం, ద్రాక్షపళ్ళు ఏరడం ఇలాంటి చిన్నపనులు మేమే చేసేవాళ్ళం. ఆఖర్ని మిఠాయిని కలిపిన గరిటలు నాకడానికి మాకు ఇచ్చేవారు!

క్రిస్టమస్‌కి అందరూ కడుతున్నారని నేనూ మేజోళ్ళు వ్రేలాడగట్టేదాన్ని ఆ మేజోళ్ళలో ఏ యే క్రిస్టమస్ బహుమతులున్నాయో మర్నాడు ఉదయం చూసుకున్నట్లుకూడా నాకు జ్ఞాపకం లేదు—ఎందుచేతనో మేజోళ్ళు ఈ విధంగా వ్రేలాడగట్టడంలో నాకంత ఉత్సాహంలేకపోయింది. నాలాగే మార్తా వాషింగ్టన్‌కూడా అల్లరిచేయడంలోదిట్టమైనదే. వేసవి కాలంలో ఒకనాటి మధ్యాహ్నం నేనూ, మార్తా మా ఇంటి వరండా మెట్లమీదకూర్చున్నాం. నల్లచేవ మ్రానులా నల్లగా, జోళ్ళకు కట్టుకొనే త్రాళ్ళతో బిగించి కట్టిన దుబ్బులాంటి జుట్టుతో మార్తా; తెల్లగా ఉంగరాలు తిరిగిన రాగిజుట్టుతో నేనూ! నాకు ఆరేళ్ళు వయస్సు, 'మార్తా'కి ఎనిమిదో, తొమ్మిదో ఏళ్ళుండేవి. నేనుమాత్రం గుడ్డిపిల్లని. మేమిద్దరం చాలాసేపటివరకూ కాగితపు బొమ్మల్ని కత్తిరించి, ఈ ఆట విసుగెత్తడంవల్ల, మా జోళ్ళత్రాళ్ళని కత్తిరించి, దగ్గరనేవున్న జూకామందారపు ఆకులన్నీ కత్తిరించివేశాం. ఆ తరువాత నా దృష్టి వ్రేలాడే మార్తా జుట్టుమీదికి వెళ్ళింది. మొదట మార్తా పెనగులాడింది కాని, నాసంగతి బాగా తెలిసినది కనుక వెంటనే నాకు లొంగిపోయింది. నాపనిపూర్తిఆవగానే ఇక తనవంతు వచ్చినట్లు మార్తా నాదగ్గరవున్న కత్తెర తాను పుచ్చుకొని, వ్రేలాడే ఒక ఉంగరాన్ని కత్తిరించివేసింది. సమ

యానికి మా అమ్మ వచ్చిందికనుక కాని, లేకపోతే నా ఉంగ రాలజుట్టునంతసీ మార్తా కత్తిరించివుండేది! నాకు ఇంకొక నేస్తం మా కుక్క 'బెల్లీ' ఇది ఎప్పుడూ సోమరిపోతులా పొయ్యిదగ్గరగా పరుండి కునుకుతూ వుండేది నాతో అల్లరి చేయడానికి ఎంత పిలిచినా రాకుండా! నా సంజ్ఞలభాషని బెల్లీకి నేర్పాలని ఎంతో ప్రయత్నించానుగాని ఆ మొద్దు నేర్చు కునేదికాదు. ఎప్పుడూ పరధ్యానంగా వుండేది. ఆఖరికి నాకు విసుగెత్తి దానిని చావకొట్టేదాన్ని. దెబ్బలుతిని ఆచోటునుంచి బద్ధకంగా లేచి, ఒళ్ళు దులుపుకొని కోపంగా నాకేసి రెండు ముక్కచిమ్ములు చిమ్మి పొయ్యి రెండవవైపుకివెళ్ళి ముడిచి పెట్టుకొని పడుకునేది! అంతటితో ప్రాణం విసిగి మార్తాని వెతుక్కుంటు వెళ్ళిపోయేదాన్ని.

నా చిన్నతనంలోజరిగిన అనేక సంఘటనలు నాకు ఇప్పటికీ స్పష్టంగా జ్ఞాపకం వున్నాయి. ఒకనాడు నా గౌను పైన కట్టుకున్న గుడ్డమీద నీళ్ళుపడి తడిసిపోయింది. దానిని ఆరపెట్టడానికి పొయ్యిదగ్గరకి తీసుకువెళ్ళాను. అప్పుడు పొయ్యిలో కొద్దిగా మంట వుండటంచేత ఎంతకీ తడిఆరలేదు. ఆఖరికి విసుగుతో ఆ గుడ్డని వేడిగావున్న నిప్పుల్లో పడే శాను. మరుక్షణంలో ఆ గుడ్డ అంటుకొని మంటలు నన్ను చుట్టుముట్టి, నేను కట్టుకున్న గుడ్డలు అంటుకొన్నాయి. నేను భయపడుతూ పెద్ద శబ్దముచేయగా మా ముసలి దాది వైనీ పరుగుపరుగున వచ్చి ఒక దళసరిమైన కంబళీని నామీదకి విసిరి, ఊపిరిసలపకుండాచేసి మంటని ఆర్పేసింది. నా చేతుల మీదా, కొంచెం జుట్టూ కాలింది కాని తక్కిన శరీరానికి మంటలు సోకలేదు.

ఈ రోజుల్లోనే తాళపు చెవిని ఉపయోగించడం ఏలాగో తెలుసుకున్నాను. ఒకనాడు మా అమ్మ కొట్టుగదిలో వుండగా చడీ చప్పుడూ కాకుండా బయట తాళం పెట్టేశాను. ఆ సమయంలో నౌకర్లందరూ ఎక్కడో దూరంగా పనిచేస్తున్నారు. మా అమ్మ ఎన్నిసార్లు గట్టిగా తలుపుతట్టినా ఎవరికీ వినిపించలేదు. నేనుమాత్రం వసారా మెట్లమీద కూర్చుని, మా అమ్మ గట్టిగా తలుపునితట్టడం కొంచెంగా వినబడుతూ వుంటే నవ్వుతూ కూర్చుండిపోయాను. ఆవిధంగా మూడు గంటలసేపు మా అమ్మ ఆ గదిలో వుండవలసివచ్చింది! ఇది జరిగినప్పటినుంచీ ఇక నన్ను ఒక్క క్షణంకూడా అదుపులో పెట్టి చదువు చెప్పించకపోతే లాభంలేదని మా అమ్మా, నాన్నా అనుకున్నారు.

కాని నా ఉపాధ్యాయిని మిస్. సల్లివాన్ మా ఇంటికి రాగానే నేను మొట్టమొదట చేసినపని ఆమెను గదిలో వుంచి తాళంవేయడం! మా అమ్మ నా చేతిలో ఏదో ఒక వస్తువు పెట్టి దానిని మిస్ సల్లివాన్‌కి ఇమ్మని నన్ను పంపింది. నేను మేడమీదికివెళ్ళి, ఆ వస్తువుని మిస్ సల్లివాన్‌కి ఇచ్చి, తలుపు జేరవేసి తాళంవేశాను. మరుక్షణంలో మేడదిగి ఆ తాళం చెవిని సావిట్లో బట్టలబీరువా అడుగున దాచేశాను. నేను మాత్రం ఆ తాళపుచెవిని ఎక్కడ దాచినదీ ఏవ్వరితోనూ చెప్పలేదు. మా నాయన నిచ్చెన తీసుకువచ్చి మిస్. సల్లివాన్ని కిటికీగుండా బయటికి దింపుతూంటే నవ్వుతూ చాలా ఆనందించాను. కొన్నినెలల తరువాత ఆ తాళంచెవిని తిరిగి ఇచ్చేశాను.

నాకు ఐదుసంవత్సరాల వయస్సురాగానే ద్రాక్ష తీగలు కప్పివున్న మా చిన్నఇంటినుంచి ఇంకొక పెద్దఇంటికి మారినాము.మా అమ్మ, నాయన, ఇద్దరు అన్నలు, చెల్లెలు మిల్డ్రెడ్ ఇదీ మా సంసారం. మా నాయన కట్టలుగా వున్న పత్రికల మధ్య ఒంటరిగా కూర్చుని ముఖం ఒక పత్రికలో దాచుకొనివుండగా ఈ కట్టల్ని దాటుకొని ఆయనదగ్గరికి నేను వెళ్ళడం బాగా జ్ఞాపకంవుంది. ముఖంముందు ఆ పత్రిక వుంచుకొని ఆయన చేస్తున్నది నాకు అర్థంకాలేదు మొదట! చాలా ఏళ్ళవరకూ నాకీ రహస్యం తెలియనేలేదు. ఆ తరువాత ఆయన ఒక పత్రికకు సంపాదకుడుగా వుంటూన్నాడనీ, ఆయనచుట్టూవున్న పత్రికల దస్త్రాలు దానికి సంబంధించినవే ననీ తెలిసింది! మా నాయన మమ్మల్ని ఎంతో ప్రేమించే వారు. ఒక్క వేటాడేకాలంలో తప్ప తక్కినరోజులలో ఆయన ఎప్పుడూ ఇంటిదగ్గరే వుండేవారు. తన ఇంటితరువాత ఆయన తన తుపాకీని, కుక్కల్ని ఎక్కువ మక్కువతో చూసేవారు. అతిథిసత్కారానికి ఆయనకి పెట్టిందిపేరు. ఆయన ఇంటికివచ్చేటప్పుడు ఎవరో ఒకర్ని అతిథిగా తీసుకు రానిదే వుండేవారుకారు. తాను పెంచే పెద్దతోటని అందరికీ సగర్వంగా చూపించేవారు. ఆతోటలో మేలిరకపు కర్బూజా పళ్ళూ, దోసపళ్ళూ పండించేవారు. నాకుమాత్రంఆతోటలో మొట్టమొదట ముగ్గిన ద్రాక్షపళ్ళూ, కర్బూజాపళ్ళూ తెచ్చి ఇచ్చేవారు. ఆయన నన్ను ఎత్తుకొని తోటలో ఒకచెట్టునుంచి ఇంకొక చెట్టుదగ్గరకీ, ఒక ద్రాక్షపందిరి దగ్గరనుంచి ఇంకొక ద్రాక్షపందిరి దగ్గరికీ నేను చెప్పినట్టు ఏవిధంగా తిప్పేవారో

నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకం వుంది. కథలు చెప్పడంలో ఆయనకి ఆయనే సాటి. నాకు భాష తెలియగానే ఆయన నాచేతిలో గజిబిజిగా తన అనుభవంలోని ఎన్నో ఘట్టాలని వ్రాసి చెప్పేవారు. తానుచెప్పిన వాటిని నేను తిరిగి ఆయనకు వ్రాసి చెప్పేటప్పుడు ఆయన ఆనందానికి మేరలేకపోయేది.

1896 వ సంవత్సరంలో నేను ఉత్తరాదిని వేసవిఆఖరు దినాల్ని గడుపుతూండగా మా నాయన మరణవార్త నేను విన్నాను. కొద్దిరోజులు మాత్రమే జ్వరంతో బాధపడి ఆయన చనిపోయారు. ఈ వార్త వినగానే నేను చెప్పలేని బాధ పడ్డాను. నాదగ్గరబంధువు మరణించగానే తొలిసారిగాపొందిన అనుభవం నాకది!

ఇక నాకు అంతదగ్గరగా వున్న మా అమ్మనిగురించి వ్రాయడం ఎంతో కష్టం అనిపిస్తుంది. అమెనుగురించి వ్రాయడానికి నేను అర్హురాలను కానేమోకూడా!—నన్నెంతో ప్రేమతో చూసే తల్లికీ, నాకూ మధ్య మాచెల్లెలు ఎక్కడినుంచో వచ్చి ఆక్రమించినట్లు నాకనిపించింది! నేనెప్పుడూ కూర్చొనే మా అమ్మ ఒడిలో చెల్లెలు కూర్చుని వుంటే నాకు నిజంగా అసూయపుట్టింది. మా అమ్మ పగలూ రాత్రీ తనప్రేమంతా చెల్లెలిమీదే ఒలకపోస్తుందేమో అనిపించింది. దీనికి తగినట్లు ఈ క్రింది సంఘటనవల్ల గాయంమీద కారంచల్లినట్లయింది!

నాదగ్గర మాట్లాడేవి, అరచేవి, కళ్ళుమూసి తెరచేవి అనేక రకాల బొమ్మలుండేవి. ఇన్నివున్నా నేను 'నాన్సీ'అనే బొమ్మని ఎక్కువగా ప్రేమించేదాన్ని. నాన్సీకి ఒకఉయ్యాల

కూడా వుంది. ప్రతిరోజూ నాన్నని ఆ ఉయ్యాలలో పరుండ బెట్టి ఒకగంటసేపు ఊపేదాన్ని. ఈ విధంగా ఆ బొమ్మనీ, ఉయ్యాలనీ ఎంతో జాగ్రత్తగా ఎవ్వరూ ముట్టుకోకుండా కాపాడేదాన్ని. ఒకనాడు మా చెల్లెలు నా ఉయ్యాలలో నిద్రపోతూంది హాయిగా! నా కేవిధమైన ప్రేమాలేని మా చెల్లెలు తనదైనట్లు ఆఉయ్యాలలో నిశ్చింతగా నిద్రపోతూండ డం చూసి కోపాన్ని పట్టలేక ఉయ్యాలదగ్గరకివెళ్ళి, దానిని తలక్రిందుచేశాను! ఆ సమయంలో పరుగుపరుగునవచ్చి మా అమ్మ చెల్లెల్ని పట్టుకోకపోతే, క్రిందపడి చచ్చిపోయివుండేది. గుడ్డితనంతో, చెవుడుతో ఒకరు చెప్పేమాటలు వినపడక, అంధకారంతో తడుముకొనేటప్పుడు మానవజీవితదశలోని మాధుర్యం, వాత్సల్యం అర్థంకాదు. కాని మిస్. సల్లివాన్ వచ్చి నన్ను అంధకారంలోనుంచి విముక్తి కలిగించగానే నా లోని ఈర్ష్య, కోపం అన్నీ అంతర్థానమైపోయాయి. చెల్లి మిల్డ్రెడ్, నేనూ చెట్టపట్టాలువేసుకొనితిరిగేవాళ్ళం. నాప్రేళ్ళ భాష మిల్డ్రెడ్, మిల్డ్రెడ్ మాట్లాడే చిలుకపలుకులు నేనూ అర్థంచేసుకోలేకపోయినా!



# మూడవ ప్రకరణము

ఇంతలో నా మనస్సులో ఉండే ఉద్దేశాలని పైకివ్యక్తం చేయాలనే కోరిక నాలో ఎక్కువైంది. నాకు తెలిసిన కొద్ది మాటలతో నానాటికీ పెరిగే నాలో భావాలని వ్యక్తంచేయ లేకపోయేదాన్ని. అంతటిలో చెప్పలేని కోపం నన్నావహిం చేది. ఏవో కనబడని చేతులు నన్ను గట్టిగా పట్టుకొంటూ న్నట్లనిపించేది. ఆ చేతుల్ని విడిపించుకొనడానికి శక్తికొలదీ పెనుగులాడేదాన్ని. ఈ పెనగులాడువల్ల నాకు మంచికలిగిం చకపోయినా, నాలో నిగ్రహించుకొనే శక్తి ఎక్కువైంది. ఈ విధంగా చాలా సేపటివరకూ పెనగులాడి, అలసి కన్నీటితో సమీపాన వున్న మా అమ్మ ఒడిలో తలదాచుకొని వెక్కి వెక్కి ఏడ్చేదాన్ని. ఈ ఉద్రేకంలో అసలు నాకు వచ్చిన కోపానికి కారణమే మరచిపోయేదాన్ని. ఈ విధమైన ఉప్పెన లాంటి ఉద్రేకం ప్రతిరోజూ, ఒక్కొక్కప్పుడు ప్రతిగంటకీ కూడా వచ్చేది.

ఈ దురవస్థని చూసి నా తల్లిదండ్రులు చాలా బాధ పడ్డారు. చెవిటి, గ్రుడ్డివారికి చదువుచెప్పే పాఠశాల మా వూరికి దగ్గరలో ఎక్కడా లేదు. ఎక్కడో మారుమూలవున్న టుస్కంబియాకి వచ్చి చెవిటి, గ్రుడ్డిపిల్లకి చదువుచెప్తారన్న

ఆశకూడాలేదు. నా స్నేహితులూ, నా బంధువులూ నా కసలు చదువుచెప్పడం సాధ్యమౌతుందా అని అనుమానించారు. మా అమ్మమాత్రం 'లారాబ్రిడ్జ్‌మన్' అనే చెవిటి, గ్రుడ్డిపిల్లకి బోస్టన్‌లోని 'పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూట్'లో డా॥ హూవ్; చదువుచెప్పినట్లుచదివి, నాకు తప్పక చదువుచెప్పించవచ్చుననే ధైర్యంతో వుంది. కాని గ్రుడ్డి, చెవిటివారికి చదువు చెప్పేపద్ధతిని కనిపెట్టిన డాక్టరు హూవ్ చాలా సంవత్సరాల క్రితం చనిపోవడంచేత, ఆ పద్ధతి బహుశా ఆయనతో నేలంతరించిపోయి వుంటుందని చాలా బాధపడింది. ఒకవేళ ఆపద్ధతి అమలులోవున్నా మారుమూల గ్రామంలోవున్న నాకు ఆ పద్ధతిప్రకారం చదువుచెప్పేవా రెవరు?

నాకు ఆరు సంవత్సరాల వయస్సు వున్నప్పుడు బాల్టిమోర్‌లో ఒక సుప్రసిద్ధ నేత్రవైద్యు డున్నాడనీ, ఆయన లాభంలేదనుకున్నవారినికూడా నయంచేశాడనీ మానాయన విని, నన్ను ఆయనదగ్గరకి తీసుకువెళ్ళడానికి నిశ్చయించారు.

ఆ ప్రయాణం నా కెంతో సరదాగావుంది. రైలుబండిలో ఎంతోమందితో స్నేహమైంది. ఒకావిడ నాకు ఒక చిన్న పెట్టెనిండా సముద్రపుగుల్లలుంచి బహుమతిగా యిచ్చింది. ఆ గుల్లల్ని దండగాగుచ్చడానికి వీలుగా మానాయన చిల్లులు పొడిచాడు. ఈ గుల్లలతో నేను సంతృప్తిగా చాలాసేపు ఆడుకున్నాను. ఆ బండిలోని కండక్టరుతో నాకు స్నేహమైంది. ప్రయాణీకులదగ్గర టిక్కెట్లకి తన పంచ్‌తో చిల్లులు పొడుస్తూవుంటే నేను అతని కోటు చివర్లుపట్టుకొని అతనితో తిరిగాను. తరువాత నాకు తనపంచ్‌ని ఆడుకోనడానికిచ్చాడు.

ఆ పంచ్‌తో నేను అట్టముక్కలకి చిల్లులు పొడుస్తూ ఒక మూల బల్లమీద చాలాసేపు ముడిచిపెట్టుకునికూర్చున్నాను! ఆ కండక్టరు నన్నెంతో ప్రేమగా చూశాడు బండిలోవున్నంత సేపూ! మా అత్త తువ్వాళ్ళతో ఒక పెద్ద బొమ్మనితయారు చేసింది. ముక్కూ, నోరూ, చెవులూ, కళ్ళూ లేని ఆబొమ్మని చూస్తే నాకే నవ్వువచ్చింది – అసలది మనిషిబొమ్మ అని అనుకోడంకూడా కష్టమే. తక్కిన అవకరాలన్నిటికంటె ఆ బొమ్మకి కళ్ళులేకపోవడం నాకు చాలాకష్టమేసింది. ఈ లోపాన్ని కనుపించినవారందరితోనూ చెప్పినా, ఆబొమ్మకి కళ్లు ఇవ్వడానికి ఎవ్వరూ పట్టించుకోలేదు. ఇంతలో మెరుపులా నాకొక అలోచన తట్టింది. తక్షణం నేను కూర్చున్నచోటు నుంచి లేచి, మా అత్తయ్య గుడ్డలపెట్టెతెరచి, ఆమెవేసుకొనే చిన్నకోటు పూసలు రెండు తెంపి, ఆ రెండూ బొమ్మకి కళ్ళలా కుట్టవలసిందని చెప్పాను. ఆమె నాచేతిని ఆమెకళ్ళకి తాకించి ప్రశ్నార్థకంగా 'కళ్ళు కుట్టమనేనా' అన్నట్లు అడిగింది. నేను శక్తికొలదీ 'అవునవును' అన్నట్లు సంజ్ఞచేశాను. ఆమె ఆ రెండు పూసల్నీ సరియైన స్థలంలో ఆ బొమ్మకికుట్ట గానే నా సంతోషానికి హద్దులేకపోయింది. కాని నాకుత్వరలోనే ఆ బొమ్మమీద మక్కువపోయింది. ఆ ప్రయాణంలో ఎన్నివిషయాలో నన్ను ఊపిరిసలపనంతహడావిడిగావుంచాయి.

మేము బాల్టిమోర్ చేరగానే ప్రఖ్యాత నేత్ర, కర్ణ వైద్యుడు డా॥ ఛిస్‌హోమ్ మమ్మల్ని ఎంతోదయతో ఆహ్వానించాడు. ఆయన నాకు చదువు చెప్పించవచ్చుననీ. ఈ విషయంలో పాఠశాలలని గురించీ, ఉపాధ్యాయులనిగురించీ

వాషింగ్టన్‌లోని డా॥ అలెగ్జాండరు గ్రాహంబెల్‌తో సంప్రదించడం మంచిదనీ సలహా యిచ్చాడు. విచారంతో బరువెక్కిన హృదయంతో మానాయన నన్నుతీసుకుని డాక్టరు బెల్‌ని చూడడానికి వాషింగ్టన్ వెళ్ళారు. ఒకచోటునుంచి మరొకచోటుకి తిరగడం నాకు ఎంతో సరదాగానేవుంది. ఈ సంతోషంలో మా నాయనపడే ఆదుర్దా నాకు తెలియనే లేదు. ఎంతోమందికి ప్రియబాంధవుడైన డా॥ బెల్ వాత్సల్యానికి నేను ముగ్ధురాలనైపోయాను. ఆప్యాయంగా డా॥ బెల్ నన్ను ఎత్తుకొన్నప్పుడు ఆయన గడియారాన్ని నేను పరీక్షగా చూస్తుంటే నా సరదాకోసం ఆయన గంటలు కొట్టించారు. ఉత్సాహంతో నేనుచేసే సంజ్ఞలు ఆయన అర్థంచేసుకుంటూంటే నాకు ఆయనయెడల మరింతప్రేమ ఎక్కువైంది. కాని ఆ ప్రథమపరిచయం, అంధకారంనుంచి వెలుతురుకీ, ఒంటరితనాన్నుంచి స్నేహంగా అందరితో కలసిమెలసితిరగడానికీ, జ్ఞానానికీ, ప్రేమకీ ద్వారమౌతుందని కలలోకూడా ఎన్నడూ అనుకోలేదు!

డాక్టరు హోవ్ కృషిఫలితంగా అంధులకి విద్యగరపే 'పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూట్' బోస్టన్‌లో పనిచేస్తుంది. ఆసంస్థకి డైరెక్టరుగావున్న 'అనాగ్నస్'కి వ్రాసి నాకు చదువుచెప్పడానికి సమర్థులైన ఉపాధ్యాయులెవరైనా వున్నారేమో తెలిసికొనవలసిందని డా॥ గ్రాహంబెల్ మా నాయనకి సలహాఇచ్చాడు. మా నాయన తక్షణం 'అనాగ్నస్'కి ఉత్తరంవ్రాశాడు. కొద్దిరోజులలోనే నాకు చదువుచెప్పడానికి తగిన ఉపాధ్యాయిని వున్నట్లు తెలియజేయడానికి సంతోషిస్తున్నామని' అనాగ్నస్

ఉత్తరం వ్రాశారు. ఇది 1886 వ సంవత్సరం వేసవిలో జరిగింది. కాని మిస్. సల్లివాన్ మా ఇంటికి మరుసటిసంవత్సరం మార్చి నెలలో వచ్చింది.

ఆ విధంగా నేను చీకటిని ఛేదించుకొని వెలుగును చూడగలిగాను. భగవంతుడు వాత్సల్యపూరితమైన రస మధుర స్వనంతో "విజ్ఞానమే ప్రేమ, కాంతి, దివ్యజ్యోతి" అని చెప్పి నన్ను దీవించాడు. ఆ దివ్యదృష్టితోనే నేను ఈ సృష్టివైచిత్ర్యాన్ని చూడగలిగాను.



# నాల్గవ ప్రకరణము

1887 వ సంవత్సరం మార్చినెల మూడవతేదీ నా జీవితంలో చాలా ముఖ్యమైన దినం. ఆనాడే నా ఉపాధ్యాయిని 'ఆనీ సల్లివాన్' మా ఇంటికి వచ్చింది. ఈ చరిత్రాత్మకమైన దినాన్ని నా జీవితంలో ఎప్పుడూ మరువలేను. ఈ విధంగా కలసికొన్న మా ఇద్దరి జీవితాల ఊహాతీతమైన వ్యత్యాసాన్ని తలచుకొంటే నా హృదయం ఆశ్చర్యంతో నిండిపోతుంది!

ఆనాటి మధ్యాహ్నం నేను నిశ్శబ్దంగా మా వరండా మెట్లమీద నిలిచి, జరుగబోయేదానికి వేచివున్నాను. మా అమ్మ హడావిడిగా అటూఇటూ తిరగడాన్నిబట్టి ఏదో ఒక ముఖ్యమైన సంఘటన జరుగబోతూందని మాత్రం తెలుసుకొని, వీధి తలుపుదగ్గరికివెళ్ళి మెట్లమీద కాచుకొనివున్నాను. మధ్యాహ్నపు సూర్యుడు గుబురుగావున్న జూకామందారపు తీగలగుండా పైకెత్తిన నా ముఖంమీద ప్రకాశిస్తున్నాడు. వసంతుణ్ణి ఆహ్వానించడానికి కిలకిలనవ్వుతూ బయటికివచ్చిన జూకామందారాల్నీ, ఆకుల్నీ అప్రయత్నంగా నా వ్రేళ్ళు తాకినాయి. భవిష్యత్తులో ఏమేమివింతలు జరుగనున్నాయో నాకేమీ అర్థంకాలేదు. అంతవరకూ అంధకారంలో తడుముకుంటూవున్న నన్ను కోపం, దుఃఖం పీల్చి పిప్పిచేశాయి.

దట్టమైన తెల్లని చీకటి పొగమంచులో వున్న ఓడ ఒడ్డును చేరడానికి తడుముకుంటూ అవస్థపడే సమయంలో ఆ ఓడలోని మనిషికి ఏవిధంగా గుండెలు కొట్టుకుంటాయో, అదే విధంగా దిక్సూచి, కూతపెట్టే ఈలలేని ఓడవలె ఒడ్డు ఎంత దూరమున్నదో తెలియకుండా గడచింది నాజీవితం నా ఉపాధ్యాయిని రాకపూర్వం. "వెలుగు! నాకు వెలుతురుని ప్రసాదించు ప్రభూ!" అని నా హృదయం మౌనంగా పరితపించింది —అంతే, ఆ ఘడియలోనే ప్రేమఅనే వెలుతురు నా మీద ప్రసరించింది!

నన్ను సమీపించే అడుగులచప్పుడుని గ్రహింపగలిగాను. మాఅమ్మవైపు చాపినట్లు నా చేతినిచాపాను. ఎవరో ఆ చేతిని పట్టుకొని నన్ను దగ్గరగా ఒడిలోనికి తీసుకున్నారు. నన్ను ఎంతగానో ప్రేమించి, ప్రపంచంలోని ఎన్నోవిషయాలని గురించి నాకు చెప్పిన మిస్. సల్లివాన్ ఆమె!

మా ఇంటికి వచ్చిన మరునాటి ఉదయం మిస్. సల్లివాన్ నన్ను తనగదిలోనికి తీసుకొనివెళ్ళి నాకొక ఆటబొమ్మ ఇచ్చింది. 'పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూషన్'లో వున్న గ్రుడ్డిపిల్లలు నాకు కానుకగా ఆ బొమ్మని పంపించారు. అక్కడవుంటూన్న అంధబాలిక లారాబిడ్జ్‌మన్ ఈ బొమ్మకి గుడ్డలుకట్టి అలంకరించింది. ఈ విషయాలన్నీ నాకు తరువాత తెలిసినాయి. ఆ బొమ్మతో నేను కొంతసేపు ఆడుకొన్నతరువాత మిస్. సల్లివాన్ నా చేతిలో మెల్లిగా (డా_ల్) "బొమ్మ"అని వ్రాసింది. ఈవిధంగా వ్రేళ్ళతో ఆడుకొనడం నాకు చాలాసరదా వేసింది తక్షణం నేనుకూడా ఆమె వ్రాసినట్లు వ్రాయడం మొదలు

పెట్టాను. ప్రయత్నం చేసిచేసి, ఆఖరికి బొమ్మ అని తప్పు లేకుండా వ్రాయడం చేతకాగానే, నేనుపొందిన ఆనందానికీ, గర్వానికీ అంతులేకపోయింది. తక్షణం మా అమ్మదగ్గరికి పరుగెత్తి ఈమాట ఆమెకు తెలిసేటట్లు వ్రేళ్ళతో వ్రాసి చూపించాను. అసలు నేను ఒకమాటని వ్రాస్తున్నానో, ఆమాట అసలు ఉందో, లేదో నాకు తెలియనే తెలియదు. కోతివలె ఒకరుచేసినదానిని వ్రేళ్ళతో అనుకరించడంమాత్రమే నేను నేర్చుకున్నాను. ఆతరువాత కొద్దిరోజులలో వాటి అర్థం తెలియకుండా చాలా మాటలు నేర్చుకున్నాను. వాటిలో పిన్, హాట్, కప్ అన్నవి కొన్ని! ఇవిగాక సిట్, స్టాండ్, వాక్ మొదలైన క్రియలు కొన్ని నేర్చుకున్నాను. మిస్. సల్లివాన్ వచ్చిన చాలా వారాల తరువాతకాని ప్రతి వస్తువుకీ ఒకపేరు ఉంటుందనేవిషయం నాకు తెలియలేదు!

ఒకనాడు నా కొత్తబొమ్మతో ఆడుకొంటూండగా మిస్. సల్లివాన్ నా పెద్ద గుడ్డబొమ్మనికూడా నా ఒడిలో పెట్టి నాచేతిలో "డాల్" (బొమ్మ) అని వ్రాసి, 'బొమ్మ అనే మాట ఆ రెండింటికీ వర్తిస్తుంది' అని చెప్పడానికి ప్రయత్నించింది. ఆనాటి ఉదయమే "మగ్" (కూజా) "వాటర్" (నీరు) అనే మాటలమీద చాలా సేపటివరకూ మా ఇద్దరిమధ్య తర్జనభర్జనలు జరిగాయి. మిస్. సల్లివాన్ "కూ_జా" అనే పదం కూజాకే వర్తిస్తుందనీ, "నీ_రు" అనే పదం నీటికే వర్తిస్తుందనీ, ఆ రెండూ వేరువేరనీ నాకు తెలియజెప్పటానికి ఎంతో శ్రమపడింది. కాని నేను ఆ రెండింటినీ కలగాపులగంచేసి, ఆ రెండూ వేరని ఎంతసేపటికీ ఒప్పుకో

లేదు. ఆఖరికి మిస్. సల్లి వాణ్ కి ప్రాణంవిసిగి, ఈ చర్చని అప్పటికిపుటుకు వాయిదా వేసింది. కాని త్వరలోనే తిరిగి ఈ చర్చవచ్చింది. తిరిగి తిరిగి ఆమె ఈ విషయాన్ని నాకు బోధ పరచడానికి ప్రయత్నించడంతో నాకు ఓర్చుకోలేనంత కోపం వచ్చి నాచేతిలోవున్న కొత్త బొమ్మని బలంకొలదీ నేలని వేసి కొట్టాను. ముక్కలు ముక్కలుగా పగిలిన ఆబొమ్మ పెంకులు నా కాలికి తగలగానే నాకెంతో సంతోషంకలిగింది! అంధ కారంలో మునిగిన నాకార్రోజులలో ప్రేమ అంటే ఏమిటో అర్థమయేదికాదు. ఆ బొమ్మ పగిలిపోయినందుకుకూడా నేను విచారించలేదు. మిస్. సల్లి వాణ్ పగిలిపోయిన ఆ ముక్కల్ని ఒకమూలకి తుడుస్తూంటే నాకు ఇష్టంలేనివస్తువు పోయింది కదా అని ఎంతో సంతృప్తిచెందాను. అప్పుడు మిస్. సల్లి వాణ్ నా టోపీ తీసుకువచ్చి నా చేతిలోపెట్టగానే వెచ్చని సూర్యకాంతిలో తిరగడానికి వెడుతున్నామనే భావం నాలో కలిగి ఆనందంతో ఉప్పొంగిపోయాను. పైకి మాట వ్యక్తం చేయలేకపోయినా నాకు ఈవిధంగా కలిగిన అనుభూతిని "నాలో కలిగిన భావం" అని చెప్పడం తప్పుకాదేమో! — ఈ సంతోషంతో ఎగిరి గంతులువేయసాగాను.

మా ఆవరణలోవుండే నూతికి పైన కప్పువుంది. ఆ కప్పుమీద జూకామందారపుడొంక దట్టంగా అలుముకొని వుంది. ఆ పూలు చక్కని సువాసనని వెదజల్లుతూండగా మే మిద్దరం ఆ నూతిదగ్గరకి నడిచివెళ్ళాం. అప్పుడు నాచేతిని మిస్. సల్లి వాణ్ నీటిధారక్రింద పెట్టింది. చల్లటి నీటిధార వేగంగా నా చేతిపైనుంచి ప్రవహిస్తూంటే నా రెండవ

చేతిలో మిస్. సల్లివాన్ "వాటర్" అని మొదట నెమ్మది గాను, తరువాత వేగంగానూ వ్రాసింది. నేను కదలకుండా ఆమెవ్రాసే అక్షరాలమీదనే ధ్యానముంచి నిలుచుండి పోయాను. హఠాత్తుగా నాలో ఒక వింతభావం — ఇదివరలో మరచిపోయినదేదో తళుక్కున మెరసి — జ్ఞాపకానికివచ్చింది! ఆక్షణంలోనే "భాషా రహస్యం" నాకు అవగతమైంది. "వా - ట - ర్" అంటే చల్లగా నాచేతిమీాద ప్రవహించే ఆ నీరు అని నా కప్పుడు అర్థమైంది. సజీవమైన, చైతన్యవంత మైన ఆ "వా - ట - ర్" అనే మాటే నిద్రాణమైన నా ఆత్మని మేల్కొలిపి, వెలుగుచూపించి, ఆశల్నీ, ఆనందాన్నీ రేకెత్తించి, అజ్ఞాన తిమిరాన్నుంచి విముక్తి చేసింది. ఈ సంఘటనజరిగినప్పుడు మిస్. సల్లివాన్ హాప్కిన్స్ సతికి వ్రాసిన ఉత్తరం పాఠకులకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆ ఉత్తరంలోని విషయాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

మిసెస్. హాప్కిన్స్,

ఈరోజున అతి ముఖ్యమైన సంఘటన ఒకటి జరిగింది. అందుచేతనే ఈ ఉత్తరాన్ని నీకు వ్రాస్తున్నాను. హెలెన్ తన విద్యాభ్యాసంలో రెండవ ముఖ్యఘట్టాన్ని నేడు నేర్చు కొన్నది. ప్రతి వస్తువుకీ ఒక పేరువుంటుందనీ, హస్తాక్షరముల ద్వారా తాను ప్రతి విషయాన్ని నేర్చుకొనవచ్చుననీ తెలిసి కొన్నది.

ఇంతకుముందు వ్రాసిన ఉత్తరంలో 'కూజా' 'పాలు' ఈ రెండుమాటలూ హెలెన్‌ని ఎంతో తికమకపెట్టినట్లు నీకు వ్రాశాను. ఈ నామవాచకాలని "త్రాగు" అనే క్రియతో

కలగాలపులగం చేసింది. ఆమెకి "త్రాగు" అనే మాట తెలియక "కూజా" అనికాని, "పాలు" అనికాని వ్రాయగానే త్రాగే సంజ్ఞ చేయడం మొదలుపెట్టేది. ఇవాళ ఉదయం ఆమె కాళ్ళూ చేతులూ కడుగుకొంటూన్నప్పుడు "నీటికి" ఏమని పిలుస్తారో చెప్పమంది. ఏదైనా ఒక వస్తువుపేరు తెలిసికోవాలనుకొన్నప్పుడు ఆ వస్తువుకేసి చూపిస్తూ నాచేతిమీద తట్టుతుంది. నేను ఆమెచేతిలో "వాటర్" అన్న అక్షరాలు వ్రాసి, తరువాత ఉదయపు భోజనం అయ్యేవరకూ ఈ సంగతే మరచిపోయాను. కాని ఈ కొత్తమాటద్వారా "కూజా" "పాలు" — ఈ తికమక తీర్చగలనేమో అని ఆశకలిగింది. మే మిద్దరం నూతిదగ్గరకి వెళ్ళాము. హెలెన్ తన చేతితో కూజాపట్టుకొని ధారక్రిందపెట్టి నిల్చునివుండగా నేను నీళ్ళుతోడే యంత్రాన్ని కొట్టనారంభించాను. నీళ్ళు వేగంగా పైకి వచ్చి ఆ ధార క్రింద హెలెన్ పట్టుకొన్న కూజా నిండగానే నేను హెలెన్ చేతిలో "వాటర్" అని వ్రాశాను. ఆమె చేతిమీద ప్రవహించే చల్లని నీటికి "వాటర్" అనే మాట తోడుకాగానే నిశ్చేష్టురాలై హెలెన్ ఆ కూజాని క్రింద జారవిడచి నిలుచుంది! ఆమె ముఖములో ఒక కొత్త కాంతి ద్యోతకమౌతూంది — "వాటర్" అనే మాటని అప్పుడు ఎన్నో పర్యాయములు వ్రాసింది. ఆ తరువాత నేలమీద కూలబడి నీరుతోడే యంత్రంవైపూ, నూతివైపూ చూపిస్తూ వాటి పేరు అడిగి, హఠాత్తుగా నావైపు తిరిగి నాపేరు అడిగింది! నేను "ఉపాధ్యాయిని" అని వ్రాశాను. అంతలోనే దాది హెలెన్ చెల్లెల్ని అక్కడికి తీసుకువచ్చింది. హెలెన్

"బేబీ" అనే మాట నా చేతిమీద వ్రాసి, దాదివైపు చూపించింది. నూతిదగ్గరనుంచి ఇంటికి వెళ్ళేలోపుగా హెలెన్ ఉత్సాహంతో ముట్టుకొన్న ప్రతివస్తువుపేరూ అడిగి తెలుసుకుంది. ఆ కొద్దిగంటలలో దాదాపు ముప్ఫై కొత్తమాటల్ని నేర్చుకొన్నది!— తలుపు, తెరు, మూయి, ఇమ్మ, వెళ్ళు, రా — ఇంకా ఎన్నిమాటలో!

P. S: నిన్నరాత్రి టపావేళకి ఉత్తరాన్ని పూర్తి చేయలేకపోయాను. అందుచేత ఈ క్రింది రెండుముక్కలూ వ్రాస్తూన్నాను. హెలెన్ ఈరోజుఉదయం ఎంతో ఉత్సాహంతో ధగధగ మెరిసే దేవకన్యలా లేచింది. ఒకవస్తువు దగ్గరనుంచి ఇంకొక వస్తువుదగ్గరకివెళ్ళి వాటి పేర్లను అడిగి తెలిసికొన్నది ఎంతో ఉత్సాహంగా. నిన్నరాత్రి నేను నిద్ర పోవడానికి పరుపుమీద చేరగానే హెలెన్ నా వడిలోనికి వచ్చి తనంతట తానే మొట్టమొదటిసారిగా నన్ను ముద్దు పెట్టుకుంది — నా హృదయం సంతోషంతో బరువెక్కిపోయిందంటే నమ్మ!

మిత్రురాలు,

— సల్లివాన్.

అధిగమించవలసిన అడ్డంకులెన్నో వున్నాయన్నమాట వాస్తవమే! కాలక్రమాన వాటినన్నిటినీ తొలగింపవచ్చు.

ఎన్నో కొత్తవిషయాలను నేర్చుకొనాలనే కుతూహలంతో ఆ నూతిదగ్గరనుంచి ఇంటికి బయలుదేరాను. ప్రతి వస్తువుకీ ఒకపేరు ఉంటుంది. నేర్చుకొన్న ప్రతికొత్తపేరు

కొత్తఆలోచనల్ని నాలో పుట్టించింది. నేను ఇంటికి తిరిగి రాగానే, నేను తాకిన ప్రతివస్తువూ జీవంతో చలించింది! దీనికి కారణం నేను ప్రతివస్తువునీ ఈ క్రొత్తగా నాకుకలిగిన జ్ఞానోదయపు కాంతితో అర్థంచేసుకొనడమే! నేను ఇంట్లో ప్రవేశించగానే, నేను పగలకొట్టిన బొమ్మనిగురించి నాకు జ్ఞాపకంవచ్చింది. తక్షణం నేను పొయ్యిదగ్గరగావున్న మూలకి వెళ్ళి, అక్కడ పోగుగావున్న ముక్కల్ని చేర్చి, తిరిగి అతికించడానికి ప్రయత్నించాను. బొమ్మగా తిరిగి అతికించాలనే నా ప్రయత్నం వ్యర్థమైంది. నా కళ్ళనుంచి అప్రయత్నంగా నీళ్ళు కారసాగాయి. నేను చేసినపని అప్పుడు నాకు గుర్తుకు వచ్చింది. నా జీవితంలో మొట్టమొదటిసారిగా పశ్చాత్తాపం, విచారం నా మనస్సుని వేధించాయి. వీటి అర్థం నాకుపూర్తిగా అప్పుడు తెలిసింది.

ఆ రోజున నేను ఎన్నోకొత్తమాటల్ని నేర్చుకొన్నాను అవన్నీ ఇప్పుడు నాకు జ్ఞాపకం లేవుగాని తల్లి, తండ్రి, అక్క, చెల్లెలు, ఉపాధ్యాయిని అన్నవి వాటిలో కొన్ని ఈమాటలే. విరియబూచిన నందనవనంగా ప్రపంచాన్ని అర్థంచేసికొనడానికి నాకు తోడ్పడ్డాయి. ఆనాటిరాత్రి నా పట్టుపరుపుమీద పండుకొన్నప్పుడు నేనుపడ్డ ఆనందం మాటలతో వర్ణించడంకష్టం. ఆనాడు నేను నేర్చుకొన్న కొత్తవిషయాల్ని తలచుకొని ప్రపంచంలో నాకంటె అదృష్టవంతురాలైన పిల్ల ఇంకెవరైనా వుంటారా అని అనుకున్నాను. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూడడం, జీవితంలో నాకదే మొదటిసారి!

# ఐదవ ప్రకరణము

దీర్ఘతమస్సునుండి నాఆత్మ మేలుకొన్న కొద్దిరోజులకే వసంతకాలంవచ్చింది. అది 1887 వ సంవత్సరం. ఆ వేసవిలో జరిగిన అనేక సంఘటనలు నాకు బాగా జ్ఞాపకంవున్నాయి. నా చేతులకు తగిలిన ప్రతివస్తువునిగురించీ క్షుణ్ణంగా తెలిసికొనడమే నాపని అప్పుడు. ఎన్నో కొత్తవస్తువుల్ని చేతులతో పట్టుకొని వాటిపేర్లు, ఉపయోగాలు బాగా తెలిసికొనడంతో ప్రపంచంతో నాకు మరింత సన్నిహిత సంబంధం ఏర్పడ సాగింది.

బంగారురంగుతో చక్కని సువాసననిచ్చే ఒకరకపు అడవిపూలూ, వెన్నగిన్నె పూలుపూచే కాలం రాగానే మిస్. సల్లివాన్ నన్ను చేయిపట్టుకొని పొలాలవైపు తీసికొనివెళ్ళేది. విత్తనాలు చల్లడానికి అప్పుడు రైతులు భూమిని సిద్ధంచేస్తూ వుండేవారు. టెన్నెసీ నదిఒడ్డున వెచ్చని గడ్డిమీదకూర్చొని ప్రకృతి మనకు చేసే ఉపకారాలని గురించి తొలిపాఠాలు నేర్చుకున్నాను. మనకి ఆహారాన్నిస్తూ, కన్నులపండువుగా కనిపిస్తూవుండే చెట్లని సూర్యకాంతి, వర్షం ఏవిధంగా పెంచి పెద్దవిగాచేస్తాయో; పక్షులు తమగూండ్లని ఏవిధంగానిర్మించు కుంటాయో, ఒక ప్రదేశంనుంచి, మరియొక ప్రదేశానికి ఏ

విధంగా వలస వెళ్ళుతాయో; ఉడుత, లేడి, సింహం మొదలైన జంతువులు తమ ఆహారాన్ని ఏవిధంగా సంపాదించుకుంటాయో, తాము నివసించే స్థలాన్ని ఏవిధంగా నిర్మించుకొంటాయో, మొదలైన విషయాలన్నీ ఇక్కడే నేర్చుకొన్నాను. ఈ క్రొత్తవిషయాలను నేర్చుకొన్నకొలదీ, నేను నివసిస్తూన్న ఈ ప్రపంచం ఎంత చిత్రమైనదో అర్థంచేసికొన్నాను. లెక్కలు చేయడంగాని, భూగోళవిషయాలు తెలిసికొనడంగాని ప్రారంభించకముందే మిస్. సల్లివాన్ తోటలలోని చక్కని పరిమళాన్ని, గడ్డిపరక సువాసననీ, ప్రకృతి అందాన్ని మాచిట్టి చెల్లెలి చేతిలోని వంపులను అర్థంచేసికొనడం నాకు నేర్పింది. నా చిన్ననాటి మధురస్మృతులను ప్రకృతితో పోల్చిచెప్పి, 'పక్షులలోనూ, పువ్వులలోనూ నేనూ ఒకటే' అనే భావం మిస్. సల్లివాన్ నాకు కలిగించింది.

కాని ప్రకృతి ఎల్లవేళలా మనపై వాత్సల్యాన్ని చూపించదనే పాఠాన్ని ఒకరోజున నేను నేర్చుకున్నాను. ఆనాటిఉదయం మిస్. సల్లివాన్, నేనూ చాలాదూరం నడచి ఇంటికి తిరిగివస్తున్నాం. ఎంతో హాయిగావుంది ప్రభాతకాలం. క్రమంగా సూర్యుడు పైకెక్కుతూన్నాడు. వేడిమితోపాటు ఉక్కగాకూడావుంది. దారిలో అలసటతీర్చుకొనడానికి రెండు మూడుసార్లు దారిప్రక్కనవుండే చెట్లక్రింద ఆగుతూ వచ్చాం. ఇక మా ఇల్లు కొద్దిదూరంలో వుందనగా ఒక పెద్ద చెర్రీ వృక్షంక్రింద ఆఖరిమజిలీ వేశాం. ఆ చెట్టుక్రిందనీడ ఎంతో హాయిగా వుంది. ఆ చెట్టుపైకి ఎక్కడానికికూడా చాలా సులభంగావుంది. మిస్. సల్లివాన్ సహాయంతో ఒక కొమ్మ

మీాదికి ఎక్కి కూర్చున్నాను. అక్కడి చల్లతనాన్ని చూసి మా భోజనం అక్కడే చేస్తే బాగుంటుందని మిస్. సల్లివాన్ చెప్పింది. మిస్. సల్లివాన్ ఇంటికివెళ్ళి భోజనం తీసుకువచ్చే లోపులో నేను కిక్కురుమనకుండా ఆ కొమ్మమీాదే కూర్చుంటా నని ఆమెతో చెప్పాను. ఆమె భోజనంతేవడానికి ఇంటికి వెళ్ళింది.

ఇంతలో వాతావరణంలో పెద్ద మార్పువచ్చింది. సూర్యుని వేడిమితగ్గిపోయింది. ఈ వేడి — అంటే నాకు కాంతికూడా – తగ్గిపోగానే ఆకాశం నల్లగా మారినట్లు తెలిసి కొన్నాను. భూమిమీాదనుంచి ఒక వింతవాసన బయలుదేరింది. గాలివాన వచ్చేముందు నేల ఈవిధంగా వాసనవేస్తుందని నాకు తెలుసు. చెప్పలేని భయం నన్నావహించింది. నా స్నేహితు లకీ, భూమికీ దూరంగా, ఒంటరిగా వున్నాననే వింతభయం నన్ను చుట్టుముట్టింది. కదలికలేకుండా ఏమి జరుగబోతుందో నని ఆ విధంగానే భయంతో కంపిస్తూ వుండిపోయాను. మిస్. సల్లివాన్ రావాలని ప్రొమొక్కుకొన్నాను; అంతకంటేముఖ్యం ఆ చెట్టుమీాదనుంచి క్రిందకి దిగాలని ప్రయత్నించాను. ఒక్క క్షణంపాటు అంతటా నిశ్శబ్దం. అంతటిలో చెట్టుఆకులన్నీ కదులుతూ రొదచేశాయి. మరుక్షణంలో బ్రహ్మాండమైనశబ్దం చేస్తూ కొమ్మలన్నీ ఊగడం మొదలుపెట్టాయి. నా శక్తి కొలదీ నేను కూర్చొన్న కొమ్మని పట్టుకొనకపోతే, ఆ గాలి వేగానికి నేను ఎగిరిపోయివుండేదాన్ని! ఆ గాలి వేగానికితట్టు కోలేక కొమ్మలు శబ్దంచేస్తూ అటూఇటూ ఊగుతూన్నాయి. చిన్నచిన్న రెమ్మలు విరిగి నామీాద వర్షంలాపడుతూన్నాయి!

తక్షణం ఆ చెట్టుమీదనుంచి క్రిందికి దుముకుదామనే వెర్రి తలంపు నాలో కలిగింది — కాని భయం నన్ను ఆకొమ్మకే అంటిపెట్టుకొని వుంచింది! చుట్టుపట్ల వున్న చెట్లు కూలి క్రిందపడ్డ అదురు నన్నుకదల్చివేసింది. నేను పంగలుగావున్న చెట్టుకొమ్మలో ముడిచిపెట్టుకొని అలాగే కూర్చున్నాను. ఇంతలో ఫెళఫెళమనే శబ్దం నేను కూర్చున్న కొమ్మనికదలించింది! ఇంకొక క్షణంలో నేను చెట్టుతోసహా క్రిందపడిపోతాననుకొంటూండగా మిస్. సల్లివాన్ నా చేతినిపట్టుకొని నన్ను క్రిందికి దింపింది! పట్టలేని సంతోషంతో వణికిపోతూ ఆమెను గట్టిగా కౌగలించుకొన్నాను. నా పాదాలు భూమిని తాకగానే పోయిన ప్రాణాలు తిరిగి వచ్చినట్లనిపించింది! 'ప్రకృతి తనబిడ్డలమీదే యుద్ధం ప్రకటిస్తుందనీ, సున్నితమైన ఆమె చేతులలోనే ప్రాణాలు తీసే వాడిగోళ్ళు దాగివుంటాయనీ' ఒక కొత్తపాఠాన్ని ఆనాడు నేర్చుకున్నాను.

ఈ అనుభవం కలిగిన చాలారోజులవరకూ నేను చెట్టు ఎక్కలేదు. అసలీ మాట తలచుకొంటేనే భయంతో కంపించిపోయేదాన్ని. ఆఖరికి విరగబూచిన 'మిమోసా' పూలు సువాసనతో నన్ను ఉక్కిరిబిక్కిరిచేసి, ఈ భయాన్ని పోగొట్టేయి. వసంతకాలంలో ఒకనాటి ఉదయం మా వేసవిగృహంలో కూర్చొని చదువుకుంటూండగా 'మిమోసా' పూల పరిమళంతో నిండిన గాలి మా ఇంటినంతటినీ నింపి మత్తెక్కించింది. మిమోసా పూల పరిమళపు రూపంలో వసంతం మా ఇంటికివచ్చి నృత్యం చేస్తూందా అనిపించింది. అనుకోకుండానే నా చేతుల్నిచాపి, పైకిలేచాను. 'ఏమిటి ఇదంతా? అని

నాలోనే ప్రశ్నించుకున్నాను. అవును ఈ పరిమళం ఆ 'మిమోసా' పూలదే. అదిగో ఆ దారిచివర మళుపులో, కంచెకి దగ్గరగా కొమ్మకొమ్మకీ విరియబూచినపూలతో, ఎత్తుగా పెరిగిన పచ్చికనితాకే పూలకొమ్మలతో ఎంతబాగుంది. అప్రయత్నంగా నేను ఆచెట్టుదగ్గరకి నడచివెళ్ళాను. సూర్యరశ్మిలో మిలమిలలాడే పూలతో ఎంతఅందంగావుంది. నందనవనంలో వుండే చెట్టుని తీసుకువచ్చి ఇక్కడ ఎవరూ నాటలేదుకదా! వర్షంలా క్రిందరాలిన పూలరేకుల మధ్యనుంచి నడచి ఆ చెట్టు మొదటికి వెళ్ళాను. క్షణంసేపు ఏమిచేయాలో తెలియక అక్కడే నిలుచుండిపోయాను. ఆఖరికి రెండుగాచీలిన ఆచెట్టు బోదెమీదనుంచి పైకి ఎక్కాను. ఆకొమ్మలు బాగాలావుగా వుండటంచేతా, పైబెరడు నాచేతులపై చర్మాన్ని చీరి గాయపరచడం చేతా ఆ విధంగా పట్టుకొని నిల్చొనడం కష్టమే అయింది. కాని నేనొక అపూర్వమైన, సాహసకార్యాన్ని చేస్తూన్నాననే ఉత్సాహం నన్ను ప్రోత్సహించి నాకుమరింత బలాన్ని ఇచ్చింది. ఆ పట్టుదలతో నేను పైపైకి ఎగబ్రాకి ఒక స్థలాన్ని చేరుకున్నాను. అక్కడ కూర్చొనడానికివీలుగా ఏనాడో ఒక పీఠం నిర్మింపబడింది. ఆ చెట్టులో ఒకభాగంగా ఆ పీఠంకూడా దానిపైనే ఉండిపోయింది! గులాబిరంగుమబ్బుమీద స్వారిచేసే దేవకన్యలా నేను ఆచెట్టుమీద ఎంతసేపు వున్నానో నాకే తెలియదు. ఆ తరువాతకూడా ప్రతిరోజూ ఆచెట్టుమీద గంటలతరబడి కూర్చొని ఎన్నో మధురస్వప్నాలని కన్నాను.



# ఆరవ ప్రకరణము

భాషనంతటినీ నేర్చుకొనడానికి కావలసిన మంత్ర దండం ఇప్పుడు నాచేతిలోవుంది! సాధారణంగా పిల్లలు తాము విన్నది కష్టపడనక్కరలేకుండగానే నేర్చుకుంటారు. ఇతరులనోటినుండి వచ్చే మాటలని తమూపాగా పట్టుకుంటారు. కాని చెవిటిపిల్ల అయితే ఆవిధంగా వెలువడే ప్రతి మాటనీ ఎంతో కష్టపడి, మనస్సుకి పట్టించుకోవలసి వస్తుంది. ఈ పద్ధతిలో ఎంతకష్టమున్నా, చివరికి ఫలితం నిరుపమానం! ఒక వస్తువుయొక్క పేరు తెలిసికొనడం మొదలుకొని క్రమ క్రమంగా ముందుకి చాలాదూరం ప్రయాణించి, తుదకు షేక్స్పియర్ మహాకవి పద్యపాదాన్ని అర్థంచేసుకొనడం అనే మహత్తరవిజయాన్ని సాధింపగలిగాను!

మొట్టమొదట మిస్. సల్లివాన్ ఏదైనా ఒక కొత్త విషయం చెప్పినప్పుడు నేను చాలా తక్కువగా ప్రశ్నలు వేసేదాన్ని. తెలిసీ తెలియని అభిప్రాయాలతో, సరిపడని భాషా జ్ఞానంతో వున్న కాలమది! క్రమంగా అనేక క్రొత్త విషయాలనుగురించి తెలిసికొనగానే, కొత్త కొత్త మాటలు కూడా నాకు అలవడినాయి. అంతటితో నేనువేసే ప్రశ్నల సంఖ్యకూడా పెరిగింది. ఒకే విషయాన్నిగురించి ఇంకా

నేర్చుకోనాలనే కుతూహలం ఎక్కువైంది. ఒక్కొక్కప్పుడు ఒక కొత్తమాటని నేర్చుకోనగానే నా మనస్సులో చిత్రింప బడిన పాత అనుభవాలెన్నో నా మనోనేత్రాలముందు ప్రత్యక్షమయేవి.

ఒకనాటిఉదయం నేను మొదటిసారిగా "ప్రేమ" అనే మాటకి అర్థం మిస్. సల్లివాన్‌ని అడగటం నాకు బాగా జ్ఞాపకంవుంది. అప్పటికి నేను ఆట్టే మాటలు నేర్చుకోలేదు. అప్పుడే విడిచిన ఊదాపూలని తోటలోనుంచి తీసుకువచ్చి ఉపాధ్యాయినికి ఇచ్చాను. నన్ను ఆమె ముద్దుపెట్టుకోడానికి ప్రయత్నించింది. కాని, అప్పుడు మా అమ్మతప్ప ఇంకెవరూ నన్ను ముద్దుపెట్టుకోనడం నాకిష్టంలేదు! మిస్. సల్లివాన్ ఆప్యాయంతో తనచేతులతో నన్ను దగ్గరగా తీసుకొని "నేను హెలెన్‌ని ప్రేమిస్తాను." అని నా చేతిలో వ్రాసింది.

"ప్రేమ" అంటే ఏమిటి? అని నే నడిగాను. ఆమె నన్ను ఇంకా దగ్గరగాతీసుకొని, నా హృదయంకేసి చూపిస్తూ "ప్రేమ ఇక్కడవుంది" అని చెప్పింది. మొదటిసారిగా నేను గుండెలుకొట్టుకోనడం తెలిసికొన్నాను. కాని ఆమెచెప్పిన మాటలు నన్ను మరింత గజిబిజిచేశాయి. ఎందుచేతనంటే నేను నా చేతులతో స్పృశిస్తేకాని అర్థంచేసికొనగలిగేదాన్ని కాదు!

మిస్. సల్లివాన్ చేతిలో వున్న ఊదాపూలని వాసన చూస్తూ, సగం మాటలతోనూ, సగం సంజ్ఞలతోనూ "ప్రేమ అంటే పువ్వుల సువాసనా?" అని అర్థంవచ్చేటట్లు ప్రశ్నించాను.

"కాదు." అని ఉపాధ్యాయిని చెప్పింది.

మళ్ళీ కొంతసేపు ఆలోచించాను. సూర్యుడు వెచ్చగా మామీద ప్రకాశిస్తూన్నాడు.

మామీదికి వెచ్చదనంవచ్చే దిక్కుగా చూపిస్తూ "ఇది ప్రేమ కాదూ?" అని అడిగాను. సూర్యుని వేడితోనే ప్రపంచంలో అన్నీ పెరుగుతాయి. సూర్యుని వెచ్చదనంకంటె అందమైనది నాకు ప్రపంచంలో ఏదీలేదనిపిస్తుంది. మిస్. సల్లివాన్ "కాదు" అని సమాధానం చెప్పగానే చాలానిరుత్సాహ పడిపోయాను. అంతా అయోమయంగా తోచింది. మా ఉపాధ్యాయిని నాకు 'ప్రేమ'ని చూపించలేకపోవడం వింతగా తోచింది!

ఒకటి రెండు రోజులతరువాత వేరు వేరుపరిమాణాలలో నున్న పూసల్ని, మొదట రెండు పెద్దపూసలతరువాత మూడు చిన్నపూసలు వుండేటట్లు గుచ్చుతూన్నాను. ఈగుచ్చడంలో నేను ఎన్నోతప్పులు చేశాను. మిస్. సల్లివాన్ ఎంతో ఓపికతో అనేకసార్లు చెప్పినా నేను మాల తప్పుగుచ్చాను. పూసల్ని గుచ్చడం ఆపి ఒక్కక్షణంపాటు పాఠంమీద ధ్యానముంచి, వాటిని సరిగా గుచ్చేపద్ధతిని బాగాఆలోచించాను. మిస్. సల్లివాన్ నా నుదుటిమీద తాకి, నాచేతిలో 'బాగా ఆలోచించు' అని నొక్కిచెప్పినట్లుగా నా చేతిలోవ్రాసింది.

ఆ సమయాన నా మెదడులో కదలుతూన్న భావాలకి 'ఆలోచించు' అన్నమాట సరియైనదని మెరుపు మెరిసినట్లు నా కర్థమైంది. వ్యక్తంచేయలేని భావాలు ఏవిధంగా వుంటాయో తెలిసికొనడం ఇదే నాకు మొదటిసారి!

ఆ తరువాత చాలసేపటివరకూ నేను నిశ్శబ్దంగా కూర్చొనివున్నాను — నా ఒడిలోవున్న పూసలగురించి నేను ఆలోచించడమేలేదు !— నాలోకలిగిన ఈ క్రొత్తభావపు వెలుగులో 'ప్రేమ' అనే మాటకి అర్ధందొరుకుతుందేమో అని ఆలోచిస్తూన్నాను. ఆనాడు రోజల్లా సూర్యుడు మబ్బుల క్రిందే వున్నాడు. అప్పుడప్పుడు తుంపరకూడా పడుతూంది. కాని, హఠాత్తుగా సూర్యుడు మబ్బుతెరలను చీల్చుకొని తీవ్రంగా ప్రకాశించాడు.

అప్పుడు నేను 'ప్రేమ' అంటే ఇదికాదా ? అని ఉపాధ్యాయినిని ప్రశ్నించాను.

సూర్యుడు బయటికిరాకముందు ఆకాశంలోవున్న మబ్బులలాంటిదే 'ప్రేమ' అని ఆమె సమాధానంచెప్పింది.— ఈవిధంగాచెప్తే నేను అర్ధంచేసుకోనలేనని మిస్. సల్లి నాకు సులభమైన మాటలలో ఈ క్రిందివిధంగా నాకు వివరించి చెప్పింది. "మేఘాలని నీవు ముట్టుకోలేవు. కాని వర్షాన్ని ముట్టుకోగలవు. ఎండకి బాగా ఎండిన నేల, పూవులు, వర్షపు చినుకులు మీదపడగానే ఆనందంతో వర్తిస్తాయి ! ఆవిధంగానే ప్రేమని నీవు ముట్టుకోలేవు. కాని ప్రేమయొక్క మాధుర్యాన్ని నీవు చవిచూడగలవు. ప్రేమలేకపోతే నీవు సంతోషంగావుండలేవు. ఆటలాడటానికికూడా ఇష్టపడవు."

రమణీయమైన ఈ సత్యం నా మనస్సుకి హత్తుకుపోయింది. నా ఆత్మకీ, ఇతరుల ఆత్మలకీ మధ్య ఏవో కనుపించని బంధాలు వ్యాపించివున్నాయని అప్పుడు తెలుసుకున్నాను.

నాకు విద్య నేర్పడం ప్రారంభించినప్పటినుంచీ మిస్. సల్లివాన్ తాను వినగలిగే పిల్లలతో ఏవిధంగా మాట్లాడు తుందో, అదేవిధంగా నాతోకూడా మాట్లాడేవిధానాన్ని అవలంభించింది. కాని ఒక్క తేడా ఏమిటంటే నాతో మాట్లాడే బదులు, ఆ మాటల్ని నా చేతిలో వ్రాసేది. నా భావాలని వ్యక్తంచేయడానికి తగినన్ని మాటలు, జాతీయాలు దొరక నప్పుడు వాటిని నాకు చెప్పేది. మా సంభాషణలో నేను సమాధానం చెప్పలేనప్పుడు తానే ఆ సమాధానాన్ని చెప్పి, నా చేత అనిపించేది.

ఈవిధంగా చాలా సంవత్సరాలవరకూ నా విద్యా విధానం సాగింది. చెవిటిపిల్లలకి ఒక్క నెలలో చదువురాదు; ఆఖరికి రెండు మూడు సంవత్సరాలుకూడా సరిపోవు. ప్రతి రోజూ మనం మాట్లాడుకొనే భాషలోవచ్చే అసంఖ్యాకమైన మాటలు, జాతీయాలు ఈ కొద్ది కాలంలో నేర్చుకొనడం చెవిటిబాలికకు సాధ్యంకాదు. మామూలుగా వినగలిగేపిల్ల అయితే చాలాసార్లు వల్లించడంవల్లా, అనుకరించడంవల్లా నేర్చుకుంటుంది. ఇంటిదగ్గర తాను వినే సంభాషణలవల్ల ఆమెలో కొన్ని భావాలుపుట్టి, ఆ భావాలని అనుకోకుండా నే పైకి వ్యక్తంచేస్తుంది. స్వాభావికంగాకలిగే ఈ భావవ్యక్తీ కరణ చెవిటిపిల్లకి వుండదు. ఈ విషయం బాగా తెలిసిన నా ఉపాధ్యాయిని సంభాషించడానికి అనువుగా నాలో ఆలోచన లను రేకెత్తించడానికి తీసికొనవలసిన జాగ్రత్తను ముందే తీసుకుంది. తాను వినే సంభాషణలను తు.చ. తప్పకుండా నా చేతిలోవ్రాసి, నేనుకూడా ఉత్సాహంగా ఆమెతోపాటు

సంభాషణలలో పాల్గొనేటట్లు చేసింది. కాని నాఅంతట నేను ధైర్యంగా సంభాషణని ప్రారంభించడానికి చాలాకాలం పట్టింది. సంభాషణ జరుగుతూండగా ఆ యా సమయాలలో తగినవిధంగా మాట్లాడటానికి ఇంకా ఎంతోకాలంపట్టింది.

చెవిటివారు, గ్రుడ్డివారు సంభాషణసౌకర్యాలను అలవరచుకోడానికి ఎంతో కష్టపడతారు. ఇక చెవుడు, గ్రుడ్డి ఈ రెండు అవకరాలూవున్న వ్యక్తిపడే కష్టం ఇంతింతని చెప్ప లేము. వీరు ఎదుటివారి కంఠస్వరాన్ని సరిగా గుర్తించలేరు. మరియొకరి సహాయంలేనిదే ఎదుటివారు హెచ్చుస్థాయిలో మాట్లాడుతున్నారో, తగ్గుస్థాయిలో మాట్లాడుతున్నారో తెలిసికొనలేరు. సాధారణంగా మాటలకి ప్రత్యేకతనిచ్చేవి హెచ్చు, తగ్గుస్థాయిలే. మాట్లాడేమనిషి ముఖకవళికలుకాని, అతని చూపుకాని వీరు చూడలేరు. ఒకమనిషి చెప్పేమాటల అంతరార్థం అతని చూపులవల్లనే తెలిసికొనవచ్చునుకదా!



# ఏడవ ప్రకరణము

నా విద్యాభ్యాసంలో తరువాత ముఖ్యఘట్టం చదవడం నేర్చుకోవడం,

కొద్ది మాటలకి వర్ణక్రమం చెప్పడం నాకుచేతకాగానే పైకి ఉబికిన అక్షరాలు అచ్చువేయబడివున్న అట్టముక్కల్ని నాచేతికిచ్చింది. ఆ అట్టముక్కలమీద అచ్చువేయబడినప్రతి మాట ఒక వస్తువునో, ఒకపనినో, ఒకగుణాన్నో తెలుపుతుందని నేను అనతికాలంలోనే నేర్చుకోనగలిగాను. నా దగ్గరవున్న చట్రంలో ఆ మాటలువున్న అట్టముక్కల్ని చిన్నచిన్న వాక్యాలుగా అమర్చగలిగేదాన్ని. ఈవిధంగా చట్రంలో అమర్చేముందు వేరువేరు మాటలుగల అట్టముక్కల్ని, వాటికి సంబంధించిన వస్తువులమీదే పెట్టేదాన్ని, ఉదాహరణకి 'బొమ్మ' 'పరుపు' 'మీద' 'ఉన్నది' అనే మాటలువున్న అట్టముక్కల్ని నేను వెతికి తీసి, ప్రతిమాటనీ, ఆ అర్థంవచ్చే వస్తువుమీద వుంచేదాన్ని. అప్పుడు నాబొమ్మని పరుపుమీద పెట్టి 'పరుపు' 'మీద' 'ఉన్నది' అనే మాటలతో పరుపు మీద పెట్టేదాన్ని — అప్పుడు నా బొమ్మని పరుపుమీద పెట్టి ఆ బొమ్మకి ప్రక్కగా 'పరుపు' 'మీద' 'ఉన్నది' అనే మాటల్ని అమర్చేదాన్ని. ఈ విధంగా విడివిడిమాటలతో

అర్థం చెడకుండా నా మనస్సులో వుండే భావం వ్యక్తమయే టట్లు వాక్యాన్ని పూర్తిచేసేదాన్ని.

ఒకనాడు 'బాలిక' అనే మాటవున్న అట్టకి నాగాను పైనవుండే సిల్కురుమాలుపైన గుండుసూదితో గుచ్చుకొని మా పెద్ద బట్టలబీరువా లోపల నిల్చున్నట్లు మిస్. సల్లివాన్ చెప్పింది. తరువాత ఆ బీరువా అరపైన 'బట్టలబీరువా' 'లోపల' 'ఉన్నది' అన్న మాటల్ని వరుసగా అమర్చాను. ఈ విధమైన ఆట నాకెంతో సంతోషాన్నిచ్చేది. మిస్. సల్లి వాన్ నేనూ కలసి గంటలతరబడి ఈ ఆట ఆడుకొనేవాళ్ళం. తరచుగా గదిలో వుండే వస్తువు లన్నిటినీ ఈ మాటలక్రమం లో అమర్చేవాళ్ళం!

ఈ అచ్చు అట్టముక్కల తరువాత ఘట్టం అచ్చుపుస్త కం. నా "ప్రారంభవాచకాన్ని" పట్టగానే నాకు తెలిసిన మాటలకోసం వెతకసాగాను. ఆ మాటలు నాకు కనపించ గానే నా ఆనందానికి మేరలేకపోయేది. ఈవిధంగా మాటల కోసం వెతకడం నాకు 'దాగుడుమూతల' ఆటలావుండేది! ఈ విధంగా నేను చదవటం ప్రారంభించాను. ఎక్కడా ఆగ కుండా కథలను చదవడం ప్రారంభించిన ఘట్టాన్ని గురించి తరువాత చెప్తాను.

చాలాకాలం వరకూ ఒక క్రమపద్ధతిని నాకు పాఠాలు నేర్పడం ప్రారంభింపబడలేదు. ఎంతో శ్రద్ధతో నేనుచదవడం ప్రారంభించినతరువాతకూడా నాకు చదువు ఒకపనివలె కాక ఆటలాగనే తోచింది! మిస్. సల్లివాన్ నాకుబోధించినదంతా ఒక కథవలెనో, పాటవలెనో నేర్పింది. ఏదైనా ఒకప్రత్యేక

విషయం నాకు ఉత్సాహాన్ని కలిగించినప్పుడు, తానుకూడా ఒక చిన్నపిల్ల అయినట్లుగానే మిస్. సల్లివాన్ ఆ విషయాన్ని గురించి నాకు అర్థమయేట్లు చెప్పేది! చాలమందిపిల్లలు ఎంతో కష్టపడి నేర్చుకోవాలని భయపడే వ్యాకరణం, గణితం, లేదా గణితపు నిర్వచనాలు, నేను ఒకఆటగా నేర్చుకున్నాను. అమూల్యమైన ఈ మధుర స్మృతులను ఈనాటికీ నేను పెన్నిధులుగా భావిస్తుంటాను.

నా ఆనందం, నాకోరికలు, వీటియెడ మిస్. సల్లివాన్ కుండే సానుభూతి ఇంతింతనలేనిది. బహుశా అంధులతోడి దీర్ఘకాలపు సహవాసమే దీనికి కారణమని అనుకుంటాను, దీనికితోడు ఆమెకు భగవంతుడిచ్చిన వర్ణనశక్తి అద్వితీయం. ప్రతి చిన్నవిషయాన్నీ విపులంగా వర్ణించి చెప్పేది. మొన్నటి పాఠాలు నాకు జ్ఞాపకం ఉన్నాయో లేవో పరీక్షించడానికి నాపై ప్రశ్నలవర్షం కురిపించేది! విజ్ఞాన శాస్త్రానికి సంబంధించిన అనేక సాంకేతిక విషయాలను అతివాస్తవికంగా నాకు బోధించడంవల్ల ఆమె చెప్పిన ప్రతి విషయం మరచిపోవడానికి వీలులేకుండా జ్ఞాపకం వుండేది!

సూదులలాంటి దేవదారువృక్షపుటాకుల పరిమళాలు దోరగా ముగ్గిన అడవిద్రాక్షల సువాసనలతోనిండిన గాలిలో, సూర్యకాంతిలో తోటలోని చెట్లక్రిందనే మేము పాఠాలు చదవడానికి కూర్చునేవాళ్ళం. విశాలమైన గంగరావిచెట్టుక్రింద కూర్చొని ఆలోచిస్తూండగా ప్రకృతిలోని ప్రతి వస్తువునుండీ మనం నేర్చుకోనవలసినపాఠం వున్నదని తెలుసుకున్నాను. వస్తువులయొక్క సౌందర్యమే వాటి ఉపయోగం నాకు నేర్పి

నది. కూనిరాగంతీసే, రొదచేసే, పాట పాడే, వికసించే వస్తువులన్నీ నా చదువులో ఒక భాగం అయిపోయాయి. బెకబెకమని అరచే కప్పలు, మిడతలు, కీచురాళ్ళు నేను పట్టుకొన్న కొంతసేపటివరకూ భయంతో అరవడం మాని, భయంతీరగానే తిరిగి సంగీతం ప్రారంభించేవి! నున్నటి రెక్కలతో కోడిపిల్లలు, కురువిందపూలు, ఊదాపూలు, అనేక రకాల అడవిపూలు, విరియకాచిన పండ్ల చెట్లు — ఇవి ఎన్నో పాఠాలు నాకు నేర్పాయి. ప్రత్తికాయలు పగిలి విడిపోయినప్పుడు, ఆ పత్తిగింజలచుట్టూ వుండే ప్రత్తిని నా వేళ్ళకి ధారాలుగా చుట్టుకొనేదాన్ని. ఎండిన పత్తికాయలు విచ్చుడం నాకు బాగా తెలిసేది. గాలివీస్తూండగా ధాన్యపు కంకులుచేసే రొద, పట్టులాంటి ఆకులు ఒకదాని నొకటి రాసుకుంటూ చేసే మర్మరధ్వనీ నాకు అవగాహన అయేది. పచ్చికబయలులో మేసే మా పోనీని పట్టుకొని దాని నోటిలో గడ్డిపరకల్ని పెడితే అది బుసకొట్టడం నాకు బాగా జ్ఞాపకం వుంది. సుగంధద్రవ్యాల పరిమళాన్ని చిమ్మే దానిమూతి ఎంత బాగుండేది!

ఒక్కొక్కప్పుడు నేను ఉదయంతోనే లేచి తోటలోకి వెళ్ళేదాన్ని. ఆ సమయాన మంచుబిందువులు పచ్చగడ్డి మీదా, పువ్వులమీదా కప్పివుండేవి. గులాబిపూలు మెత్తగా నా చేతుల్ని స్పృశిస్తూంటే ఎంత హాయిగావుండేది! ఆ సమయానవీచే చల్లని గాలిలో కలువలు ఒయ్యారంగా కదులుతూంటే చెప్పలేని సంతోషంతో నా మనస్సు నిండి పోయేది. ఒక్కొక్కప్పుడు నేను పువ్వులను కోస్తూండగా

పువ్వులోపల వుండే కీటకము పువ్వుమధ్యనే చిక్కుకొని హఠాత్తుగా బయటినుండివచ్చిన ఈ నా చేతుల ఒత్తిడికి భయంతో రెక్కలను రెపరెపలాడించే శబ్దాన్ని నేను గ్రహించేదాన్ని.

నాకు ఇష్టమైన మరియొక ప్రదేశం మా పండ్లతోట. జూలై నెలప్రారంభంలో ఈ తోట ముగిన పండ్లతో కన్నుల పండువుగా వుండేది. బాగా క్రిందికి వ్రేలాడే ఎర్రని ఆపిల్ పండ్లు గాలికి అటూ ఇటూ ఊగుతూ నా చేతిలో రాలి పడేవి. సూర్యుని వేడిమికి వెచ్చగావుండే ఈ పండ్లన్నిటినీ నా రుమాలులో మూటకట్టి సంతోషంతో గంతులు వేస్తూ ఇంటికి తీసుకువెళ్ళేదాన్ని.

టెన్నసీనదిఒడ్డునవుండే "కెల్లర్స్ వార్ఫ్" అనే స్థలానికి మేము తరచు వెళ్ళేవాళ్ళం. ప్రజాయుద్ధపురోజులలో సైనికులు తమ పడవలలో ఈ రేవులోనే దిగేవారట. ఇక్కడే గంటలతరబడి ఆడుకుంటూ నా భూగోళ పాఠాన్ని నేర్చుకున్నాను. గులకరాళ్ళతో ఆనకట్టల్నికడుతూ, దీవుల్ని, సరస్సుల్ని, కాలువలని నిర్మిస్తూ ఉల్లాసంగా గడపేవాళ్ళం. అసలు నేను పాఠంనేర్చుకుంటూన్నట్లు అనిపించేదేకాదు. ఇక్కడే మిస్. సల్లివాన్ నాకు అగ్నిపర్వతాలతోనూ, భూమిలో కప్పబడిన నగరాలతోనూ, కదలే మంచునదుల తోనూ కూడిన భూగోళాన్ని వర్ణించి చెప్తూంటే ఆశ్చర్యంతో వినేదాన్ని. నేను కొండల వరుసలనీ, నది లోయలనీ, నదులు ప్రవహించే మార్గాలనీ సులభంగా తెలిసికొనడానికి వీలుగా మిస్. సల్లివాన్ బంకమట్టితో దేశపటాన్ని తయారుచేసింది.

ఈ పద్ధతినికూడా ఎంతో శ్రద్ధగా గ్రహించాను. కాని భూమిని వివిధ మండలాలుగా విభజించడం, ధృవాలుగా వేరుచేయడం నన్ను కొంత తికమక పెట్టాయి. ఈ వివిధ మండలాలను విభజించే బ్రెయిల్ ధారమూ, ధృవాల్ని తెలియ జేసే నారింజపుల్లలూ నాకు ఈనాటికికూడా నిజమేనని పిస్తాయి. సమశీతలమండలం పేరుచెప్తే నాకు ఇప్పటికీ గుండ్రంగాకట్టిన బ్రెయిల్ ధారాలు జ్ఞాపకంవస్తాయి. ఈ గుండ్రటి గోళంమీద ఎవరైనా అమర్చగలిగితే తెల్లఎలుగుబంట్లు ఉత్తరధృవంపైన ఎక్కుతాయని నన్ను నమ్మించవచ్చు!

నేను చదువుకొనేవాటిలో ఒక్క గణితంమాత్రం నాకు ఇష్టంగా ఉండేదికాదు. మొదటినుంచీ నాకూ సంఖ్యాశాస్త్రానికి విరోధమే! పూసల్ని గుంపులుగుంపులుగా గుచ్చడంద్వారా నాకు లెక్కలు నేర్పడానికి మిస్. సల్లివాన్ ప్రయత్నించింది. కిండర్ గార్డెన్ పద్ధతినీ, గడ్డిపుల్లలద్వారా కూడిక, తీసివేత నేర్చుకున్నాను. ఒకేసారి ఐదారు గుంపులుకన్నా ఎక్కువ అమర్చగలిగేదాన్నికాదు. ఇది పూర్తికాగానే నా మనస్సుకి ఎంతో సంతృప్తిగా వుండేది. తక్షణం లేచి నా స్నేహితులతో ఆడుకొనడానికి వెళ్ళిపోయేదాన్ని.

ఈ విధంగానే జంతుశాస్త్రం, వృక్షశాస్త్రంచదివాను. ఒకసారి నాకు వెన్నెముకలేని జంతువుల సంబంధమైనగుల్లలు చక్కటి ఆనవాళ్ళుగలవికొన్ని, పక్షులగోళ్ళు ముద్రింపబడిన ఇసుకరాయి ఒకటి, అందమైన మొక్కల తొట్టి ఒకటి నాకు కానుకగా ఒకాయన పంపించారు. ప్రాచీన జంతుజాలపు రహస్యాలన్నీ వీటిద్వారా నేనుతెలుసుకోగలిగాను. నోటితో

పలుకలేనంతటి వింతపేర్లతో వికారమైన, భయంకరమైన స్వరూపాలతో పురాతన మహారణ్యాలలో, వృక్షాలపైన విరుచుకుపడి వాటి కొమ్మలను, ఆకులను ఆహారంగా ఉపయోగిస్తూ, ఆఖరికి ఆ అరణ్యపు బురదనేలలో పడి చచ్చిపోయిన జంతువులసి మిస్. సల్లివాన్ వర్ణించి చెప్తూవుంటే వణుకుతూన్న వ్రేళ్ళతో వింటూండేదాన్ని! చాలారోజులవరకు ఈ వింతమృగాలే నాకు కలలో కనుపించేవి. అంధకారబంధురమైన ఈ పురాతన చరిత్రకీ, సూర్యకాంతితో వెల్లివిరిసే పచ్చిక మైదానాలతో, అందాల గులాబీ తోటలతో, ఇంపుగా విన వచ్చే మా పోనీ డెక్కల చప్పుడుతో నిండిన నేటిచరిత్రకీ ఎంత వ్యత్యాసంవుంది!

ఇంకొకసారి నాకొకరు పెద్దసముద్రపుగుల్లని ఇచ్చారు. చిన్నచిన్న నత్తలు తమదేహాన్ని కాపాడుకొనడానికి మెరిసే ఈ గుల్లల్ని ఎంత చాకచక్యంతో నిర్మిస్తాయో, సముద్రపు కెరటాలు కదలకుండా నిశ్చలంగా వున్న రాత్రిసమయంలో 'నావికుడనే పేరుగల' జలచరం తన ముత్యపుచిప్ప నావలో హిందూమహాసముద్రపు నీలి నీటిపైన తేలుతూ ఏవిధంగా ప్రయాణం చేస్తుందో తెలుసుకున్నాను. ప్రచండ వేగంతో గట్టుకికొట్టుకొనే కెరటాలలో పగడాలపురుగు పగడాలదీవుల్ని ఏవిధంగా నిర్మిస్తుందో, ఈవిధంగానే ఒకరకపు సముద్రపు పురుగులు సుద్దకొండల్ని ఏవిధంగా నిర్మిస్తాయో, సముద్రపు బిడ్డలైన ఈ జలచరాల జీవితాన్ని, వాటి అలవాటులనీ జాగ్రత్తగా తెలుసుకున్నాను. ఈ విధంగా వెన్నెముకలేని ఈజలచరాలు తమచుట్టూ గుల్లని నిర్మించుకొనే విధానం మానవుని

మెదడు వృద్ధిచెందే విధానం ఎంతదగ్గరసంబంధం గలిగివున్నా యో మిస్. సల్లివాన్ నాకు విపులంగా చెప్పింది. ఈ జల చరాలు సముద్రపునీటినుంచి తాము గ్రహించినపదార్థాన్ని తమచుట్టువుండే రక్షక కవచంగా ఏవిధంగా మార్చుతున్నా యో, అదేవిధంగా కొద్దికొద్దిగా మనమనస్సు గ్రహించిన విష యాలు మార్పు చెంది, ఆలోచనల నేముత్యాలుగామారతాయి.

ఒకనాడు మొక్క పెరిగేవిధానంమీద పాఠం నేర్చు కొన్నాను. 'లిల్లీ' పూల తొట్టెని బాగా ఎండతగులుతూన్న కిటికీలో పెట్టాము. మరుక్షణంలోనే మొనలుతేరిన మొగ్గల పైనుండే ఆకుపచ్చని రక్షకదళాలు తెరచుకొనడం ప్రారం భించాయి. మొట్టమొదట పైనుండే రక్షకదళాలు తమ లోపలనుండే రేకుల అందాన్ని బయటపెట్టడం ఇష్టంలేనట్లు తెరచుకొనడానికి ఆలస్యంచేశాయికాని, ఆ పని ప్రారంభించాక మాత్రం త్వరితంగా ఒక క్రమపద్ధతిలో తెరచుకొన్నాయి. ఈవిధంగా ఒకదానితో ఇంకొకటి పందెంవేసుకొన్నట్లు, చెట్టంతా పూలతోనిండి, చక్కని పరిమళాన్ని వెదజల్లుతాయి.

ఒకసారి మొక్కలు, నాచువున్న గుండ్రనిగాజుతొట్టెలో పదకొండు కప్పపిల్లలు వేగంగా ఈదుతు గంతులువేస్తూ న్నాయి. కిటికీలోవున్న ఆ తొట్టెదగ్గరికివెళ్ళి నా చేతివ్రేళ్ళను వెడల్పుగాపెట్టి తొట్టిలో ముంచగా, నా వ్రేళ్ళ సందులనుంచి ఆ కప్పపిల్లలు తమ తోకల్ని ఆడిస్తూ దూసుకుపోవడం మొదలుపెట్టాయి. ఒకరోజున అన్నిటిలో చురుకైన కప్పపిల్ల ఒకటి తొట్టెపైకి బాగాఎత్తుకి ఎగిరి నేలమీద పడిపోయింది. అక్కడ అది చలనం లేకుండా చచ్చి పడిపోయినట్లుంది. కాని

దాని తోకమాత్రం కొట్టుకుంటూంది. తక్షణం దానినితీసి నీటితొట్టెలో వేయగానే తొట్టె అడుగుభాగానికి మునిగి మరు క్షణంలో సంతోషంతో తొట్టె నాలుగుమూలలకీ చరచర తిరగడం మొదలుపెట్టింది! ఒకసారి తానుండే నీటితొట్టె లోపలినుంచి బయటికిఉరికింది. విశాలమైన ప్రపంచాన్ని చూసింది. కాని దీనికంటె గాజుతొట్టెలోవున్న మొక్కల క్రిందె తన జీవితం హాయిగా వుంటుందని సంతృప్తిగా తన స్థానానికి తిరిగివచ్చి, పెరిగి కప్పగా మారేదాకా అక్కడే వుంది. తరువాత మాతోటచివరవున్న చెరువులో ఆకులమధ్య పాటలు పాడుతూ వేసవిరాత్రులని సంగీతంతో నింపింది!

ఆ విధంగా నేను వాస్తవిక జీవితంనుంచే అనేకవిష యాలు నేర్చుకొన్నాను. మొట్టమొదట నేనొక కోర్కెల పుట్టని, క్రమంగా ఈ నా కోర్కెలకి మిస్. సల్లివాన్ ఒక రూపాన్నిచ్చింది. ఆమె వచ్చిరావడంతోనే నా చుట్టూవున్న ప్రతివస్తువూ ప్రేమతో, ఉల్లాసంతో నా కన్నులయెదుట సాక్షాత్కరించింది. ఆ క్షణంనుంచి మిస్. సలివాన్ నాఎదుట జరిగే ప్రతిసంఘటననీ నాకు వర్ణించి చెప్పేది. నా జీవితం సుఖప్రదంగా, ఉపయోగకరంగా గడవడానికి అనువుగా తాను చేయవలసినదంతా మిస్. సల్లివాన్ చేసింది. మిస్. సల్లివాన్ మేధాశక్తి, సానుభూతి, సమయోచితమైన చాతుర్యం ఇవే నా బాల్యాన్ని ఎంతో సుఖప్రదంగా గడపడానికి సహాయ పడ్డాయి. సమయోచితంగా ఆమె నాకు చదువుచెప్పడంవల్ల నే నేను ఎంతో ఉత్సాహంగా ఆమెవద్ద విద్యనభ్యసింపగలిగాను. పిల్లల మనస్సు లోతులేని సెలయేటివంటిదనీ, విద్యాభ్యాసం

అనే రాళ్ళగుట్టల మధ్యనుంచి అది ప్రవహించేటప్పుడు ఉత్సాహంతో ముందుకు దూకుతూ, రాళ్ళతాకిడికి తొణికేఅలలతో పైన ఆకాశంమీద సాగిపోయే ఆ మబ్బుతునకనీ, గట్టుమీద వున్న ఈ చెట్ల ఆకులనీ, పూలనీ ప్రతింబింబింపజేస్తూ వుంటుందనీ, ఈ సెలయేటికి నిరంతరాయంగా కొండవాగులూ, నీటిధారలూ వచ్చిచేరితేనే మధ్యలో ఇంకిపోకుండా విశాలమైన ప్రవాహమై, లోతైన నదిలో కలిసి, నిశ్చలరూపంతో, సువిశాలమైన నీలపుటాకాశాన్నీ, మెరిసే చెట్లనీడల్నీ, కదలే చిన్నపూలనీ తనలో ప్రతిబింబింపజేయగలుగుతుందనీ, మిస్. సల్లివాన్ గ్రహించి, దానికి తగినట్లు నా విద్యావిధానాన్ని తీర్చి దిద్దింది.

ప్రతి ఉపాధ్యాయుడు పిల్లవాణ్ణి పాఠశాలకి తీసుకు వెళ్ళగలడు. కానీ బాలుణ్ణి చదివేటట్లుమాత్రం చేయడంకష్టం! ప్రతిబాలుడు ఉత్సాహంతో, స్వేచ్ఛతో పాఠశాలలోవున్నా, ఇంటిదగ్గరవున్నా తన శక్తిమీద తనకి నమ్మకం కలిగేపద్ధతిలో శిక్షణపొందే అవకాశాన్ని, ఉపాధ్యాయుడు వారికి కలిగించాలి. మధ్యమధ్యవచ్చిన అనేక ఆశాభంగాలను తట్టుకొని, నిరుత్సాహపడకుండా ధైర్యంతో ముందుకు సాగిపోతూ, హృదయపూర్వకంగా ప్రయత్నిస్తూ పట్టుదలతో చదువునేర్చుకొనాలనే ఆకాంక్ష బాలురకు కలిగేటట్లు ఉపాధ్యాయుడు అనుకూల వాతావరణాన్ని సృష్టించగలగాలి. ఆవిధంగాచేయగలిగిననాడే పాఠ్యపుస్తకాల సోమరి గోడల్ని విద్యార్థులు దాటగలుగుతారు.

నా ఉపాధ్యాయిని ఎప్పుడూ నాకు అంతసన్నిహితంగా వుండేది. నేనూ, ఆమె, వేరనేవిషయమే నేను మరచిపోయే దాన్ని. ప్రకృతిలోని అందాన్ని గ్రహించగలిగేశక్తి ఎంత వరకూ నాలో స్వతస్సిద్ధంగా వున్నదో, నా ఉపాధ్యాయిని ద్వారా ఎంతవరకూ అలవర్చుకున్నానో చెప్పడం కష్టమే! కాని ఆమెలేకుండా నేను వుండడం అసంభవమనీ, ఆమెఅడుగు జాడలలోనే నేను నడచివెళ్తున్నాననీ నిశ్చయంగా నేను చెప్పగలను. నాలో వుండే తెలివితేటలు, నాసంతోషం, నా ఆశలు, ఆశయాలు — ఒక్కమాటలో చెప్పాలంటే నాలో వున్న మంచిగుణాలన్నీ ఆమె అమృత హస్తస్పర్శవల్లనే మేల్కొన్నాయి!



# ఎనిమిదవ ప్రకరణము

మిస్. సల్లివాన్ మాఇంటికి వచ్చినతరువాత మొదటి క్రిస్టమస్ పండుగ ఎంతో గొప్పగా జరిగింది. మా ఇంట్లో ప్రతి ఒక్కరూ వింతవింత బహుమతుల్ని నాకోసం సిద్ధం చేశారు. కాని, మిస్. సల్లివాన్, నేనూ తక్కిన అందరికీ ఆశ్చర్యాన్నికలిగించేవాటిని తయారుచేయడం నాకు చెప్పలేనంత సంతోషాన్ని కలిగించింది. ఈ బహుమతుల రహస్యం మాత్రం నాకు ఎంతో సంతోషంగా వుండేది. నా స్నేహితులు సగంసగం మాటలతోనూ, సూచనలతోనూ కూడిన బహుమతులతో నాకు మరింత సంతోషాన్ని కలిగించేవారు. తీరా సమయంవచ్చేసరికి వీటి రహస్యం బయటపడిపోయేది! ప్రతి సాయంత్రం మిస్. సల్లివాన్, నేనూ చలిమంటదగ్గర కూర్చున్నప్పుడు 'చెప్పుకో చూద్దాం' ఆట ఆడుకొనేవాళ్ళం. నాకుచెప్పే పాఠాలు, నేర్పే భాషకంటె ఈ విధంగా నేను ఎక్కువ మాటల్ని నేర్చుకొన్నాను. క్రిస్టమస్ పండుగ దగ్గర పడినకొలదీ ఈ ఆట మరింత తమాషాగా వుండేది!

క్రిస్టమస్ సమయంలో టస్కంబియా బడిపిల్లలందరూ చేరి "క్రిస్టమస్ చెట్టు"ని అలంకరించారు. ఈ ఉత్సవానికి నన్నుకూడా పిలిచారు. వింతవింత పండ్లకొమ్మలతో లేత

రంగులతో ఈ క్రిస్ట్‌మస్ చెట్టు పాఠశాలలో ఒకగదికి మధ్యగా అలంకరింపబడింది. పట్టలేని సంతోషంతో మైమరచి నేను ఆ చెట్టుచుట్టూ గంతులువేస్తూ నాట్యంచేశాను. అక్కడ చేరిన పిల్లలందరికీ తలయొక బహుమతీవుందని తెలిసి చాలా సంతోషించాను. ఆ బహుమతులు నాచేతనే పంచిపెట్టించారు. అందరికీ బహుమతులు పంచిపెడేతూ నా బహుమతినికూడా మధ్యలో చూసుకోకుండా వుండలేకపోయాను! నాకు అంత వరకూ వచ్చిన బహుమతులకంటె, ఇంకా ఎన్నో వింతవింత బహుమతులు నాకోసం సిద్ధంగా వున్నాయనీ, అసలు క్రిస్ట్‌మస్ పండుగ ముందు ఉందనీ మిస్. సల్లివాన్ నాతో చెప్పగానే పట్టలేని సంతోషంతో ఉక్కిరిబిక్కిరై పోయాను. ఆనాటి రాత్రికిమాత్రం క్రిస్ట్‌మస్ చెట్టుదగ్గర నాకువచ్చిన బహుమతులతో సంతృప్తిచెందమనీ, తక్కిన బహుమతులు మరునాడు ఉదయం చూసుకోవచ్చుననీ మిస్. సల్లివాన్ చెప్పగానే, నా మేజోడును వ్రేలాడగట్టి, నిద్రపోతూన్నట్లు నటించాను. కాని ఆ సంతోషంలో నిద్రపడితేగా! క్రిస్ట్‌మస్ తాతయ్య నాకు ఏమి బహుమతులు తెస్తాడోనని చాలా రాత్రివరకూ మేలుకొనే వున్నాను. ఆఖరికి నా పక్కలోవున్న కొత్తబొమ్మతోను, తెల్ల ఎలుగుబంటితోనూ నిద్రపోయాను. మరునాటి ఉదయం అందరికంటె ముందుగా నేనేలేచి 'మెర్రీ క్రిస్ట్‌మస్' అంటూ అందరినీ లేపాను. వింతవింత బహుమతులు నా మేజోడులోనే కాక బల్లమీద, కుర్చీమీద, కిటికీలోనూ ఎక్కడచూసినా అవే. ఉల్లిపొర కాగితంలోచుట్టిన ఈ బహుమతులను దాటుకుంటూ వెళుతూంటే కొన్ని నా కాలికితగిలి

దొర్లిపోయేవి. కాని, నాఉపాధ్యాయిని మిస్. సల్లివాన్ నాకు పాటలుపాడే చిలుకని క్రిస్టమస్ బహుమతిగా ఇవ్వడంతోనే నా హృదయంలోఉండే ఆనందం కట్టలుతెంచుకొని ప్రవహిం చింది!

నా చిలుక 'టిమ్' నాతో ఎంతో చనువుగా నా వ్రేళ్ళ మీద కూర్చుని గంతులువేసేది — నేనిచ్చిన ఎర్రని పండ్లను తినేది. మిస్. సల్లివాన్ ఈ చిలుకని ఏవిధంగా పెంచాలో అంతా నాకు నేర్పింది. ప్రతిరోజూ ఉదయం 'టిమ్' స్నానం చేయడానికి నీళ్ళుసిద్ధంచేసి, చిన్న గిన్నెలతో గింజలూ, మా తోట నూతినుండి తెచ్చిన తీయని నీళ్ళూ గిన్నెలతో పంజ రంలోపల పెట్టేదాన్ని. ఇంకా అది తినడానికి మంచి దొగ్గలి కూరని పంజరంలో వ్రేలాడగట్టేదాన్ని.

ఒకనాటి ఉదయం పంజరం కిటికీలోపెట్టి 'టిమ్' పోసు కోడానికి నీళ్ళు తీసుకురావటానికి వెళ్ళాను. తిరిగివచ్చి గది తలుపు తెరుస్తూండగా ఒక పెద్ద పిల్లి నన్ను రాసుకుంటూ పారిపోయింది. మొదట ఏమిజరిగిందీ నాకు అర్థంకాలేదు. కాని నా చేతులు పంజరంలోపల పెట్టగానే మామూలుగా నా వ్రేళ్ళకి తగిలే పట్టుకుచ్చులాంటి 'టిమ్' రెక్కలుగాని, వాడియైన చిన్న గోళ్ళుగాని నాకు తగలలేదు. తీయగాపాడే నా చిన్నచిలుక 'టిమ్' ఇంక నాకు కనుపించదని అప్పుడు నాకు తెలిసింది.



# తొమ్మిదవ ప్రకరణము

నా జీవితంలో తరువాతి ముఖ్యఘట్టం 1888 వ సంవత్స రంలో నా బోస్టన్ ప్రయాణం, ప్రయాణసన్నాహం; మా అమ్మ, మిస్. సల్లివాన్ లతో నేను బయలుదేరడం, మా ప్రయాణం, ఆఖరికి బోస్టన్ చేరడం — ఇదంతా నిన్ననే జరిగినట్లు నాకు జ్ఞాపకంవుంది. అంతకుముందు రెండుసంవత్స రాలక్రితం బాల్టిమోర్ కి నేనుచేసిన ప్రయాణానికీ, దీనికీ తేడావుంది! ఆ ప్రయాణంలో కూర్చున్నచోట కూర్చోకుండా ప్రతి చిన్నవిషయానికీ ఉద్రేకపడుతూ, మాలో ప్రయాణం చేస్తున్న జనమంతా నాకు ఇష్టంవచ్చే విధంగా చేయాలనిపట్టు పడుతూ, చాలా అల్లరిచేశాను! ఈ ప్రయాణంలో నేను కిమ్మనకుండా మిస్. సల్లివాన్ పక్కని కూర్చొని, రైలు కిటికీగుండా కనపడే టెన్నెసీనది, పెద్దపెద్ద ప్రత్తిపొలాలు, కొండలు, అడవులు, గుంపులుగాచేరి రైలులోవుండేవారివైపు నవ్వుతూ చేతులూపే నీగ్రోపిల్లలు, వాళ్ళు రైలుపెట్టెలో అమ్మకానికి తీసుకువచ్చే బెల్లపుటుండలు, పేలాలఉండలు— వీటినిగురించి నాకు వర్ణించిచెప్తూంటే వింటూ ప్రతివిషయాన్నీ జ్ఞాపకం వుంచుకున్నాను. నాకు ఎదురుగావున్న బల్లమీద రంగురంగుల గళ్ళపరికిణీ కట్టుకొని, ముడతల టోపీ కళ్ళమీద

ఎండతగలకుండా పెట్టుకొని, నా ఆటబొమ్మ 'నాన్సీ' తన పూసలకళ్ళతో నావైపుచూస్తూ కూర్చుంది. మిస్. సల్లివాన్ వర్ణనలు నాకు అంతగా ఉత్సాహం కలిగించనప్పుడు 'నాన్సీ' నాదగ్గరే వున్నట్లు జ్ఞాపకం తెచ్చుకొని, నా చేతులలోకి తీసుకొనేదాన్ని కాని! నేను ఎత్తుకోనందుకు కోపంపెట్టుకోకుండా 'నాన్సీ' హాయిగా నిద్రపోతూందనే అనుకొని తృప్తిచెందేదాన్ని.

ఇటుపైన 'నాన్సీ'ని గురించి చెప్పే అవకాశంకలుగదు కనుక ఇక్కడే విచారకరమైన ఒకవిషయం చెప్తాను. మేము బోస్టన్ చేరగానే ఇన్‌స్టిట్యూషన్‌లోవున్న గుడ్డల్ని శుభ్రపరచే మసిపి మురికిగావుందని నాకు తెలియకుండా నాన్సీకి నీళ్ళుపోసింది— అసలు నాన్సీ ఇష్టపడకపోయినా బలవంతంగా దానిచేత మట్టి బటాణీలను తినిపించాను. అందుచేతనే దాని ఒళ్ళంతా బాగా దుమ్ముతో నిండిపోయింది ఈ విధంగా నీళ్ళుపోయడంతో 'నాన్సీ' ఆనవాలు పట్టలేకుండా ఒకప్రత్తి మూటలా తయారైంది. కోపంగా నావైపుచూసే ఆ రెండు పూసల కళ్ళూ లేకపోతే ఆ ప్రత్తిమూటకి 'నాన్సీ' అని గుర్తుపట్టలేకపోయేదాన్ని.

మా రైలుబండి బోస్టన్ చేరగానే ఎన్నాళ్ళనుంచో తీయని కలలుగంటూన్న 'దూరదేశానికి' నేనుచేరుకొన్నాను. 'పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూషన్'కి వెళ్ళిన కొద్దిరోజులలోనే, నేను చాలామందితో స్నేహంచేసుకున్నాను. అక్కడివారికికూడా 'హస్తాక్షరమాల' వచ్చుననే విషయం నాకు తెలియగానే నా సంతోషానికి మేరలేకపోయింది. అంతవరకూ నేను మిస్.

సల్లివాన్ సహాయంతోనే ఇతరులతో మాట్లాడగలిగేదాన్ని. 'లారా బ్రిడ్జ్‌మన్ విద్యాభ్యాసంచేసిన ఆ పాఠశాలలో వున్నప్పుడు నాకు స్వంతఇంటిలో వున్నట్టే అనిపించింది. నా చుట్టూవున్న పిల్లలంతా అంధులనేసంగతి నమ్మడానికి నాకు కొంతకాలంపట్టింది. నేను చూడలేననేసంగతి నాకు తెలుసును. కాని నన్నెంతో ప్రేమించి, ఉత్సాహంతో నాచుట్టూ గుమిగూడే నాతో ఆడుకొనే ఇక్కడి నా స్నేహితులందరూ అంధులనేమాట నమ్మలేకపోయాను! ఆ పిల్లలతో నేను మాట్లాడినప్పుడు నా చేతులపైన తమచేతులను పెట్టడం, పుస్తకాలు చదివేటప్పుడు వేళ్ళతో తడుముకొంటూ చదవడంచూస్తే నాకు ఆశ్చర్యం, బాధా కలిగాయి. ఈ విషయం నేను అంతకుముందే విన్నా, అంగవైకల్యానికి నేను లోనైనా ఆ పిల్లలు వినగలరుకనుక వారికి ఒకవిధమైన "రెండవదృష్టి" వుంటుందనీ, అదీగాక చూడడం, వినడం ఈ రెండుశక్తులూ లేని నావలెనే ఇంకొకరు, ఇంకొకరు వుండడం అసంభవం అనీ అనుకొన్నాను. కాని సంతోషంతో కేరింతాలుకొడుతూ, సంతృప్తిగావుండే ఆ పిల్లల నడుమ ఈ బాధని నేను మరచిపోయాను!

ఆ గ్రుడ్డిపిల్లలనడుమ ఒక్కరోజుగడుపగానే ఆ వాతావరణానికి పూర్తిగా నేను అలవాటుపడ్డాను. సంతోషకరమైన ఆ వాతావరణంలో రోజులు ఇట్టే దొర్లిపోయాయి. బోస్టన్ చూచినతరువాత ఇక ప్రపంచంలో చూడవలసినదేమీ లేదనిపించింది!

నేను బోస్టన్‌లో వుంటూండగా అమెరికావిప్లవం

జరిగిన 'బంకర్ హిల్' చూడడానికి వెళ్ళాను. ఇక్కడే నేను చరిత్ర తొలి పాఠాలను నేర్చుకొన్నాను. నేను నిలిచియున్న ప్రదేశంలో విప్లవకారులు ధైర్యసాహసాలతో పోరాడిన సంగతి తెలిసికొని ఆశ్చర్యచకితురాలనయ్యాను. ఆ జ్ఞాపక చిహ్నపుమెట్లను ఎక్కుతూ పై పైకి వెళుతూండగా, సైనికులు ఈ విధంగానే మెట్లపైకి ఎక్కుతూ క్రిందవున్న శత్రువులమీదికి కాల్పులుసాగించివుంటారని అనిపించింది.

ఆ మరునాడు 'స్టీమ్‌లాంచ్' మీద ప్లిమత్ పట్టణం చేరుకున్నాం. సముద్రంమీద ప్రయాణం చేయడం, 'స్టీమ్ లాంచ్' ఎక్కడం ఇదే నాకు మొదటిసారి — ఈ స్టీమ్‌లాంచ్ ఎంత సజీవంగా, చలాకీగావుంది! కాని, దానిలోవున్న ఇంజను శబ్దం విని ఉరుముతూన్నట్లు భ్రమపడి, వర్షం కురిస్తే మా 'పిక్నిక్' చెడిపోతుందని ఏడవడం మొదలుపెట్టాను. ప్లిమత్ పట్టణంలో తక్కినవాటికంటె మొట్టమొదట 'యాత్రికులు' అడుగుపెట్టిన పెద్దశిల నాకు ఎక్కువఆశ్చర్యం కలిగించింది. ఆ రాతిని నేను ముట్టుకొనడంచేత, ఆ యాత్రికులు పడిన కష్టాలు నాకు మరింత కన్నులకు కట్టినట్లు కనుపించాయి. నేను ప్లిమత్ పురమందిరానికి వెళ్ళినప్పుడు '1620' అని చెక్కబడిన 'ప్లిమత్ శిల'ని జ్ఞాపకచిహ్నంగా ప్రేమతో నాకు ఒకరు ఇచ్చారు—ఆ రాతిమీద చెక్కబడిన అంకెలు, వంపులు నా చేతితో తడవుతూంటే అంతకుముందే నాకు తెలిసిన 'యాత్రికుల' నా సాహసగాథ అప్రయత్నంగా నామనస్సులో తిరిగింది.

బోస్టన్‌లో నాకు స్నేహితులైన అనేకమందిలో

ప్రముఖవర్తకుడు, పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూషన్ ధర్మకర్తఅయిన 'విలియమ్ ఎండికాట్' ఆయనకూతురు, ఎప్పటికీమరపురాదు. వారు నాలోనాటిన ప్రేమబీజమే పెరిగి పెద్దదై ఎన్నోమధుర స్మృతులను కలిగిస్తూంది. ఒకనాడు 'బెవర్లీ ఫారమ్స్'లోవున్న వారి ఇంటికి వెళ్ళాము. అక్కడవున్న గులాబీతోటలో నేను చాలాసేపు తిరిగాను. అక్కడే 'లియో' అనే పెద్దకుక్క, ఉంగరాలు తిరగిన మెత్తటిజుట్టుతో, వ్రేలాడే పొడవైన చెవులతో 'ఫ్రిట్జ్' అనే కుక్క, నన్నుకలసికొనడానికి వచ్చాయి. వేగంగాపరుగెత్తే 'నిమ్రోడ్' అనే గుర్రం నాచేతిలోవున్న పంచదారని కొత్తలేకుండాతిని, నేను దానిని తట్టుతూంటే అలవాటైనట్లు నిలుచుంది!

సముద్రతీరాన ఇసుకలో ఆడుకొనడం నాకు బాగా జ్ఞాపకంవుంది. ఇసుకలో ఆడుకొనడం నాకిదే మొదటిసారి! సముద్రపు గుల్లలతోనూ, నాచుతోనూ కూడుకొన్న బ్రూస్టర్‌లోని గరుకు విడిఇసుకకీ, ఇక్కడి గట్టి, నునుపు ఇసుకకీ ఎంతో తేడావుంది. బోస్టన్‌నుంచి ఈ ప్రదేశంగుండా యూరప్‌దేశానికివెళ్ళే పెద్ద పెద్ద ఓడల గురించి మిస్టర్. ఎండికాట్ నాకు విపులంగా వర్ణించి చెప్పారు.

ఆ తరువాతకూడా మిస్టర్. ఎండి కాట్‌ని ఎన్నో పర్యాయములు కలసికొన్నాను. నా ముఖ్య స్నేహితులలో ఈయన ఒకరు. మిస్టర్. ఎండి కాట్‌ని మనస్సులో పెట్టుకొనే బోస్టన్ నగరాన్ని నేను "ఉదార హృదయుల నగరం" అని వర్ణించాను!



# పదియవ ప్రకరణము

పెర్కిన్స్ ఇన్స్టిట్యూషను వేసవిసెలవులకి మూసి వేయగానే మిస్. సల్లివాన్, నేనూ కేప్ కాడ్ దగ్గరవున్న బ్రూస్టర్‌లో హాప్‌కిన్సనతితో గడపడానికి నిశ్చయించుకొన్నాం. హాప్‌కిన్సనతి మిస్. సల్లివాన్ పెర్కిన్స్ ఇన్స్టిట్యూషన్‌లో చదువుకొనేరోజుల్లో ఆ సంస్థ నిర్వాహకురాలిగా వుండేది. మిస్. సల్లివాన్ని తల్లివలె ఎంతో ప్రేమతో చూసేది. బ్రూస్టర్ సముద్రతీరాన్ని గురించి మనోహరమైన వర్ణనలు అదివరకే వినివుండటంచేత అక్కడికి ఎప్పుడు వెళుతామా అని నా మనస్సు ఉవ్విళ్ళూరింది.

అంతవరకూ నేను సముద్రానికి చాలాదూరంలో వుండటంచేత ఒక్క పిసరంతైనా సముద్రపుగాలిని పీల్చి ఎరుగను! కాని 'మేరీ లూసీహాల్' రచించిన "అవర్ వరల్డ్" అనే పిల్లల భూగోళపుస్తకంలో సముద్రాలనిగురించి వర్ణనని చదివాను. అప్పటినుంచీ హోరుపెట్టే సముద్ర కెరటాలని ముట్టుకోవాలని కోరిక వుండేది. త్వరలోనే నా కోరిక నెరవేరుతుందని తెలియగానే సంతోషంతో ఉప్పొంగిపోయాను.

బ్రూస్టర్ చేరిన కొద్దిరోజులలోనే స్నానపుదుస్తులు

మిస్. సల్లివాన్ సహాయంతో వేసుకొని సముద్రానికి బయలుదేరాం. సముద్రతీరానికిచేరగానే వెచ్చని ఇసుకలో సంతోషంతో గంతులువేస్తూ, నదురూ బెదురూలేకుండా చల్లని సముద్రపునీటిలోనికి ఉరికాను. బ్రహ్మాండమైన కెరటాలు నన్ను ఊపుతూ ముంచి తేల్చాయి. ఈ కెరటాలపైన తేలడం నాకు ఒక అనిర్వచనీయమైన సంతోషంకలిగింది. కాని ఈ సంతోషం ఎంతోసేపు వుండలేదు. కెరటాల వేగానికి ఒక రాతిని కొట్టుకొని నా కాలికి బలమైన దెబ్బతగిలింది. మరుక్షణంలో ఒక పెద్దకెరటం నా పైనుంచి వేగంగా వెళ్ళిపోయింది. చేతికి ఏదైనా దొరుకుతుందేమోనని ఎంతో ప్రయత్నించాను కాని, సముద్రపు నాచు, నీరు మాత్రం నాకు దొరికాయి. సముద్రపు కెరటాలు ఆ మూలనుంచి ఈ మూలకీ, ఈమూలనుంచి ఆమూలకీ నన్ను గెంటుతూ ఆటాడుతూన్నట్లు అనిపించింది. నాకు స్థిరమైన ఆసరాగావుండే నేల నా పాదంకిందనుంచి దూరమైపోయింది. గాలి, వేడిమి, ప్రేమ, జీవం — నన్ను చుట్టుముట్టిన నీటిలో ఎక్కడా కనుపించలేదు! ఆ క్షణాలు ఎంత భయంకరంగా వున్నాయో! ఆఖరికి ఈ కొత్తఆటవస్తువుతో విసుగుచెందినట్లు సముద్రం నన్ను ఒడ్డుమీదికి విసిరేసింది. మరుక్షణంలో నేను మిస్. సల్లివాన్ చేతులలో వున్నాను! ఎంతో ఆప్యాయంగా ఆమె కౌగిలిలో ఎంతసేపువున్నానో! ఈ నా భయంనుంచి తేరుకొని మాట్లాడేశక్తి నాలో రాగానే "ఈ నీటిలో ఇంత ఉప్పువేసిం దెవరని" మిస్. సల్లివాన్ని ప్రశ్నించాను!

సముద్రపునీటిలో మొదటిసారిగా నాకుకలిగిన ఈ

అనుభవంతో, నా స్నానపుదుస్తులతో ఒక పెద్ద రాతిమీద కూర్చొని, ఒకదానితరువాత ఒకటిగావచ్చే కెరటాలు ఆ రాతిని ఢీకొంటూ, నీటిజల్లుతో నా దుస్తుల్ని తడుపుతుంటే ఎంతో సరదాగావుండేది. ప్రచండవేగంతో వచ్చిన కెరటాలు ఒడ్డుని ఢీకొంటూంటే వాటితోపాటు సముద్రపుగుల్లలుచేసే గలగలమనే శబ్దం, ఆ వేగానికి కంపించే సముద్రపుటొడ్డూ, సముద్రపు ఘోషతోనిండిన గాలీ — వీటిని నేను గ్రహింపగలిగేదాన్ని. వెనుకకి తిరిగివెళ్ళిపోయే కెరటాలు, తిరిగి మరింత వేగంగా, మరింత పెద్దకెరటంగా వచ్చి నా రాతిని ఢీకొన్నప్పుడు నేను భయంతో, కొట్టుకొంటూన్న గుండెలతో ఆ రాతిని గట్టిగా కౌగలించి పట్టుకొని ఆ కెరటాల తాకిడినీ, గర్జననీ గ్రహించేదాన్ని!

మనస్సుకి ప్రశాంతినిచ్చే చల్లని ఆలోచనలు, స్వచ్ఛమైన ఆ సముద్రపు గాలిలో, నీటిలోవుండే రకరకాల సముద్రపు గుల్లలు, గులకరాళ్ళు, నాచుమొక్కలు నన్నెప్పుడూ ఆకర్షించేవి. ఒకనాడు మిస్. సల్లివాన్ గట్టుకి చేరువగానున్న నీటిలో ఒక 'గుర్రపుడెక్క పీత'ని పట్టుకొని నా దగ్గరకి తీసుకువచ్చి చూపించింది. అంతకుముందెప్పుడూ నేనలాంటి పీతని చూడలేదు. దానిని తడివిచూసి, వింతగా వుండటంచేత ఇంటికి తీసుకువెళ్ళడానికి నిశ్చయించాను. రెండుచేతులతోనూ దాని తోకని పట్టుకొని ఎంతో కష్టంమీద ఇంటికి తీసుకు వెళ్ళాను. అంత బరువుగలదానిని మోయగలిగినందుకు నాకెంతో తృప్తికలిగింది. ఆ పీతని నూతిదగ్గరవుండే ఒక పెద్ద నీటితొట్టెలో వేసేవరకూ మిస్. సల్లివాన్ని నేను నిద్ర

పోనివ్వలేదు. మరునాటి ఉదయం నేనా తొట్టెదగ్గరకి వెళ్ళి చూస్తే ఆ పీత అంతర్ధానమైపోయింది. కాని అది ఎక్కడికి పోయిందో మాత్రం ఎవ్వరూ కనిపెట్టలేకపోయారు. నేను మాత్రం చాలా నిరుత్సాహపడ్డాను. కాని త్వరలోనే నేను చేసినపని తప్పు అని తెలుసుకున్నాను. నోరులేని ఆ జీవుల్ని తాము నివసించే నీటినుంచి పైకి తీసుకురావడం తెలివితక్కువ పని అనీ, బహుశా ఆ పీత తిరిగి తనచోటికి వెళ్ళి హాయిగా వుండివుంటుందనీ నాలో నేనే సమాధానం చెప్పుకొని సంతృప్తిచెందాను.



# పదకొండవ ప్రకరణము

అనేకమధురస్మృతులతో నిండిన హృదయంతో 1888వ సంవత్సరపు ఆకురాలుకాలంలో మా దక్షిణపుటింటికి తిరిగి వచ్చాను. అనేక అనుభవాలతో కూడిన నా ఉత్తరదేశపు యాత్రను తలచుకొంటేనే నాకు ఆశ్చర్యంవేస్తుంది. అనేక పెద్దవిషయాలు తెలిసికొనడానికి అది ఒక నాంది అనిపించింది. నేను చూచిన ప్రతివస్తువులోపలికీ 'దూరబడి' దానిని పరీక్షగా తెలిసికొనేదాన్ని. ఒక్కక్షణంకూడా నేను సోమరితనంగా గడపలేదు. నేను అనేకమందిని కలసికొన్నాను. నా చేతిలో వ్రాస్తూ వాళ్ళ అభిప్రాయాలను నాకు తెలియజేస్తూంటే నా మనస్సు సానుభూతితో, సంతోషంతో ఉప్పొంగి, నా అభిప్రాయాలు వారిఅభిప్రాయాలను కలసికొనడానికి ఎదురేగేవి. ఎంతటి ఘనవిజయం సాధింపబడింది!! నామనస్సుకీ, ఇతరులమనస్సులకీ మధ్యఉండే ఊసరక్షేత్రాలు నేడు గులాబిపూలతోటలతో కలకలలాడుతూన్నాయి.

ఆ సంవత్సరం ఆకురాలుకాలాన్ని నేను టస్కంబియాకు పద్నాలుగుమైళ్ళ దూరంలో ఒక కొండమీదవున్న మా వేసవిమకాంలో గడపినాను. ఆ మకాంపేరు "ఫెర్న్ క్వారీ" ఆ ఇంటికి సమీపంలో సున్నపురాతి గనులుండటంచేత దాని

కా పేరువచ్చింది. ఆ కొండకి ఒకభాగంలో గలగల శబ్దం చేస్తూ, పైభాగంలోవున్న రాళ్ళమధ్యనుంచి పడే మూడు జలధారలు, సెలయేళ్ళయి ప్రవహిస్తూన్నాయి. గుబురుగా పెరిగిన తీగలు ఆ సన్నపురాతినీ, అక్కడక్కడ సెలయేళ్ళని కప్పి, ఎంతో మనోహరంగా వున్నాయి. తక్కినకొండ దట్టమైన అడవితో నిండివుంది. సింధూరవృక్షాలు, ఆకుపచ్చని స్థంభాలలా వుండే సతతహరిదవృక్షాలమీద తోరణాల్లా వ్రేలాడే తరురోహిణి మొదలైన లతలు, ముగ్గిన పండ్లతో అడవినంతటినీ సువాసనతో నింపే ఖర్జూరవృక్షాలు, వింతవింత పరిమళాలతో మనస్సుని ఉప్పొంగజేసే రకరకాల అడవి ద్రాక్షతీగల పొదరిండ్లు, ఆ పొదరిండ్లలో మాటిమాటికీ పైకిలేచి ఝుమ్మని శబ్దంచేసే తేనెటీగలు నన్ను ఈ ప్రపంచాన్ని మరచిపోయేలా చేశాయి.

ఆ కొండపైనవుండే మా ఇంటికిచుట్టూ సింధూర వృక్షాలు, దేవదారువృక్షాలు వున్నాయి. ఆ ఇంటిమధ్య ఒక పెద్ద సావిడి, దానికిచుట్టూ చిన్నచిన్నగదులు, ఇంటిచుట్టూ వసారా వున్నాయి. ఈ వసారాలోనే మేము చాలాసేపు ఆడుకుంటూ, చదువుకుంటూ, ఇక్కడే భోజనాలు చేస్తూ గడపేవాళ్ళం. చుట్టూవుండే అడవి చెట్లపరిమళాలతో చక్కని గాలి ఇక్కడికి వీచేది. ఈ ఇంటికి వెనుకభాగంలో పెరటిగుమ్మానికి దగ్గరగావుండే అక్రోటుచెట్టు కొమ్మలు, ఆకులు నా చేతికి తగులుతూ వుండేవి. ఆకురాలుకాలంలో వాటి ఆకులు గాలికి జలజల రాలడం నాకు తెలిసేది.

ఈ ఇంటికి ఎంతోమంది అతిథులు వచ్చేవారు. సాయం

త్రం మంటచుట్టూ గుంపుగా చేరి, కబుర్లుచెప్పుకొంటూ, పేకఆడుతూ, పాడుతూ కాలక్షేపంచేసేవారు. వీరంతా తమ తమ అనుభవాలనీ, వేటలలో తాముచేసిన సాహసకృత్యాలనీ రకరకాలుగా వర్ణించి చెప్పుకొనేవారు. ఈ వర్ణనలు వింటూంటే పెద్దపులులూ, సింహాలు, ఎలుగుబంట్లూ వీరి ధాటికి ఆగలేక పలాయనం చిత్తగిస్తాయని అనుకొనేదాన్ని— "రేపు వేటకి అందరం తిరిగి కలుద్దాం" అని ఒకరినొకరు హెచ్చరించుకుంటూ ఆరాత్రికి సమావేశం చాలించేవారు. మా వసారాలో ఈ వేటగాళ్ళందరూ కుక్కలతోసహా గుర్రుపెడుతూ నిద్రపోయేవారు.

మరునాటిఉదయం కాఫీసువాసనతో, తుపాకుల గల గల ధ్వనితో వేటగాళ్ళ జోళ్ళచప్పుడుతో "ఈ రోజున మనకి వేటలో మంచిమంచి జంతువులెన్నో దొరకాలి!" అనే అభినందనల సందడిలో నిద్ర లేచేదాన్ని. దూరంగా చెట్లకికట్టిన గుర్రాలు బిగ్గరగా సకిలిస్తూ, డెక్కలతో నేలని తొక్కుతూ, వేటకి బయలుదేరడానికి తహతహలాడుతూండేవి. ఇంతలో వేటగాళ్ళు గుర్రాలనెక్కి, కళ్ళాల్ని సవరించి కొరడాలని ఝుళిపిస్తూ, ముందు వేటకుక్కలు దారి తీయగా వేగంగా సాగిపోసాగారు.

ఆ తరువాత మేము మాంసాన్ని ఉడకపెట్టడానికి సన్నాహాలుచేశాం — భూమిలో ఒక పెద్ద కన్నంఅడుగున నిప్పుచేసి, దానిపైన అడ్డంగానూ, నిలువుగాను కర్రలు పరుపబడ్డాయి. వీటికి మాంసాన్ని తిప్పుతూ ఉడకపెడుతూండగా, చుట్టూకూర్చున్న నీగ్రోలు పొడుగుపాటి కొమ్ములతో

ఈగల్ని తోలుతూండేవారు. ఇంకా భోజనాలకి పీటలు వేయకుండానే కమ్మని సువాసనకి నా నోరూరసాగేది !

ఈ హడావిడి జరుగుతూండగా, నురుగులు క్రక్కే చెమటతో, ఆయాసంతో రొప్పుతూన్న వేటకుక్కలతో జట్లు జట్లుగా వేటకివెళ్ళినవారు తిరిగివచ్చారు. — ఒక్క మృగాన్నీ వేటాడి తీసుకురాకుండానే! ప్రతి ఒక్కరూ 'నాదగ్గరగా ఒక లేడివచ్చిందనీ, తీరా గురిపెట్టేసరికి వెంట్రుకవాసిలో తప్పిపోయి పారిపోయిందనీ' ఈవిధంగా అందరూ తలోక విధంగాను వర్ణించుతూ ఆనాడు జంతువు దొరకకపోవడానికి కారణాలు ఏకరువుపెట్టారు ! కాని మేము కాల్చి సిద్ధంచేసిన మాంసంతో విందు ప్రారంభంకాగానే వేటలో కలిగిన ఆశాభంగాన్ని అందరూ మరచిపోయారు !

వేసవికాలంలో నా చిన్నగుర్రం 'బ్లాక్ బ్యూటీ' ఇక్కడే నాతోవుంది. దాని ముఖంమీదవున్న తెల్లనిమచ్చ దగ్గరనుంచి, నిగనిగలాడే దాని శరీరం ఈ పేరుకి అచ్చంగా సరిపోతుంది! గంటలతరబడి నేను ఈ గుర్రంమీద సరదాగా స్వారిచేసేదాన్ని. అప్పుడప్పుడు మిస్. సల్లివాన్ దీనికళ్ళాన్ని వదలేది. అప్పుడు 'బ్లాక్ బ్యూటీ' తన ఇష్టంవచ్చినప్పుడు నడుస్తూ మధ్యమధ్య గడ్డినిమేస్తూ పెళ్ళివారినడకలు నడిచేది.

ఒకొక్కప్పుడు మిస్. సల్లివాన్, నేనూకలసి అడవిలో తిరగడానికి ప్రొద్దుట బయలుదేరేవాళ్ళం. ఒత్తుగా పెరిగిన చెట్లమధ్యా, తీగలమధ్య దారికూడా మరచిపోయేవాళ్ళం. ఆవులు, గుర్రాలు చేసిన సన్నటిదారులుతప్ప వేరే వెడల్ప

యిన దారులు లేకపోవడంచేత, కొన్ని డొంకల్ని చుట్టుతిరిగి వెళ్ళవలసివచ్చేది. ఇంటికి తిరిగి వచ్చేటప్పుడు పొన్నపూలు, కలువపూలు, తంగేడుపూలు కావలసినన్ని తీసుకువచ్చేవాళ్ళం.

ఒక్కొక్కప్పుడు నేను చిన్న చెల్లెమిల్డ్రెడ్‌తోను, తక్కిన పిల్లలతోనూ ఈతపళ్ళు తేవడానికి వెళ్ళేదాన్ని. నేను వీటిని తినక పోయినా వాటి సువాసన నాకిష్టం! బాదంకాయలు, హికోరీ కాయలు, తీయని అక్రోటుకాయలుకొట్టి ఇంటికి తెచ్చేవాళ్ళం.

ఈ కొండప్రక్క నే రైలుమార్గం వుంది. రైళ్ళు కూత పెడుతూ ఈ మార్గంమీాదనుంచి వెళ్ళడం పిల్లలంతాచూసే వాళ్ళు. ఒక్కొక్కప్పుడు చెవులు గింగురుమనే కూతవిని అం దరూ వీధిగుమ్మంలోకి వచ్చి నిల్చునేవారు. దీనికితోడుగా రైలుపట్టాలమీాద ఒక ఆవో, గుర్రమో వుందని మిల్డ్రెడ్ చెప్పగానే నాకు మనస్సు మనస్సులో వుండేదికాదు. మా ఇంటికి ఒక మైలుదూరంలో ఒకపెద్దలోయకిపైగా చిన్న ఇనుప వంతెనపై నుండి ఈ రైలుమార్గంపోతుంది. ఈ వంతెనమీాద నడవడం చాలాకష్టం. ఈపట్టాలక్రిందవుండే దూలాలు దూర దూరంగా, సన్నగా వుండటంచేత దీనిమీాద నడుస్తూంటే కత్తులమీాద నడుస్తూన్నట్లుండేది! అంతకు ముందెప్పుడూ ఈ వంతెనమీాద నేను నడువలేదు. ఒకరోజున నేనూ, మిల్డ్రెడ్, మిస్. సల్లివాన్ అడవిలో తిరిగితిరిగి దారితెలియక ఈవంతెన దగ్గరికి వచ్చాం. అప్పటి కప్పుడే చీకటిపడుతూంది. ఈ వం తెనదాటి వెళితే ఇల్లుచాలాదగ్గర. ఈవంతెనపైన నా కాలి బొటనవ్రేలితో తడుముకుంటూ ముందుకునడవవలసివచ్చింది. మేము వంతెనమధ్యకి వెళ్ళగానే దూరంనుంచి 'గుప్. గుప్'

అనే శబ్దం అయింది. అదిగో రైలు! అని మిల్డ్రెడ్ గట్టిగా అరచింది. ఇంకొక క్షణంలో మామీదనుంచి రైలు వెళ్ళిపోయేదేకాని, తృటిలో ముగ్గురం వంతెనక్రిందిభాగంలో వున్న అడ్డకమ్ములమీదికి తప్పుకున్నాం. రైలు ఇంజను వేడిమి నా ముఖానికి సోకింది! దానిపొగ నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది! రైలు మాపైనుంచి వెళుతూంటే వంతెన కంపిస్తూ ఊగింది. ఏమాత్రం పట్టుసడలినా మేము క్రింది అగాధంలో పడిపోయేవాళ్ళం! ఎంతో కష్టంమీద మా ఇంటికి వెళ్ళేదారిని కనుగొన్నాం. బాగా రాత్రిపడినతరువాత మేము ఇంటికిచేరుకున్నాం. అప్పటికే మా ఇంట్లో అందరూ మమ్మల్ని వెతకడానికి వెళ్ళారు!



# పంద్రెండవ ప్రకరణము

మొదటిసారిగా నేను బోస్టన్ కి వెళ్ళినప్పటినుంచీ ప్రతి సంవత్సరం శీతాకాలాన్ని ఉత్తరదేశంలోనే గడిపాను. ఒక పర్యాయం నేను గడ్డకట్టిన సరస్సులతోను, మంచుతో కప్ప బడిన మైదానాలతోను వున్న 'న్యూ ఇంగ్లండ్' గ్రామానికి వెళ్ళాను. అప్పుడే నేను 'మంచు' విశేషాల్ని తెలిసికోనడా నికి అవకాశం కలిగింది.

శీతాకాలంలో అక్కడ చెట్లన్నీ ఒక్క ఆకుకూడా లేకుండా ఏదో కనపడనిశక్తి వాటి ఆకులన్నిటినీ రాల్చినట్లని పించింది! ఆ చెట్లమీద పక్షులన్నీ ఎక్కడికో ఎగిరిపోయాయి. వాటిగూళ్ళు మంచుతో కప్పబడివున్నాయి. కొమ్మలన్నీ మం చుతో నిండివున్నాయి. పర్వతాలు, మైదానాలు మంచుతో కప్పబడివున్నాయి. చెట్లలోవుండే చైతన్యం వాటి వేళ్ళలో చీకటిలో నిద్రపోతూన్నట్లనిపించింది! సూర్యుడు ప్రకాశిస్తూ న్నా ప్రకృతి చైతన్యరహితంగా వున్నట్లుంది. వాడిపోయిన గడ్డిముక్కలు, తుప్పలు మంచుమహారణ్యంలా వున్నాయి!

వేగంగావీచే చల్లగాలితో ఒకనాడు మంచుతుపాను వచ్చే సూచనలు కనుపించాయి. మేమంతా వీధిలోనికిపరుగెత్తి ఆకాశాన్నుంచి ఎగురుతూ క్రిందికిదిగే మంచురేకుల్ని చేతు

లతో మూట్టుకున్నాం. గంటలతరబడి మంచురేకులు ఈవిధంగా వర్షింపసాగాయి. భూమిమీది మిట్టపల్లాలు ఈ మంచుతో సమమౌతున్నాయి. ఆ రాత్రంతా ఆ విధంగానే మంచుకురిసింది. మర్నాటి ఉదయానికి వీధులన్నీ మంచుతో కప్పబడి గుర్తుపట్టలేనంతగా మారిపోయాయి! ఎత్తైన చెట్ల కొమ్మలు మాత్రం ఈ మంచు గుట్టలపైకి పొడుచుకువచ్చినట్లు కనపడుతున్నాయి.

ఆనాటి సాయంత్రం ఈశాన్యదిశనుంచి వీచే బలమైన గాలికి మంచురేకులు తమ ఇష్టంవచ్చినట్లు ఎగురుతూ చెలరేగాయి. ఇంటిలోపల ఒకపెద్ద మంటచుట్టూకూర్చుని కథలు చెప్పుకుంటూ, పాటలుపాడుకుంటూ బయట చెలరేగేమంచు తుపాను భీభత్సాన్ని మరచిపోయాము. కాని ఆనాటిరాత్రి గాలి మరింతవేగంగా వీచడంతో ఇంటిచుట్టూవున్న చెట్ల కొమ్మలు ఊగుతూ, కిటికీతలుపులకి కొట్టుకోసాగాయి. ఇంటి వాసాలు ఆ వేగానికి తట్టుకోలేక బీటలుతీశాయి. ఏక్షణంలోనైనా ఇంటికప్పు మాపై కూలుతుందేమోననే భయంతో ఆరాత్రి ఏలాగో గడపినాము! ఈ తుపాను ప్రారంభించిన మూడవనాటికి మంచుపడడం ఆగింది. మిట్టపల్లాలు ఏకమై, తెల్లగావున్న మైదానంపైన సూర్యుడు మబ్బుతెరను తప్పించుకొని తీవ్రంగా ప్రకాశిస్తున్నాడు.

గుట్టలుగాపడివున్న మంచుకి మధ్యగా సన్ననిదారులు చేయబడ్డాయి. ఆ దారులగుండా మనుష్యులు తిరుగుతున్నారు. నేను నా పొడుగుకోటు, బుజాన్నికూడా కప్పే తలటోపీ పెట్టుకొని బయటికి బయలుదేరాను. బయట చలిగాలి

ఎముకల్ని కొరుకుతూంది. మనుష్యులు నడవడానికి చేసిన ఈ దారులగుండా కొంతదూరము, చిన్న చిన్న మంచుగుట్టల మీదుగా కొంతదూరము వెళ్ళి, ఒక పచ్చికమైదానానికి వెలుపలవున్న దేవదారు చెట్లతోపు దగ్గరికి చేరాము. కదలిక లేకుండా అక్కడిచెట్లు పాలరాతిమీద అమర్చిన శిలావిగ్రహాల్లా వున్నాయి. దేవదారు వృక్షాల సూదులవంటి ఆకుల నుంచి మామూలుగా వచ్చే సువాసన రావటంలేదు. తెల్లని మంచుతో కప్పబడిన చెట్ల రెమ్మలపైన సూర్యుని కిరణాలుపడి వజ్రాల్లా ధగధగ మెరుస్తూ, వాటిని చేతితో తాకగానే క్రింద రాలిపోతూన్నాయి. కన్నులు మిరుమిట్లుకొల్పే ఆ కాంతి, నాకన్నులను ఆవరించి వున్న అంధకారాన్ని కూడా పటాపంచలు చేసేటట్లుంది!

క్రమంగా ఈ మంచుగుట్టలు హరించిపోతుండగా, ఇంకొక తుపాను వచ్చింది! ఆశీతకాలంలో నాపాదాలు మట్టిని తాకనేలేదు! మధ్యమధ్య చెట్ల కొమ్మలమీదవున్న మంచు పోయి చిగుళ్ళు పైకి తలయెత్తినా, అక్కడి సరస్సుమాత్రం పూర్తిగా మంచుతో కప్పబడివుంది.

ఈ శీతకాలంలో ముఖ్యంగా మేము మంచుమీద జారుతూ ఆడుకొనే ఆటని ఆడుకొంటూ హాయిగాగడిపినాం. అక్కడవున్న సరస్సుఒడ్డున ఉవ్వెత్తుగా లేచిన మంచుగట్టుపైన ఎదుటిభాగంలో వంపుతిరిగిన ఒకరకపు బండిలో కూర్చుండగా వెనుకనుండి ఒక కుర్రవాడు మమ్మల్ని బలంగా ఒకతోపు తోసేవాడు. ఆ వేగానికి మధ్యమధ్యవున్న మంచుగుట్టల్నీ, గోతుల్నీ దాటుతూ ఆసరస్సు ఆవలిఒడ్డుకి చేరుకొనే

వాళ్ళం. సంతోషంతో ఉప్పొంగిపోతూ ఈ ఆటలో మమ్మల్ని మేమే మరచిపోయేవాళ్ళం. మిట్టపల్లాలలో వేగంగా దూసుకుపోయే మాబండి కొన్ని క్షణాలపాటు గాలిలో ఎగిరేటప్పుడు ఈ భూమితో మా సంబంధాలు తెంపుకొని ఆకాశమార్గాన సురకన్యలతో సయ్యాటలాడుతూన్నట్లు ఒక చిత్రానుభూతి కలిగేది!



# పదమూడవ ప్రకరణము

1890వ సంవత్సరపు వసంతకాలంలో నేను మాట్లాడడం నేర్చుకొన్నాను. వినపడే శబ్దాల్ని చేయాలని నాలో ఎప్పుడూ బలమైన కోరికవుండేది. నా చేతులలో ఒకదానిని నా కంఠంమీద రెండవదానిని పెదవులమీదా పెట్టుకొని ఏవో ధ్వనులను చేసేదాన్ని. ఈ నా ప్రయత్నంతో పిల్లి కూసినట్లో, కుక్క అరచినట్లో నా నోటినుండి చప్పుడువస్తే దానికే నాకెంతో సంతోషంగా వుండేది. ఎవరైనా పాటలు పాడుతుంటే వారి కంఠంమీద నా వ్రేళ్ళనుపెట్టడానికిగాని, పియానో వాయిస్తూంటే దానిపైన వ్రేళ్ళనుపెట్టి వినడానికిగాని తహతహలాడేదాన్ని. నాకు చూపు, వినేశక్తి పోకపూర్వం ఎంతో చురుకుగా మాట్లాడటం ప్రారంభించానట! కాని జబ్బుచేసినతరువాత నాలో వినేశక్తి క్రమంగా పోవడంతో, మాట్లాడే శక్తికూడా పోయింది. రోజల్లా మా అమ్మ ఒడిలో కూర్చొని, ఆమె మాట్లాడుతూండగా ఆమెముఖం మీద నా చేతులనుపెట్టి, ఆమె పెదిమలు ఏవిధంగా కదలుతున్నాయో నా పెదిమలనుకూడా అదేవిధంగా కదల్చేదాన్ని — మాట్లాడలేకపోయినా! నేను సహజంగానే నవ్వేదానినని చెప్పేవారు. చాలా సేవటివరకూ ఏవో శబ్దాలు,

అక్షరాలు పలికేదాన్ని — వీటిద్వారా ఎవరితోనో మాట్లాడదామనికాదుకాని, మాట్లాడే అవయవాలకి ఒకవిధమైన వ్యాయామంఇవ్వాలనే ఆకాంక్షని తృప్తిపరచడానికే ఈ విధంగా చేసేదాన్ని — అప్పటికికూడా నేను ఒక్కమాటని మాత్రం మరచిపోలేదు — అదే "వాటర్" అనే మాట. నాకు జబ్బుచేసినతరువాత నీటిని "వా — వా" అనేదాన్ని — క్రమంగా ఈమాటకూడా పలకడం కష్టమైపోయింది. మిస్. సల్లివాన్ నాకు చదువుప్రారంభించగానే ఈ మాటని నా వేళ్ళతో పలకడం నేర్చుకొనగానే, నోటితో 'వా—వా' అనడం మానివేశాను.

నాచుట్టూ వుండే మనుష్యులు ఇతరులతో మాట్లాడే పద్ధతికీ, నేను నా అభిప్రాయాల్ని ఇతరులతో చెప్పే పద్ధతికీ చాలా తేడావుందని నాకు ఎన్నో రోజులుగా తెలుసును. చెవిటిపిల్లలను మాట్లాడేటట్లు చేయవచ్చునని తెలిసికొనక పూర్వమే ఇతరులతో మాట్లాడటానికి నేనుఅవలంబించేపద్ధతి సరియైనదికాదని నాకు తెలుసు. ఈవిధంగా వేళ్ళతో అక్షరాలను కూడపలుకుతూ ఇతరులతో మాట్లాడేవారు తమ మనస్సులోని విషయాలను పూర్తిగా వ్యక్తంచేయలేరనీ, వారిమనస్సుని ఒకవిధమైన 'సంకుచితభావం' పీడిస్తూంటుందనీ, అందుచేత ఈపద్ధతిని ఎంత త్వరగా మానివేస్తే అంత మంచిదనీ నా మనస్సు తహతహలాడింది. నా ఆలోచనలు తటాలున పైకిఎగిరి, వేగంగావీచే గాలికి ఎదురుగా రెక్కలనాడిస్తూ లేచే పక్షులవలె వుండేవి; అయినా, నేను నా పెదిమలనీ, కంఠాన్ని ఉపయోగించడానికి విశ్వప్రయత్నం

చేశాను. ఈ నా ప్రయత్నంలో నేను తీవ్రమైన ఆశాభంగాన్ని పొందుతాననే భయంతో, నా స్నేహితులు నన్ను మరలించడానికి ప్రయత్నించారు. కాని నేను మరింత పట్టుదల వహించాను — ఈ బ్రహ్మాండమైన అవరోధాన్ని ఒకటి సంఘటన పూర్తిగా తొలగించింది — అదే 'రాగ్‌న్‌హిల్డ్ కాటా కథ'.

1890 లో బార్బ్రిడ్జ్‌మన్ ఉపాధ్యాయిని అయిన లామ్సన్ సతి నన్ను చూడడానికి వచ్చింది. అప్పుడే ఆమె నార్వే, స్వీడన్ దేశాలు పర్యటించి వచ్చింది. నార్వేలో 'రాగ్‌న్‌హిల్డ్ కాటా' అనే చెవిటి, గుడ్డిపిల్లకి మాట్లాడటం నేర్పబడినట్లు ఆమె నాతో చెప్పింది. లామ్సన్ సతి ఈసంగతి చెప్పడం పూర్తికాకుండానే ఆపిల్లలాగే నేనుకూడా మాట్లాడటం నేర్చుకుతీరాలనే ఉత్సాహం నాలో పొంగిపొరలింది. చెవిటివారికి విద్య గరపడంలో ప్రవీణురాలైన మిస్. సారా ఫుల్లర్ దగ్గరికి సలహాకోసం మిస్. సల్లివాన్ నన్ను తీసుకువెళ్ళేదాకా ఆమెను నిద్రపోనీయలేదు. మిస్. సారాఫుల్లర్ టెలిఫోన్ కనిపెట్టిన డా॥ గ్రాహంబెల్‌కి చాలా సన్నిహితురాలు. ఆమె హొరేస్‌మాన్ స్కూలుకి ప్రిన్సిపాల్‌గా వుంటూంది. మిస్. సారాఫుల్లర్ సహజంగా దయార్ద్రహృదయ— ఎంతో ప్రేమతో నన్ను దగ్గరికు తీసుకొని నాకు స్వయంగా తానే విద్యనేర్పడానికి 1890 వ సంవత్సరం మార్చి 26 వ తేదీని ప్రారంభించింది. మిస్. ఫుల్లర్ అవలంభించిన పద్ధతి ఇది :

నా చేతిని ఆమె ముఖంపైనుంచి మెల్లగా పోనిచ్చి, ఆవిడ శబ్దంచేసేటప్పుడు ఆమెయొక్క నాలుక, పెదవులు ఏ స్థానంలో వున్నాయో నన్ను అర్థంచేసుకోనిచ్చేది. వాటి

ప్రతికదలికనీ అనుకరించడానికి ఉరుకులు వేసే నా ఉత్సాహం నాకు తోడుకాగా ఒక గంటలో నేను ఎమ్. పి. ఎ. ఎస్.టి.ఐ. (M. P. A. S. T. I.) అనే అక్షరాల్ని పలకడం నేర్చుకున్నాను మిస్. ఫుల్లర్ మొత్తం నాకు పదకొండు పాఠాలు బోధించింది. 'అది వెచ్చగా నున్నది' అనే పూర్తివాక్యాన్ని నేను అనగలిగినప్పుడు నేనుపడ్డ ఆనందానికి మేరలేకపోయింది. పాటని నట్టుతూ నేను పలికినమాట వాస్తవమే; అయినా, అవి మనిషిమాట్లాడే మాటలు! నాలో కలిగిన ఈ నూతనోత్సాహంతో నిద్రాణమైన నాఆత్మ నవోత్తేజాన్ని పొంది విజ్ఞాన పథంలో పురోగమింపసాగింది.

ప్రేమపూరితమైన ఒక్కమాటగాని, పక్షుల కిలకిలారావాలుగాని, సంగీతపు మాధుర్యంగాని లేని నిశ్శబ్దపు కారాగారంలో ఒంటరిగా బంధింపబడిన ఏ చెవిటిపిల్లైనా, తాను ఎప్పుడూ వినివుండని మాటలు తననోటితో మొట్టమొదటి సారిగా మాట్లాడుతూండగా పడే ఆనందం వర్ణనాతీతం! అలాంటి అనుభూతిని పొందగలిగినవారే, మొట్టమొదటిసారిగా నేను నా ఆటబొమ్మలతోను, రాళ్ళతోను, చెట్లతోను, పక్షులతోను, జంతువులతోను మాట్లాడినప్పుడు, మా చెల్లెలు మిల్డ్రెడ్, నా పెంపుడుకుక్కలు నేనుచెప్పినట్లు చేసినప్పుడు నేను పొందిన ఆనందం అర్థంచేసుకోగలుగుతారు! ఇంకొకరి సహాయంలేకుండా నేనుమాట్లాడుతూండగా, ఆమాటలు రెక్కలు కట్టుకొని ఎదుటివారిదగ్గరికి చేరడం నాకొక మహావరప్రసాదం అనిపించింది! ఆవిధంగా నేను మాట్లాడుతూండగా ఎన్నో మధురస్మృతులు నామాటలద్వారా వెలువడేవి. ఈమాటలే

నాకు రాకపోతే అవి నా వ్రేళ్ళద్వారా వ్యర్థంగా జారి పోయేవి!

కాని ఈ స్వల్పకాలంలో నేను మాట్లాడటం నేర్చు కొన్నానని అనుకొనడం పొరపాటు. మాట్లాడటంలోని ప్రాథమిక సూత్రాలనుమాత్రమే అప్పటికి నేర్చుకోగలిగాను. మిస్. ఫుల్లర్, మిస్. సల్లి వాన్ నన్ను పూర్తిగా అర్థంచేసుకోగలిగినా, తక్కినవారు నేను మాట్లాడేదానిలో బహుశా నూటికి ఒక్క మాటనిమాత్రమే అర్థంచేసుకోగలిగేవారు! ఈ ప్రాథమిక సూత్రాలను నేర్చుకొనగానే, తక్కినదంతా నాఅంతట నేనే నేర్చుకొన్నాననుకొనడం పొరపాటే. మిస్. సల్లి వాన్ యొక్క మేధాశక్తి, ఓరిమి, కార్యదీక్ష, పట్టుదల నాకు తోడుకాక పోతే సహజంగా మాట్లాడటానికి నా ప్రయత్నం కొనసాగేది కాదు! నాకు సన్నిహితులైన స్నేహితులు నన్ను అర్థంచేసి కొనడానికే నేను రాత్రింబవళ్ళు విరామం లేకుండా సాధకం చేశాను. ప్రతిమాటనీ సరియైన పద్ధతిలో ఉచ్చరించడానికి వాటినన్నిటినీ కలిపి అనేకవిధాలుగా మాట్లాడటానికి ఎప్పుడూ మిస్. సల్లివాన్ నా ప్రక్కనేవుండి చెప్పవలసివచ్చేది. ఈ నాటికికూడా నేను సరిగా ఉచ్చారణ చేయనిమాటలను మిస్. సల్లి వాన్ సరిచేసి చెప్తూంటుంది.

చెవిటివారికి చదువుచెప్పే ఉపాధ్యాయులందరూ ఈ క్లిష్టసమస్యల్ని నేను ఎదుర్కొనేపద్ధతిని అర్థంచేసికోగలుగు తారు. నా ఉపాధ్యాయిని పెదిమలకదలికను తెలిసికొనడంలో నేను నా వ్రేళ్ళమీదనే పూర్తిగా ఆధారపడవలసివచ్చింది. ఆమెకంఠపు చలనాన్నీ, నోటి కదలికనీ, ముఖకవళికలనీ

నేను నా స్పర్శజ్ఞానంవల్లనే తెలిసికొనవలసి వచ్చేది. కాని ఈవిధంగా స్పర్శమీద ఆధారపడడంలో చాలాసార్లు పొర పాటులు జరిగేవి. అలాంటప్పుడు ఆ మాటలుగాని, వాక్యాలు గాని సరియైన నాదంతో నేను అనగలిగేవరకూ గంటలతరబడి సాధకంచేయవలసి వచ్చేది. ఎంతసేపూ సాధకం, సాధకం, సాధకం! — నిరుత్సాహం అసలు నన్ను ఒక్కొక్కప్పుడు వెనుకకు లాగేది కాని మరుక్షణంలోనే 'విజయం సాధించి తీరాలనే' పట్టుదల నాకు మరింత బలాన్నీ, ఉత్సాహాన్నీ ఇచ్చి ముందుకు నడిపించుకుపోయేది. నేనుసాధించిన ఘన విజయంతో మావాళ్ళని సంతోషంలో ముంచితేల్చాలనే ఆకాంక్ష నా పట్టుదలకి మరింత తోడైంది.

ఈ అడ్డంకులన్నిటికంటె "నా చిన్నచెల్లెలు ఇప్పుడు నన్నర్థంచేసుకుంటుంది" అనే ఆలోచన నాకు కావలసినంత ఉత్సాహాన్నీ, బలాన్నీ ఇచ్చింది.

"నే నిప్పుడు మూగదానిని కాదు" అనే వాక్యాన్ని పట్టలేనంత ఆనందంతో ఎన్నోసార్లు సాధకంచేశాను. నేను మా అమ్మతో మాట్లాడినప్పుడు ఆమె ఏ సమాధానం చెప్తుందో, ఆమె పెదిమలను ముట్టుకొని తెలిసికొనాలనే ఉత్సాహం నాలో ముప్పిరిగొనే ఆ సమయంలో నాకు నిరాశఎక్కడిది? వ్రేళ్ళతో ప్రతిఅక్షరం వ్రాస్తూ అభిప్రాయా లను వ్యక్తంచేయడంకంటె, నోటితో మాట్లాడటం ఎంత సుల భమో నేను గ్రహించినతరువాత ఆ పద్ధతినివదలి నోటితోనే మాట్లాడేదాన్ని. కాని మిస్. సల్లివాన్, మరికొందరు స్నేహి

తులుమాత్రం పెదిమలను తడుముతూ తెలిసికొనడం కష్టమని నా చేతిలో వ్రేళ్ళతో వ్రాయడం ద్వారానే నాతో మాట్లాడేవారు.

మేముఉపయోగించే 'హస్తాక్షరమాల' పద్ధతి తెలియనివారికి దానినిగురించి ఇక్కడ కొంచెం విపులంగా చెప్పడం మంచిదేమో! నాతో మాట్లాడేవారుగాని, చదివేవారుగాని చెవిటివారు సాధారణంగాఉపయోగించే హస్తాక్షరమాల' ద్వారా, ఒకేచేతితో వ్రాస్తారు. ఆవిధంగా మాట్లాడేవారి చేతిమీద నా చేతిని మెల్లగా, వారువ్రాసే చేతికదలికను అడ్డంరాకుండా వుంచుతాను. ఆ చేతియొక్క 'స్థితి'ని ఈ విధంగా చేతితో తాకడంద్వారా చూచేటప్పుడు ఎంత సులువుగా కనిపెట్టగలమో అంతసులువుగా కనిపెట్టవచ్చును. అలవాటుప్రకారం మనం చదివేటప్పుడు ప్రతి అక్షరాన్ని విడివిడిగా చదువనక్కరలేకుండగనే మాటలనీ, వాక్యాలనీ వేగంగా ఏవిధంగా చదువుతామో ఆదేవిధంగా ఈ స్పర్శ ద్వారాకూడా చదువవచ్చును. నిరంతర సాధకంవల్ల చేతి వ్రేళ్ళు అతి చురుకుగా ఈవిధంగా చదువడాన్ని అలవాటు చేసుకుంటాయి. నా స్నేహితులలో కొందరు, 'టైప్‌రైటింగ్' లో నిపుణుడు ఎంత వేగంగా టైపుచేయగలరో అంతవేగంగా ఈ అక్షరాలను వ్రాయగలరు! మనం మామూలుగా వ్రాసేటప్పుడు అనుభవంవల్ల ప్రతి అక్షరాన్నీ కూడబలుకుకో నక్కరలేకుండా వేగంగా ఏవిధంగా వ్రాస్తామో, ఆదేవిధంగా ఈ 'హస్తాక్షరమాల' కూడా అలవడుతుంది.

నాఅంతటనేను మాట్లాడటం నేర్చుకొనగానే ఇంటికి తక్షణం వెళ్ళాలనే తొందర నాలోఎక్కువైంది. ఆఖరికి ఆశుభ సమయం ఆసన్నమైంది. నేను ప్రయాణం చేస్తూన్నంతసేపూ మిస్. సల్లివాన్‌తో విధీ, విరామంలేకుండా ఏదో మాట్లాడుతూనే ఉన్నాను. ఊరికే ఉబుసుపోతకికాదు కాని, చివరిక్షణం వరకూ సాధకంచేయడంవల్ల నేను మాట్లాడేదానిలో తప్పులు లేకుండా చేసికొనడానికే ఈ ప్రయత్నం! ఇంతలో నాకు తెలియకుండగానే మా రైలుబండి 'టస్కంబియా' స్టేషన్‌కి వచ్చి చేరింది. అక్కడ మా కుటుంబమంతా నాకోసం వేచి వున్నారు — మా అమ్మ నన్ను దగ్గరగా తీసికొని, నేను మాట్లాడే ప్రతిఅక్షరాన్నీ సంతోషంతో నోటమాటలేకుండా వణుకుతూన్న చేతులతో ఏవిధంగా విన్నదీ, మా చిన్నచెల్లెలు నా రెండవచేతిని పట్టుకొని ముద్దుపెట్టుకుంటూ సంతోషంతో ఏవిధంగా గంతులువేసినదీ, దూరంగావున్న మా తండ్రి ఇదంతాచూస్తూ సగర్వంగా వికాసంగా ఏవిధంగా నిల్చున్నదీ తలచుకొంటే ఇప్పటికీ నాకు కళ్ళనుండి నీళ్ళువస్తాయి!



# పదునాల్గవ ప్రకరణము

1892వ సంవత్సరం శీతకాలంలో జరిగిన ఒక సంఘటన నా బాల్యపు నిర్మలాకాశంలో తుఫానులా చెలరేగింది. సంతోషం అన్నది నాకు దూరమైంది. నెలలతరబడి అనుమానంతో, భయంతో, ఆదుర్దాతో కాలంగడిపాను. అంతవరకూ నాకు ఎంతో సన్నిహితంగావుండే పుస్తకాలంటే నాకు అసహ్యంపుట్టింది. దీనిఅంతకీ కారణం పెర్కిన్స్ ఇన్స్టిట్యూషన్‌కి డైరెక్టరుగావున్న మిస్టర్. అనాగ్నస్‌కి నేనుపంపిన "ది ఫ్రాస్ట్‌కింగ్" అనే కథే కారణం. ఈ కథకుసంబంధించిన పూర్తి వివరాలు నాకు సన్నిహితురాలుగా వున్న మిస్. సల్లివాన్‌పైన, నాపైన పడిన అపవాదు తొలగేటట్లు, పాఠకుల నిర్ణయానికి ఈ క్రింద పొందుపరచడం నా కనీసధర్మంగా భావిస్తున్నాను.

నేను మాట్లాడటం నేర్చుకొన్న సంవత్సరపు ఆకురాలు కాలంలో ఈ కథని నేను వ్రాశాను. ఆ సంవత్సరం మామూలుకంటె ఎక్కువరోజులు వేసవిమకామైన 'ఫెర్న్ క్వారీ'లో వున్నాం. మిస్. సల్లివాన్ ఆరోజులలో విడిచే రకరకాల పూలనిగురించీ, చెట్లనిగురించి వర్ణించి చెప్పింది. ఈ వర్ణన వింటూంటే ఏనాడో నాకు చదివి వినిపించిన ఒక

కథ నాకు జ్ఞాపకం వచ్చింది నాకు తెలియకుండానే! నే నేదో 'కథ అల్లు'తూన్నట్లనిపించింది. నా మనస్సులో వుండే ఆలోచనలు తెగిపోకుండా ఒక కథరూపంలో పెట్టడానికి తక్షణం నా '(బ్రెయిలీ పలక' మీద వ్రాయడానికి కూర్చున్నాను. వర్ణనలు, ఆలోచనలు వాటంతట అవే నా వేళ్ళచివరినుంచి ఏకధారగా ప్రవహిస్తూన్నాయి. నా ప్రయత్నంలేకుండగానే వర్ణనలు, ఆలోచనలు వాటంతట అవే వస్తున్నాయంటే అవి నా స్వంతంవికావనీ, ఇక్కడొక సంఘటన, అక్కడొక వర్ణన చదివి జ్ఞాపకంవుంచుకొన్నవనీ వేరే చెప్పనక్కరలేదు. ఆ రోజులలో నేను చదివినదల్లా, అది వ్రాసినదెవరో జ్ఞాపకం వుంచుకోకుండా మనస్సుకి పట్టించుకొనేదాన్ని. ఇప్పటికీ నా స్వంతభావాలకీ, నేను పుస్తకాలలో చదివినవాటికీ తేడా విభజించి స్పష్టంగా చెప్పడం కష్టమే. అనేక విషయాలు నేను ఇంకొకరి కన్నుల, చెవుల ద్వారా నేర్చుకొనడమే దీనికి కారణమని నా అభిప్రాయం.

ఆ కథ పూర్తికాగానే దానిని నా ఉపాధ్యాయినికి చదివి వినిపించాను. ఆ కథలోని మనోహరమైన వర్ణనలు చదువుతూంటే నేనుపొందిన ఆనందం వర్ణనాతీతం. ఏదైనా ఒకవాక్యం తప్పువ్రాసిన దానిని మిస్. సల్లివాన్ సరిదిద్ద డానికి మధ్యలో నన్నాపినప్పుడు నే నెంతో చిరాకుపడేదాన్ని! భోజనాలసమయంలో ఈ కథని మా కుటుంబంలో అందరూ విన్నారు. నే నింతచక్కగా కథవ్రాయడంచూసి, అందరూ ఆశ్చర్యపోయారు. కొందరు "దీనిని ఏ పుస్తకంలోనైనా చదివినావా?" అని అడిగారు.

ఈప్రశ్నమాత్రం నన్ను ఆశ్చర్యచకితురాల్ని చేసింది! దీనిని ఎప్పుడైనా చదివినట్లు ఎక్కడా నాకు జ్ఞాపకంలేదు. నేను లేచి "నే నెక్కడా చదువలేదు అది నా కథే. మిస్టర్. అనాగ్నస్ కి పంపించడానికి వ్రాశాను" అని చెప్పాను.

ఆ తరువాత ఈ కథ కాపీనితీసి, అంతకుముందువుంది 'ఆటమ్ లీవ్స్' (Autumn Leaves) అనే పేరుమార్చి, 'ది ఫ్రాస్ట్ కింగ్' (The Frost King) అనేపేరు పెట్టి మిస్టర్ అనాగ్నస్ పుట్టినరోజుపండుగకి పంపించాను. ఆకాశమార్గాన ప్రయాణం చేస్తూన్నట్లు ఎంతో ఉల్లాసంగా పోస్టాఫీసుకినడచి వెళ్ళి, ఆ కథని పోస్టుచేశాను. కాని, ఈ పుట్టినరోజు బహుమానానికి, ఆ తరువాత ఎంతగానో విచారించవలసివస్తుందని అప్పుడు నాకు తెలియలేదు!

మిస్టర్ అనాగ్నస్ 'ది ఫ్రాస్ట్ కింగ్' కథ చాలాబాగుందని మెచ్చుకొని పెర్కిన్స్ ఇన్స్టిట్యూషన్ నుంచి వెలువడే సంచికలో ప్రకటించారు. దీనితో ఒక్కసారిగా నాసంతోషం ఆట్టేకాలం వుండలేదు. ఒక్కసారిగా అంత ఎత్తునుండీ పాతాళానికి క్రుంగిపోయాను. నేను బోస్టన్లో వుండగా 'ది ఫ్రాస్ట్ కింగ్' కథవంటిదే 'ది ఫ్రాస్ట్ ఫెయిరీస్' అనే మార్గరెట్ టి కాన్బీ వ్రాసిన కథ, నేను పుట్టకపూర్వమే 'బర్డ్ అండ్ హిజ్ ఫ్రెండ్స్' అనే పుస్తకంలో ప్రచురింపబడినట్లు తెలిసింది. ఈ రెండు కథలూ భాషలోనూ, భావంలోనూ ఎంతసన్నిహితంగా వున్నాయంటే— మిస్. కాన్బీ వ్రాసిన కథని నాకు చదివి వినిపించినట్లూ, దీనిని నేను విని 'గ్రంథ చౌర్యం' చేసినట్లూ తేలింది. మొట్టమొదట నా కీ విషయం తెలియజేయడం

చాలాకష్టమైంది. ఆఖరికి నే నా విషయం అర్థంచేసుకొని విస్తు పోయాను; ఎంతో బాధపడ్డాను. ఏ బిడ్డా చిన్నతనంలో నేను పొందిన ఆశాభంగం పొందివుండదు. అంతులేని దుఃఖం, ఆవేదన నన్నావహించాయి. నన్ను నేనే సిగ్గులపాలు చేసుకున్నాను. నేను ఎంతగానో ప్రేమించినవాళ్ళు, నన్ను అనుమానించసాగారు! 'ది ఫ్రాస్ట్ కింగ్' వ్రాయడానికి ముందు దీనికి సంబంధించినవి ఏయే పుస్తకాలు నేను చదివానా అని ఆలోచనతో తల బ్రద్దలుకొట్టుకున్నాను. జాక్ ఫ్రాస్ట్ పేరు వినడం, 'ది ఫ్రీక్స్ ఆఫ్ ది ఫ్రాస్ట్' అనే పద్యం చదవడంతప్ప ఇంకేదీనాకు జ్ఞాపకంలేదు. నేను వ్రాసిపకథలో వీటినిఎక్కడా ఉపయోగించలేదని గట్టిగా చెప్పగలను.

ఈ విషయంలో మిస్టర్. అనాగ్నస్ చాలాబాధపడ్డట్లు కనుపించినా, నా యెడల ఎంతో వాత్సల్యంతో, ప్రేమతో ఉండటంవల్ల, నా విచారం క్రమంగా దూరమైపోయింది. వాషింగ్టన్ పుట్టినరోజు ఉత్సవానికి గ్రుడ్డిపిల్లలందరూ ఒక నాటకం వేయడానికి నిశ్చయించాము. ఆ నాటకంలో నేను 'పంటలలక్ష్మి' వేషంవేశాను. ఈ సమయంలో మిస్టర్. అనాగ్నస్ని సంతోషపెట్టడానికి నేను ఎంతోచక్కగా ముస్తాబు చేసుకొని సంతోషంగా వుండటానికి ప్రయత్నించాను— ఈ నాటకంలో నాకు కట్టినబట్టలూ, నా కిరీటంలోపెట్టిన మెరిసే రకరకాల ఆకులు, నాకాలిదగ్గరవున్న ధాన్యపురాసులు, నా చేతులలోని పండ్లు నాకు బాగా జ్ఞాపకం వున్నాయి. ఈ సంతోష సమయంలో కూడా నా మనస్సులో విచారమేఘాలు బాగా అలుముకొన్నాయి.

ఈ ఉత్సవానికి ముందునాటి రాత్రి 'పెర్కిన్స్ ఇన్స్టిట్యూషన్'లో పనిచేస్తూన్న ఒక ఉపాధ్యాయిని "ది ఫ్రాస్ట్ కింగ్" కథకిసంబంధించిన ఒక ప్రశ్న వేసింది. మిస్. సల్లివాన్ నాకు జాక్‌ఫ్రాస్ట్ రచనలనిగూర్చి అంతకుముందు చెప్పినట్లు ఆమెతో అన్నాను. మా ఇద్దరిమధ్యా జరిగిన సంభాషణలో నేనేదో 'నా తప్పు' ఒప్పుకొన్నట్లూ, మిస్. కాన్బీవ్రాసిన "ది ఫ్రాస్ట్ ఫెయిరీస్" కథని నేను చదివినట్లూ అర్థంతీసి, నే నెంత కాదని చెప్పినా తన 'అభిప్రాయాన్ని' మిస్టర్. అనాగ్నస్‌తో చెప్పింది.

అంతవరకూ నన్నెంతగానో ప్రేమించే మిస్టర్.అనాగ్నస్ నేనూ, మిస్. సల్లివాన్ కలసి, ఎవరో వ్రాసిన కథని బుద్ధిపూర్వకంగాదొంగిలించి,తనమెప్పుపొందాలని ఈవిధంగాచేసినట్లు తన నిర్ణయానికివచ్చి నన్నెంతో హీనంగాచూడసాగాడు. పెర్కిన్స్ ఇన్స్టిట్యూషన్‌కిచెందిన అధికారులతోను, ఉపాధ్యాయులతోనుకూడిన ఒక సంఘంముందు నన్ను విచారణకి పిలిచారు. మిస్. సల్లివాన్ నాప్రక్కనఉండటానికి అనుమతింపబడలేదు. ఆ న్యాయమూర్తులు నన్ను ప్రశ్నలు, ఎదురుప్రశ్నలు ఎన్నో వేశారు. ఏవిధంగానైనా నా "ది ఫ్రాస్ట్ ఫెయిరీస్" కథని నేను చదివినట్లు ఒప్పించడానికి వారంతా ప్రయత్నిస్తూన్నట్లు నా కనిపించింది. నా చుట్టూ వున్నవాళ్ళంతా నన్ను అనుమానిస్తూన్నట్లు, అంతకుముందు నన్ను ప్రేమించినవ్యక్తికూడా నన్ను అసహ్యించుకొంటూన్నట్లు నాకనిపించింది. నాగుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. నోటమాట రావటంలేదు. ఎంతో ప్రయత్నంమీద ఇక్కడొకమాట, అక్కడొకఅక్షరం నా

నోటినుండి వెలువడుతున్నాయి. బుద్ధిపూర్వకంగా నేనుచేసిన తప్పేమీలేదనీ నాఅంతరాత్మ నాకు చెప్తూన్నా నన్నావహించిన విచారభావాన్నిమాత్రం తగ్గించలేకపోతుంది. ఆఖరికి నేనా స్థలాన్ని విడచివెళ్ళిపోయేసమయంలో నాశరీరం నావశంలో లేదు — మిస్. సల్లివాన్ ధైర్యవచనాలు, ఇంతధైర్యంగా పరీక్షకు నిలువగలిగినందులకు తమ కెంతో గర్వంగా వున్నదనే మా స్నేహితుల అభినందనలు నాకు వినపడ నేలేదు.

ఆనాటి రాత్రి నేను వెక్కి-వెక్కి ఏడ్చాను. నాపిల్లలు బహుశా ఈ విధంగా ఏడ్చివుండరు. నా శరీరంలో ఒకవిధమైన చలి ప్రవేశించి నన్ను వణికించివేసింది. తెల్లవారేలోపులో చనిపోతే బాగుండుననిపించింది! కాని ఆతరువాత "మరపు" అనే దివ్యశక్తి నాలోప్రవేశించి, నన్నులాలించి నిద్రపుచ్చింది. ఈ సంఘటన నేను పెరిగి పెద్దదాననయినతరువాత జరిగివుంటే బహూశా నా ఆశలన్నిటినీ భగ్నంచేసి నాజీవితాన్నే నాశనం చేసి వుండేది.

మిస్. సల్లివాన్ 'ది ఫ్రాస్ట్ ఫెయిరీస్' అనే కథను గురించిగాని, ఆ కథప్రచురింపబడిన పుస్తకాన్ని గురించిగాని ఎన్నడూ వినలేదు. మిస్. సల్లివాన్, డాక్టరు అలెగ్జాండర్ గ్రాహం బెల్ సహాయంతో ఈ విషయాన్ని గురించి సాకల్యంగా చర్చించింది. 1888 వ సంవత్సరం వేసవిలో మేము మిసెస్. సోఫియాని, హాప్‌కిన్స్‌తో గడపడానికి బ్రూస్టర్ వెళ్ళినప్పుడు మిస్. కేన్బీ వ్రాసిన 'బర్డ్ అండ్ హిజ్ ఫ్రెండ్స్' ఆమెదగ్గర వుండేది. మిస్. సల్లివాన్ సెలవులకి ఇంటికివెళ్ళినప్పుడు మిసెస్. సోఫియా నాకు ఎన్నో చదివి వినిపించడానికి

ఆ పుస్తకంకోసం వెతికింది కాని కనుపించలేదు. అనేక పుస్త కాలనుంచి ఎన్నో నాకు చదివి వినిపించింది కాని 'ది ఫ్రాస్ట్ ఫెయిరీస్' కథ చదివి వినిపించినట్లు నాలాగే ఆమెకుకూడా జ్ఞాపకంలేదు!

'బర్డ్ అండ్ హిజ్ ఫ్రెండ్స్' పుస్తకం వీటిలో ఒకటై వుంటుందని ఆమె అన్నది. ఈ పుస్తకం అంతక్రితమే అమ్మి వేసిన పాతపుస్తకాలతోపాటు వెళ్ళిపోయివుంటుందని మిసెస్. సోఫియా చెప్పింది.

అప్పుడు ఈకథలఅర్థం నాకేమీ తెలియదు. ఏ యితర వినోదాలూ తెలియనినాకు కనుపించిన మాటలన్నిటినీ వల్లె వేయడం ఒక వినోదంగా వుండేది. నా ఉపాధ్యాయిని మిస్. సల్లివాన్ తిరిగి రాగానే వీటినిగురించి వివరించి చెప్తుందనే ఉద్దేశంతో ఈ విధంగా ఎన్నో మాటల్ని వల్లెవేశాను. ఒకటిటి మాత్రం నిశ్చయం. నేను చదివినవాటిలోని మనోహరమైన శైలి శాశ్వతంగా నా హృదయఫలకంమీద నాకు తెలియ కుండానే నిలచిపోయింది!

మిస్. సల్లివాన్ తిరిగి వచ్చినప్పుడు నేను 'ది ఫ్రాస్ట్ కింగ్' మాటే తిరిగి ఎత్తలేదు. దీనికి కారణం ఆమె రాగానే 'లిటిల్ లార్డు ఫాంటిల్ రాయ్' అనే పుస్తకాన్ని ప్రారంభిం చడమే. ఈ కథలోమునిగి నేను తక్కినదంతామరచిపోయాను! కాని, మిస్. కాన్బీ వ్రాసిన కథని ఒకసారి వినడం, తరువాత చాలకాలంవరకూ దానిని మరచిపోవడం, ఆ తరువాత ఈ అభిప్రాయాలు ఇంకొకరివనైనా తోచకుండా అప్రయత్నంగా ఒక కథరూపంగా వెలువడడం చాలావిచారించదగిన విషయం.

ఈ క్లిష్టపరిస్థితిలో నేను బాధపడుతూండగా ప్రేమతో సానుభూతితో నాకు అనేకమంది స్నేహితులు ఉత్తరాలు వ్రాశారు. నేను ప్రేమించిన స్నేహితులందరిలో ఒక్కరుతప్ప తక్కిన అందరిని ఈనాటివరకూ నాకు స్నేహితులుగానే వుండి పోయారు!— "ఏనాడో ఒకనాడు నీవుకూడా నీ స్వంతభావాలతో గొప్ప కథనివ్రాస్తావు"అని ఎంతోదయతో మిస్. కాన్బీ కూడా నాకు ఉత్తరం వ్రాసింది. కాని ఈమెచెప్పినట్లు నెరవేరనేలేదు — ఆనాటినుంచీ ఎన్నడూ నేను మాటలతో చెలగాటం ఆడలేదు! ఆఖరికి సరదాకైనా! నేను వ్రాసేది నిజంగా నాది కాదేమోననే భయం నన్ను వెంటాడుతూనేవుంది. మా అమ్మకి ఉత్తరం వ్రాసినప్పుడుకూడా పొరపాటున ఏ పుస్తకంలో చదివినవో దీనిలో వ్రాస్తూన్నానేమోననే భయంతో, అటువంటి పొరపాటు జరుగకుండా ప్రతివాక్యం మళ్ళీ మళ్ళీ చదివేదాన్ని! ఆ సమయంలో మిస్. సల్లివాన్ నాకు ధైర్యం ఇచ్చివుండకపోతే వ్రాయాలనే ప్రయత్నమే పూర్తిగా విరమించుకొనేదాన్ని!

ఈసంఘటనతరువాత 'ది ఫ్రాస్ట్ ఫెయిరీస్' కథని చదివాను. అదికాక మిస్. కాన్బీ భావాలనువాడిన ఉత్తరాలు కూడా చదివాను. అందులో 1891వ సంవత్సరం సెప్టెంబర్ 29వ తేదీన మిస్టర్. అనాగ్నస్ కి నేనువ్రాసిన ఉత్తరంలో మిస్. కాన్బీపుస్తకంలో వ్రాసినమాటలూ, వాక్యాలూ వాడినాను. అదేసమయంలో నేనువ్రాసిన 'ది ఫ్రాస్ట్ కింగ్' లోనూ, ఇతర ఉత్తరాలలోను ఈ వాక్యాలే దొర్లినాయంటే ఆ కథలోవుండే వాక్యాలు నా మనస్సుకి ఎంత బాగా పట్టి

పోయాయో విశదమౌతుంది — ఆకురాలే కాలంలోని బంగారు వర్ణపు ఆకుల్ని వర్ణిస్తూ "అవును నానాటికి ముదిరే ఈ ఎండలనుండి అందమైన ఈ ఆకులు మనస్సుకి ఎంత హాయి నిస్తూన్నాయి!" అని మిస్. సల్లివాన్ చెప్పినట్లు నాకు జ్ఞాపకంవున్నది. మిస్. కాన్బీకథలో వర్ణనే! నా మనస్సుకి ఆహ్లాదకరమైనవాటిని జ్ఞాపకంవుంచుకొని, ఆ భావాలనే నా ఉత్తరాలలోను, వ్రాయడానికి నేనుచేసిన తొలిప్రయత్నం లోను వ్యక్తంచేయడం జరిగింది. గ్రీస్, ఇటలీదేశాల ప్రాచీన నగరాలను వర్ణిస్తూ వ్రాసిన ఒకవ్యాసంలో నేనుపెట్టిన వర్ణన లన్నీ — అవి ఎక్కడనుంచి గ్రహించినవో తెలియకుండా చేసినవే! మిస్టర్. అనాగ్నస్‌కి ప్రాచీన వైభవమన్నా, ఇటలీ, గ్రీస్ దేశాలనుగురించిన మనోహర వర్ణనలన్నా ఎంతో ఇష్టం. అందుచేత ఆయనను సంతోషపెట్టడానికి ఎన్నో పుస్తకాలలోని వీటి వర్ణనలను సేకరించి వ్రాశాను. మిస్టర్. అనాగ్నస్ నేనువ్రాసిన ఈ నగరవర్ణనను చదివి "ఈ భావాల్లో కవిత్వం కదంతొక్కుతూంది" అన్నారు. పదకొండుసంవత్సరాల వయస్సుగల ఒక చెవిటి, గ్రుడ్డిపిల్ల ఈ వర్ణన చేయగలిగిందని ఆయన ఏవిధంగా అనుకున్నారో నాకు తెలియదు! ఈ భావాలు ఇంకొకరివద్దనుంచి గ్రహించినంతమాత్రాన, నా వ్యాసంలో పసలేదని అనుకోవడం పొరపాటు. రమణీయమైన కవిత్వాన్ని నేను అర్థం చేసికొని, ప్రశంసించి, ఆ భావాలను అందరికి బోధపడే సజీవమైన భాషలో నేను వ్యక్తంచేయగలననే విషయం తెల్లమౌతూంది.

నేను మొట్టమొదట వ్రాసినది నా మనస్సుతో కుస్తీ పట్టి ఒకవాక్యం తరువాత ఒకవాక్యాన్ని అల్లినవే! నామనస్సు లోని భావాలను మాటలలో పెట్టడానికి అందరిపిల్లలవలెనే నేనుకూడా వల్లెవేయడం అనుకరించడంద్వారానే ప్రయత్నించాను. నేను చదివిన పుస్తకాలలో మనోహరమైన వర్ణన లన్నిటినీ అప్రయత్నంగానో, ప్రయత్నపూర్వకంగానో జ్ఞాపకంవుంచుకొని, తరువాత వాటిని ఉపయోగించాను. స్టీవెన్సన్ చెప్పినట్లు 'యువ రచయితలు స్తుతిపాత్రమైన కవిత్వాన్ని అనుకరించి, క్రమంగా దీనిని అనేక మార్పులుచేస్తారు'' ఈవిధమైన నిరంతర సాధనవల్లనే మహారచయితల కలాల నుండి తమ భావాలను వ్యక్తంచేయడానికి మాటలు పుంఖానుపుంఖాలుగా వెలువడుతాయి!

కాని నాకీ పద్ధతి ఇంకా అలవడలేదనే అనుకుంటాను. నేను పుస్తకాలలో చదివినదే నా మనోభావాలకి మూలమవడంచేత, నా స్వంతభావాలనీ, చదివి నేర్చుకొన్న భావాలనీ వేరుచేసిచెప్పడం కష్టమే. అందుచేతనే నేనువ్రాసింది నేను మొట్టమొదట సూదితోకుట్టడం నేర్చుకొన్నప్పుడు వేసిన 'అతుకుల'లా వుంటుంది — పట్టుగుడ్డల్నీ, ముఖమల్ గుడ్డల్నీ చేర్చి అతుకులుకుట్టినప్పుడు అన్నిటికంటె ముతకగా వుండే భాగమే బయటపడేది! — ఆవిధంగానే నేనువ్రాసిన దానిలో నా అనాగరిక భావాలు, నేనుచదివిన మహాకవుల భావాలు కలసివుండేవి. మనలోకలిగే సగంఉద్దేశాలనీ, సగం భావాలనీ సమగ్రమైనభాషలో సమకూర్చడమే వ్రాయడంలోవున్న పెద్ద చిక్కుగా నాకు తోస్తుంది. వ్రాయడానికి

ప్రయత్నించడం ఒక చిక్కు సమస్యని పరిష్కరించడంవంటిది. మన మనస్సులోవుండే భావాల్ని మాటలలో పెట్టడానికి ప్రయత్నిస్తాం. ఆ భావాలకి తగిన మాటలు దొరకవు; ఒక వేళ దొరకినా వాటికి సయ్యో కుదరదు. కాని ఇంతటితో మనం నిస్పృహ చెందము. నిరంతరం ప్రయత్నిస్తూనే వుంటాం. ఈ ప్రయత్నంలో విజయాన్ని సాధించినవారున్నారని మనకి తెలుసు. అపజయాన్ని మనజీవితంలో ఎన్నడూ ఒప్పుకోన కూడదు.

'స్వతస్సిద్ధమైన కవిత పుట్టుకతోనే అలవడాలి కాని, వేరేమార్గం లేదు" అన్నాడు స్టీవెన్సన్; ఆ ప్రతిభ నాకు లేకపోయినా, స్వంతఅభిప్రాయాలతో ఏదో ఒక నాడు వ్రాయాలనే ఆకాంక్ష నాకు వున్నది. ఈ నా ప్రయత్నంలో ఎరువు తెచ్చుకొన్న అభిప్రాయాలు అడుగునపడక తప్పదని నా నమ్మకం! అవిరళమైన ఈ నా కృషికి 'ది ఫ్రాస్ట్ కింగ్' చీకటి అధ్యాయం అడ్డురాదనే నమ్ముతూన్నాను.

విచారకరమైన ఈ సంఘటన వ్రాతసమస్యలనుగురించి తీవ్రంగా ఆలోచించడానికి అవకాశం కల్పించడంలో ఒకవిధంగా మేలే చేసిందని చెప్పవచ్చును! కాని, దురదృష్టమైన ఈ సంఘటనద్వారా ఒక ఆప్తమిత్రుడైన మిస్టర్. అనాగ్నస్‌ని పోగొట్టుకున్నాననే విచారం నన్ను వేధించింది.

**1902** వ సంవత్సరం ఏప్రిల్ మొదలు జూన్ నెలవరకూ 'లేడీస్ హోమ్ జర్నల్'లో వరుసగా 'నా జీవితచరిత్ర' ప్రకటింపబడిన సమయంలో మిస్టర్. అనాగ్నస్ మిస్టర్. మేసీకి ఒక ఉత్తరం వ్రాస్తూ 'ఫ్రాస్ట్ కింగ్' వ్యవహారంలో నేను

నిరపరాధినని తాను భావిస్తున్నట్లు వ్రాశారు. నన్ను విచారించడానికి నియమింపబడిన సంఘంలో నలుగురు అంధులూ, నలుగురు మామూలుగా చూడగలిగేవారూ ఉన్నారట. అందులో నలుగురు మిస్. కాన్బీకథ నాకు చదివివినిపింపబడిన సంగతి నాకు తెలుసుననీ, తక్కిన నలుగురూ ఈ సంగతినాకు తెలియదనీ అభిప్రాయపడ్డారట. మిస్టర్. అనాగ్నస్ మాత్రం నాకు అనుకూలంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచినట్లు చెప్పారు.

ఈ ప్రకటలోనని నిజానిజాలు ఏవిధంగావున్నా, నేను ఎంతో చనువుగా, ఉల్లాసంగా తిరిగే అనాగ్నస్ గదిలోనికి నేను ప్రవేశించగానే, నన్ను అనుమానించే వ్యక్తులు ఆగదిలో వున్నట్లు నా అంతరాత్మ నాకు చెప్పింది — ఈ నా అభిప్రాయం సరియైనదేనని తరువాతిసంఘటనలు వ్యక్తంచేశాయి ఈ సంఘటన జరగిన రెండు సంవత్సరాలవరకూ మిస్. సల్లివాన్, నేనూ నిర్దోషులమనే అభిప్రాయంతో మిస్టర్. అనాగ్నస్ వున్నారు. కాని ఆ తరువాత ఎందుచేతనో తన అభిప్రాయాన్ని మార్చుకొన్నారు. ఈ విచారణ వివరాలుకాని, విచారణ జరిపిన సభ్యుల పేర్లుకాని నాకు తెలియదు. అసలు ఒక్కరుకూడా విచారణసమయంలో నాతో మాట్లాడనేలేదు! ఆదుర్దాలో నాచుట్టూ ఏమిజరుగుతూన్నదో నాకు తెలియనే లేదు. ప్రశ్నలు వేయడానికి భయంతో నోటినుండి మాటే రాలేదు. నేను చెప్తూన్నదేమిటో, వింటూన్నదేమిటోకూడా నాకు తెలియదు!

ఇంతగా ఈ 'ఫ్రాస్ట్ కింగ్' విషయం ఎందుకు చెప్పానంటే, నా జీవితంలోనూ, నా విద్యాభ్యాసంలోనూ ఇది ఒక ముఖ్యమైన ఘట్టం, ఈ విషయంలో అనుమానాలు, అభిప్రాయభేదాలు లేకుండా వుండేనిమిత్తం, ఒకరిమీద నింద వేయకుండా నా చర్యలను సమర్థించుకొందామనే ఉద్దేశంతో కాకుండా యథార్థవిషయాలను పాఠకులముందు వుంచాను.



# పదిహేనవ ప్రకరణము

'ఫ్రాస్ట్ కింగ్' సంఘటనజరిగినతరువాత వేసవికాలం, నేను మా కుటుంబంతో అలబామాలోనే గడిపాను. ఇంటికి వెళ్ళడంలో వుండే ఆనందాన్ని నేను పూర్తిగా పొందాను. ప్రకృతి మొగ్గలతో, పూలగుత్తులతో కలకలలాడుతూంది. నా మనస్సు సంతోషంతో ఉప్పొంగిపోయింది, 'ది ఫ్రాస్ట్ కింగ్' విషయం పూర్తిగా మరచిపోయాను.

పసుపుపచ్చని, కెంపువర్ణపు ఆకులు చెట్లనుండి రాలి భూమిని కప్పగా, కస్తూరిసువాసనవెదజల్లుతూ పొదరింటిమీాద నున్న ద్రాక్షగుత్తులు పసిడిగోధుమవన్నె రంగుని తాల్చే సమయంలో నేను రేఖామాత్రంగా నా జీవితచిత్రణాన్ని ప్రారంభించాను — అంటే 'ది ఫ్రాస్ట్ కింగ్' వ్రాసిన ఏడాది కన్నమాట.

నేనువ్రాసిన ప్రతి విషయం ఎంతో ఆలోచించి వ్రాసే దాన్ని. నేనువ్రాసినది పూర్తిగా నాదికాదేమోనసే భయం నన్ను బాధించింది. ఈ నా భయం మిస్. సల్లివాన్ కితప్ప ఇంకెవరికీ తెలియదు. ఒకవిధమైన వింతభయం నన్ను 'ఫ్రాస్ట్ కింగ్' విషయం ఎత్తకుండా చేసింది. మా సంభాషణసమ

యంలో ఏదైనా ఒక కొత్తభావం నాలో మెరసినప్పుడు మిస్. సల్లివాన్ చేతిలో 'ఇది నాదో, కాదో నాకు సరిగా తెలియదు' అని మెల్లగా వ్రాసేదాన్ని. ఇంకొక సమయములో వ్రాస్తూ వ్రాస్తూ మధ్యలో ఆగి 'ఇదంతా చాలా రోజులక్రితమే ఎవరో వ్రాసినట్లు కనిపెట్టబడితే?' అని నాలో నేనే అనుకొనేదాన్ని. ఒకవిధమైన భయం నన్నావహించి, కనుపించని దయ్యమేదో నా చేతిని గట్టిగా పట్టుకొని ముందుకి కదలకుండా చేస్తూన్నట్లనిపించేది. ఇక ఆనాటికి ఒక్క అక్షరంకూడా వ్రాయలేకపోయేదాన్ని. ఈనాటికీ అప్పుడప్పుడు నా మనస్సు శాంతిలేకుండా ఒకవిధమైన ఆరాటంలో పడి పెనగులాడుతూంటుంది. ఈ పరిస్థితినుండి నన్ను తప్పించడానికి మిస్. సల్లివాన్ తనశక్తివంచనలేకుండా ధైర్యంచెప్తూ, నాకు తోడ్పడేది; కానీ ఇదివరలో నేనుపొందిన భయంకరమైన అనుభవం, దాని ప్రభావం నామీద శాశ్వతంగా వుండిపోయింది. నేను కోల్పోయిన ఈ విశ్వాసాన్ని తిరిగి నాలో కలిగించడానికి మిస్. సల్లివాన్ "యూత్స్ కంపేనియన్" అన్న పత్రికకి నా జీవితవిశేషాల్ని క్లుప్తంగా వ్రాసి పంపమని ప్రోత్సహించింది. అప్పుడు నా వయస్సు పన్నెండు సంవత్సరాలు. ఈ చిన్నకథని వ్రాయడంలో నేను అప్పుడు చేసిన ప్రయత్నం తప్పక విజయవంతమౌతుందనే ఆత్మవిశ్వాసంతో ప్రారంభించాను. ఈ విశ్వాసమే నాలో లేకపోతే తప్పక అపజయం పొందివుండేదాన్ని.

ఓరిమితో, పట్టుదలతో ప్రయత్నిస్తే తిరిగి నేను నా పూర్వపుశక్తితో వ్రాయగలననే మిస్. సల్లివాన్ ధైర్య

వచనాలు నాలో ఉత్సాహంకలిగించగా, మొదటిలో కొంత భయంవేసినా, కృతనిశ్చయంతో నా కథని వ్రాయడం ప్రారంభించాను. 'ఫ్రాస్ట్ కింగ్' సంఘటనవరకూ నేను అమాయకరమైన ఒక బాలికజీవితాన్ని గడిపాను. కాని అగ్ని పరీక్షలాంటి ఆ సంఘటన నాలోని అజ్ఞానాన్ని దూరంచేసి, జీవితాన్ని పూర్తిగా అర్థంచేసుకోడానికి తోడ్పడింది.

1893వ సంవత్సరంలో ప్రెసిడెంటు క్లీవ్‌లాండ్ పదవీ స్వీకార మహోత్సవానికి వాషింగ్టన్ వెళ్ళడం, నయాగరా జలపాతాన్ని, చికాగోలోజరిగిన ప్రపంచ వస్తుప్రదర్శనాన్ని చూడడం ముఖ్య సంఘటనలు. ఈసమయంలో కొన్ని వారాలపాటు నాకు చదువుసాగలేదు. వివిధప్రదేశాలకి వెళ్ళ డంలో అప్పుడుజరిగిన కొన్నివిషయాలు వరుసగా వ్రాయడా నికి వీలులేకపోయింది.

1893వ సంవత్సరం మార్చినెలలో నేను నయాగరా జలపాతాన్ని చూడడానికి వెళ్ళాను. నయాగరా జలపాతపు కుడిఒడ్డున నేను నిలిచి ఆ వేగానికి కంపించే భూమినీ, కదలే గాలినీ గమనించాను. నయాగరా జలపాతపు రామణీయ కతకీ, వింతపరిసరాలకీ నేను ముగ్ధురాలనైనట్లు నేను ఏ విధంగా వ్యక్తంచేయగలిగానా అని అనేకమందికి వింతగా తోచింది "నయాగరా జలపాతపు అందంగాని, సంగీతంకాని నీ కేం అర్థమౌతుంది? సుడులుతిరిగే ఆ కెరటాలు నీవు చూడలేవుకదా, జలపాతపు గర్జన వినలేవుకదా — అవి నీ కేం అర్థంఅవుతాయి?" అని ఎప్పుడూ నన్నడుగుతూ వుంటారు. ఒక్కముక్కలో చెప్పాలంటే అవి నాకు కోటి

అర్థాలను ఇస్తాయి. ప్రేమ, మతం, మంచితనం వీటి లోతు కనిపెట్టడం ఎంత కష్టమో, పై వాటి అర్థం వివరించి చెప్పడం అంత కష్టమే !

1893 వ సంవత్సరపు వేసవికాలంలో మిస్. సల్లివాన్, నేనూ డా॥ గ్రాహంబెల్‌తో చికాగోలో జరిగిన ప్రపంచ వస్తుప్రదర్శనాన్ని చూడడానికి వెళ్ళాము. నా చిన్ననాటి కోరికలెన్నో ఈసమయంలో నిజమవడం నాకు స్పష్టంగా జ్ఞాపకంవుంది. ప్రపంచపు నాల్గుమూలలనుండీ వచ్చిన అనేక వస్తువులను నా చేతులతో స్పృశించి, ప్రతిదినం నేను ప్రపంచం నలుమూలలా ఊహాయాత్రచేసేదాన్ని ! ప్రపంచంలోని వివిధజాతుల వృత్తులూ, పరిశ్రమాభివృద్ధి, అనేక వింతవింత వస్తువులు ఈ ప్రదర్శనంలో నేను చూడగలిగాను.

'మిడ్ వే ప్లెయ్‌జాన్స్' అనే ఎనిమిదెకరాల ప్రత్యేక స్థలంలో వివిధ దేశాల వింతవస్తువులు, వినోదస్థలాలు నాకు "అరేబియన్ నైట్స్" లా వుంది. ప్రపంచంలోని వింతలన్నిటినీ అక్కడనే ఏర్చి కూర్చినట్లుంది. నేను పుస్తకాలలో చదివిన శివ, గణపతి విగ్రహాలు, ఈజిప్టుదేశపు పిరమిడ్లు, మసీదులు, ఒంటెల బిడారాలు ఒకచోట చూశాను. ఇంకొకదిక్కున దీపాలతో అలంకరింపబడిన వెనిస్‌నగరపు కాలువవీధులు, నీటిధారలు నేను చూశాను. ఆ కాలువలలోని చిన్నచిన్న పడవలకి సమీపంగావున్న 'వైకింగ్' యుద్ధనావనెక్కి, దానిలోవున్న నావికులు ధైర్యంతో తుపానులనే విధంగా ఎదుర్కొన్నారో, కష్టంవచ్చినా, సుఖంవచ్చినా ధైర్యంతో పోరాడి ఏవిధంగా నిలువగలిగారో, 'సముద్రాలు మాకేమీ

కొత్తకాదు!' అంటూ ఏకలక్ష్యంతో పోరాడి ఏవిధంగా విజయాన్ని సాధించారో; యంత్రాలకు బానిసలుకాకుండా తమ బుద్ధిబలంతో మానవులు ఎంతటి ఘనవిజయాన్ని సాధించారో — ఈవిషయాలన్నిటినీ నేనుచూశాను. అందుచేత నే కార్లైల్ చెప్పినట్లు 'మనిషినిగురించి తెలిసికొనడానికే మనిషి కుతూహలపడుతూంటాడు !'

ఈ ఓడకి సమీపంలో కొలంబస్ తన సాహసయాత్రలలో ఉపయోగించినఓడ 'శాంటామేరియా' నకలుఓడని పరీక్షించాను. కొలంబస్ కేబిన్ గది, దానిలో ఒకప్రక్కగా బల్లమీదవున్న ఇసుకగడియారాన్ని నేనుచూశాను. నిర్దాక్షిణ్యంగా శత్రువులు తనను ముట్టడిస్తూంటే, అణువణువుగా క్రిందికిజారే ఇసుకరేణువులని చూస్తూ సాహసవంతుడైన ఆ నావికుడు ఏ యే మనోభావాలతో గడిపివుంటాడో అనే ఆలోచనలు నాలో రేకెత్తినాయి.

ఈ ప్రదర్శనానికి అధ్యక్షుడైన మిస్టర్. హిగిన్ బాథమ్ ప్రదర్శనలోని వస్తువులను నేనుముట్టుకొనడానికి అనుమతించారు. నా వ్రేళ్ళతో తనివితీరా ఈ ప్రదర్శనలోని అనేక వస్తువులను చూస్తూండగా రంగురంగుల ఇంద్రధనస్సును నా చేతులతో పట్టుకొన్నట్లు అనిపించింది! ముఖ్యంగా ఫ్రాన్సుదేశపు ఇత్తడివిగ్రహాలు నన్ను ముగ్ధురాల్ని చేశాయి. దేవతాస్త్రీల చైతన్యాన్ని తనచేతితో శిల్పి వీటిలో పొదిగినట్లు నా కనిపించింది! 'కేప్ ఆఫ్ గుడ్ హోప్' ప్రదర్శనంలో వజ్రాలను గనులనుండి ఏవిధంగా తీస్తారో తెలుసుకున్నాను. వీలైనప్పుడు యంత్రాలు పనిచేస్తూండగా కదలే వాటి భాగా

లను ముట్టుకొని రాళ్ళను తూచడం, కోయడం, మెరుగు పెట్టడం స్పష్టంగా అర్థంచేసుకున్నాను. అప్పుడే గనినుంచి త్రవ్వితీసిన రాళ్ళను తడిమి వాటినుంచి అసలైనవజ్రాన్ని తీయగలిగాను !

డాక్టర్ బెల్ మాతో ప్రదర్శనపు ప్రతిభాగానికీవచ్చి, నాకుకావలసిన అనేక వస్తువులను గురించి విపులంగావర్ణించి చెప్పారు. విద్యుత్ప్రదర్శనశాలకి వెళ్ళినప్పుడు అక్కడవున్న టెలిఫోన్లు, ఆటోఫోన్లు, గ్రామఫోన్లు మొదలైనవి ఏవిధంగా పనిచేస్తాయో, తీగద్వారా అనతికాలంలో దూరానికి ఏవిధంగా వార్తలను పంపవచ్చునో, ఆకసంనుంచి అగ్నిని ఏవిధంగా గ్రహించవచ్చునో మేము పరీక్షించాము. ప్రాచీన మానవ చరిత్రకి సంబంధించిన ప్రదర్శనశాఖకి వెళ్ళినప్పుడు మెక్సికో దేశపు పురాతనచారిత్రకా విశేషాలను, ఆదిమవాసుల రాతి పరికరాలను చూచి ఆశ్చర్యపోయాను. మహారాజుల స్మృతి చిహ్నాలు మంటిలోకలసిపోగా నిరక్షరాస్యులైన ప్రకృతి బిడ్డలకు ఈ పరికరాలే శాశ్వతచిహ్నాలుగా వుండిపోగలవు కదా అనేభావం నాలో కలిగింది. భద్రపరచబడిన ఈజిప్షియన్ భౌతిక దేహాలను ముట్టుకొనడానికి నాకు భయంవేసి వాటికి దూరంగా వున్నాను. మానవుని ప్రగతి చరిత్రను ఏ పుస్తకాలకంటె ఈ చారిత్రకావశేషాల ద్వారా ఎన్నో రెట్లు ఎక్కువగా నేర్చుకొన్నాను.

ఈ అనుభవాలద్వారా నేను ఎన్నో కొత్తవిషయాలు, ఎన్నో కొత్తమాటలు నేర్చుకొన్నాను. చికాగోలో జరిగిన

ప్రపంచ వస్తుప్రదర్శనంలో నేను గడపిన మూడువారాలలో బొమ్మలతో ఆడుకుంటూ, చిన్నచిన్న కథలు చదువుకొనే ఘట్టాన్నుంచి, వాస్తవ ప్రపంచపు దైనందినకార్యకలాపాలను తెలిసికొని, వాటి మంచిచెడ్డలను గ్రహించగలిగిన ఘట్టంలో పడ్డాను.



# పదహారవ ప్రకరణము

1893 వ సంవత్సరం అక్టోబరు నెలకి ముందు నేను ఒక క్రమంగా కాకుండా అనేక విషయాలు చదివాను. అమెరికా, గ్రీస్, రోమ్‌దేశ చరిత్రలు చదివాను. 'బ్రెయిలీ' లిపిలో నాదగ్గర ఒక ఫ్రెంచి వ్యాకరణపుస్తకంవుంటే దానిలోవున్న అభ్యాసాలని సాధకంచేసేదాన్ని. అంతకుముందే నాకు కొంచెం ఫ్రెంచిభాషరావడంవల్ల ఇది నాకు సరదాగావుండేది. నియమాల్నీ, పారిభాషిక పదజాలాన్ని సాధ్యమైనంతవరకూ పాటించకుండా ఈ అభ్యాసాన్ని కొనసాగించేదాన్ని. ఈ పుస్తకంలోనే మాటలూ, వాటిని ఉచ్చరించవలసిన విధానం వుండటంచేత ఉపాధ్యాయినిసహాయం లేకుండానే ఫ్రెంచి ఉచ్చారణని బాగా అలవరచుకొనడానికి ప్రయత్నించాను. అల్పమైన నా మేధాశక్తికి ఈపద్ధతి భారమైనా, ముందు ముందు ఇది నాకెంతో ఉపయోగించింది. ఈవిధంగా నేను సంపాదించిన అనుభవంతోనే లా ఫాఁటైఁ కథలు, మోలియర్ వ్రాసిన 'లే మెడిసిఁ మాల్గ్రెటూయ్' అనే నవల, ప్రఖ్యాత ఫ్రెంచి నాటకకర్త జీఁరేసిఁ వ్రాసిన "ఎథలీ" అనే దుఃఖాంతనాటకం చదివాను.

మాట్లాడేశక్తి వృద్ధిచేసికొనడానికి చాలా కాలం సాధకంచేశాను. నాకు బాగా ఇష్టమైన పుస్తకాలనుంచి

నాకు కంఠస్థమైనవాటిని బిగ్గరగా చదివి మిస్. సల్లివాన్‌కి వినిపించేదాన్ని. మిస్. సల్లివాన్ మధ్యమధ్య ఆపవలసిన స్థలాలను సూచిస్తూ, స్పష్టంగా ఉచ్చరించే విధానాన్ని నాకు చెప్పేది. ప్రపంచ వస్తుప్రదర్శనాన్ని చూచి, తిరిగివచ్చినతరువాత చాలారోజులవరకు నాకు పాఠాలుమొదలుపెట్టనేలేదు. చాలా రోజుల విశ్రాంతితరువాత 1893 అక్టోబర్‌నెలలో మిస్. సల్లివాన్ తిరిగి నాకు క్రమబద్ధంగా పాఠాలు ప్రారంభించింది.

ఆ సమయంలో మిస్. సల్లివాన్, నేనూ పెన్సిల్వేనియాలోని హాల్టన్‌లోనున్న మిస్టర్. విలియమ్ వేడ్ కుటుంబాన్ని చూడటానికి వెళ్ళాం. మిస్టర్. విలియంవేడ్ ఇంటి ప్రక్కనే మిస్టర్. ఇరాన్స్ అనే లాటిన్ పండితుడున్నాడు. ఆయనదగ్గర నేను లాటిన్‌పాఠాలు ప్రారంభించాను. మిస్టర్. ఇరాన్స్ ఎంత అనుభవజ్ఞుడో అంత మంచిస్వభావంకలవాడు. ఈయన నాకు ముఖ్యంగా లాటిన్‌వ్యాకరణం నేర్పినా, నాకు అంతగా రానటువంటి గణితాన్నికూడా అప్పుడప్పుడు చెప్పేవారు. మిస్టర్.ఇరాన్స్ నాతో కలసి టెన్నిసన్ "ఇన్ మెమోరియం" చదివి చెప్పారు. అంతకుముందు నే నెన్నో పుస్తకాలు చదివినా, ఇంత చక్కని వ్యాఖ్యానంతో ఎన్నడూ నేను చదువలేదు. మొట్టమొదటిసారిగా ఒక రచయితని సన్నిహితంగా అర్థంచేసికొనడం ఆయనదగ్గరే నేర్చుకొన్నాను.

మొట్టమొదట లాటిన్‌వ్యాకరణం చదవడం నాకు ఇష్టంలేదు. నామవాచకం, షష్ఠివిభక్తి, ఏకవచనం, స్త్రీలింగం — వీటిమీద కాలంవ్యర్థంచేయడంలో అర్థంలేదనిపించింది. వాటి అర్థం నాకు తెలిసినప్పుడు పై వాటిఅవసరం ఏమిటో

నాకు అర్థంకాలేదు. కాని ఈ విషయాన్ని గురించి బాగా తెలిసికొన్న తరువాత ఇంకా నేర్చుకోవాలనే ఉత్సాహం నాలో ఎక్కువై, భాషాసౌందర్యాన్ని గ్రహింపగలిగాను.

ఒక భాషతో అప్పుడే పరిచయమయ్యే సమయంలో ఒక్కొక్క క్రొత్తమాట మన మనోవీధిలో చిత్రించే భావ చిత్రాలు ఎంత మనోహరంగా వుంటాయి! మిస్టర్. ఇరాన్స్ నాకు పాఠంచెప్పేసమయంలో మిస్. సల్లివాన్ నా ప్రక్కనే కూర్చొని, నా చేతిలో వ్రాస్తూ, నాకోసం క్రొత్తమాటలను వెదకుతూ నాకు తోడ్పడేది. సీజర్ "గాలిక్ వార్" పుస్తకం ప్రారంభించగానే నేను మా ఇంటికి అలబామాకి బయలు దేరాను.



# పదిహేడవ ప్రకరణము

1894 వ సంవత్సరపు వేసవికాలంలో చెవిటివారికి మాట్లాడేశక్తిని అభివృద్ధిపరచడానికి ఉద్దేశింపబడిన సంస్థ సమావేశంలో పాల్గొన్నాను. ఈసంస్థ వ్యవస్థాపకుడు, అధ్యక్షుడు డాక్టర్ బెల్. న్యూయార్కు నగరంలో చెవిటివారి నిమిత్తం స్థాపింపబడిన "రైట్ హ్యూమాసన్ స్కూల్"కి నేను వెళ్ళటానికి ఈ సమావేశంలో ఏర్పాటుచేయబడింది. మిస్. సల్లివాన్‌తో సహా నేను 1894 వ సంవత్సరంలో అక్కడికి వెళ్ళాను. పెదిమలభాషలో ప్రావీణ్యత పొందడానికీ, ఉచ్ఛరించడానికి అనువుగా కంఠాన్ని సరిదిద్దుకొనడానికీ ఈపాఠశాల ఉద్దేశింపబడింది. నేను ఈ పాఠశాలలో వున్న రెండుసంవత్సరాలలో పై రెండువిషయాలేకాక, గణితం, ప్రాకృతిక భూగోళం; ఫ్రెంచి, జర్మన్ భాషలలో కృషిచేశాను.

నా జర్మన్ ఉపాధ్యాయిని మిస్. రీమీ, 'హస్తాక్షరమాల' నుపయోగించి, నాకు పాఠాలు చేప్పేది. నాకువారి భాషికపదాలు కొన్ని అలవడగానే, అవకాశం కలిగినప్పుడు మే మిద్దరం జర్మన్ భాషలో మాట్లాడుకొనేవాళ్ళం. ఈవిధంగా కొద్దినెలలలో ఆమె మాట్లాడేదంతా నేను అర్థంచేసుకోగలిగాను. మొదటిసంవత్సరం ఆఖరున నేను 'విల్‌హేల్మ్స్ టెల్'

నాటకాన్ని చదువగలిగాను! వాస్తవంగా నేను చదివినవాటిలో జర్మన్ భాషలో నే ఎక్కువ విజయాన్ని సాధించగలిగాను. ఫ్రెంచిభాష మరింత కష్టంఅనిపించింది. మేడమ్ ఆలివర్ అనే ఫ్రెంచివనితవద్ద నేను ఫ్రెంచిభాష అభ్యసించాను. కాని ఆమెకు 'హస్తాక్షరమాల' తెలియదు. ఆమె పెదిమలను తడుముతూ నేర్చుకోనడం నాకు కష్టమే అనిపించింది. అందు చేత నేను వేగంగా చదువలేకపోయాను. ఏవిధంగానైతేనేం 'లే మెడిసిన్ మాల్గ్రే టాయ్'ని తిరిగి చదువగలిగాను. ఇది కూడా నాకు వినోదాన్ని కలిగించినా 'విల్ హెల్మ్ టెల్' నచ్చినంతగా నాకిది నచ్చలేదు.

పెదిమలతో చదవడం, మాట్లాడటం వీటిలో మిస్. సల్లివాన్, నేనూ అనుకొన్నంత విజయాన్ని సాధించలేక పోయాము. ఇతరులవలెనే మామూలుగా మాట్లాడాలనేకోరిక నాకు వుంది. మా ఉపాధ్యాయినులు కూడా ఇది సాధించ వచ్చుననే అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు. ఎంతో కష్టించి, హృదయపూర్వకంగా సాధనచేసినా ఈ గమ్యాన్ని చేరలేక పోయాను. బహుశా అందరాని ఉన్నతపథాలను చేరాలనే కోరికయే ఈ ఆశాభంగానికి కారణం కావచ్చును. 'గణితం' కనుపించని గోతులతో కూడుకొన్నదని ఈనాటికీ నేను అభి ప్రాయపడుతూంటాను. ఎప్పుడూ నేను లెక్కలుచేసేటప్పుడు 'ఊహాలోకం' లోనే ప్రయాణంచేస్తూ, 'ఇది సంభవమా?' అనే ఆలోచనకే స్వస్తిచెప్పా. నామాటఅలావుండగా నాతో పాటు ఇతరులనికూడా తప్పుదారిని పట్టించేదాన్ని. ఈవిధంగా 'ఊహించని' సమయాలలో లెక్కని పూర్తిగా అర్థంచేసు

కోనకుండానే ఒక నిర్ణయానికి వచ్చేదాన్ని! నా తెలివితక్కువ తనానికి సాయం ఈ పొరపాట్లు నన్ను నానాతిప్పలు పెట్టేవి!

ఈ ఆశాభంగాలు నాలో నిస్పృహనికలిగించినా, తక్కిన విషయాలు, ముఖ్యంగా ప్రకృతికభూగోళం చదువడానికి ఇవేమీ అడ్డురాలేదు. ప్రకృతిరహస్యాలను తెలసికోనడం నా కెంతో ఉత్సాహంగా వుండేది — బైబిల్ ఓల్డ్ టెస్టమెంట్‌లో వర్ణించినట్లు 'ఏవిధంగా స్వర్గం నలుమూలలనుంచీ పవనాలు వీస్తాయో, భూమికోనలనుండి ఆవిరి ఏవిధంగా పై పైకి ప్రయాణంచేస్తుందో, నదులు శిలలమధ్య ఏవిధంగా చీలిపోతాయో, ఆమూలాగ్రం పర్వతాలు ఏవిధంగా తలక్రిందులౌతాయో, మానవుడు ప్రచండమైన ఈ ప్రకృతిశక్తుల్ని ఏవిధంగా జయించగలడో' ఈ విషయాలన్నీ నాకు ఆశ్చర్యాన్ని కలిగించేవి. నేను న్యూయార్క్‌లో గడపిన రెండుసంవత్సరాలూ ఎన్నటికి నాకు మరపురావు.

ప్రతిరోజూ 'సెంట్రల్ పార్క్' కి మేమంతా నడచి వెళ్ళేవాళ్ళం. న్యూయార్క్‌నగరంలో నాకు ఎక్కువ ఇష్టమైనది ఈ ప్రదేశమే. నేను పార్క్‌లోపొందిన ఆనందం మరపురానిది. న్యూయార్క్‌లో నేనుగడపిన తొమ్మిదినెలల్లో రోజుకొక్క కొత్తశోభతో ఈ స్థలం నాకుకనిపించేది. ఈ పార్కులోనికిప్రవేశించినప్పుడూ, తిరిగి ఇంటికివెళ్ళేటప్పుడూ ఎన్నో ఆకర్షణలకి నిలయమైన ఈ ప్రదేశాన్ని వర్ణించి చెప్తూంటే ఎంతో శ్రద్ధగా, ఉత్సాహంగా వినేదాన్ని.

ఆ వసంతకాలంలో మేము అనేక ప్రసిద్ధప్రదేశాలను చూడటానికివెళ్ళాం. హడ్సన్ నదిమీద ప్రయాణం చేసి,

ప్రసిద్ధ కవి బ్రైయాంట్ వర్ణించిన ఆకుపచ్చని నదీతీరాన విహరించాం. గుబురుగా, వరుసగా పెరిగిన చెట్లవరుస నాకెంతో ఆనందాన్ని కలిగించింది. 'స్లీపీహోల్' గ్రంథం వ్రాసిన అమెరికన్ సారస్వతపిత వాషింగ్టన్ ఇర్వింగ్ నివాసస్థలమైన 'టాకీ టౌన్'నీ, 'వెస్ట్ పాయింట్'నీ మేము సందర్శించాము.

'రైట్ హ్యూమేసన్' పాఠశాల ఉపాధ్యాయినులు సాధ్యమైనంతవరకు తమ పాఠశాలలోని విద్యార్థులు ఉల్లాసంగా వుండటానికీ, తాము పుస్తకాలలో చదివినవాటిని స్వయంగాచూసి, గ్రహించడానికీ అనేక సౌకర్యాలుకల్పించి, ఆ యా ప్రదేశాలకు తీసుకువెళ్ళేవారు.

ఈ విధంగా ఎంతో సంతోషంగా గడుపుతూన్న రోజులలో నేను న్యూయార్కు నగరాన్ని విడచి రాకముందు విషాదకరమైన ఒక సంఘటన జరిగింది. బోస్టన్ నగరానికి చెందిన మిస్టర్. జోసెఫ్ స్పాల్డింగ్ 1896 వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో మరణించాడు. ఆయనతో పరిచయమై, ఆయన ప్రేమని చవిచూచినవారు ఎంతటి విలువైన వ్యక్తిని కోల్పోయినదీ అర్థం చేసికోనగలరు. అతి సామాన్యవ్యక్తి వలె అందరిని వాత్సల్యంతో చూచేవారు. మిస్. సల్లివాన్ అన్నా, నేనన్నా ఆయన ఎంతో ప్రేమతో చూచేవారు. ఆయన వున్నంతకాలం, మేము చేసే ప్రతిపనినీ ఆయన గమనిస్తూ, మమ్మల్ని అనేకవిధాల ప్రోత్సహిస్తూ, ఆశీర్వదిస్తూన్నారనే ధీమాతో మేము ఎన్నికష్టాలువచ్చినా, వాటిని అధిగమించి, ముందుకి సాగిపోతున్నాం. ఎన్ని అడ్డంకులైనా మమ్మల్ని నిరుత్సాపరచలేకపోయేవి! ఆయనలేనిలోటు మాజీవితాలలో ఎంతో శూన్యాన్ని సృష్టించింది.

# పద్ధెనిమిదవ ప్రకరణము

రాడ్‌క్లిఫ్‌లో ప్రవేశంకోసం 1896 వ సంవత్సరం అక్టోబరు నెలలో నేను కేంబ్రిడ్జిలోని 'స్కూల్ ఫర్ యంగ్ లేడీస్'లో చేరాను.

నా బాల్యంలో వెల్లెస్లీ సందర్శించినప్పుడు ఏదో ఒకప్పుడు నేను కళాశాలలో చదువుతాను—ముఖ్యంగా హార్వర్డ్‌లో అని చెప్పాను. వెల్లెస్లీలో చదవకపోవడానికి కారణం అక్కడ అందరూ ఆడపిల్లలే అని బదులు చెప్పాను. కళాశాలకి వెళ్ళి తీరాలనే ప్రగాఢమైన వాంఛ నా మనస్సులో స్థిరంగా చిన్నప్పటినుంచీ నాటిపోయింది. ముఖ్యంగా ఏ అవసరమూ లేకుండా వినగలిగే, చూడగలిగే విద్యార్థులతో పోటీగా చదివి పట్టభద్రురాల నవాలనే నిశ్చయంతో కేంబ్రిడ్జికి బయలుదేరాను. నా ముఖ్య స్నేహితులెంతమందో నన్ను ఈ సాహసకార్యానికి దిగవద్దని సలహా ఇచ్చారు. కాని నా చిరవాంఛితం నెరవేర్చవలెననే కృతనిశ్చయంతో నేను కేంబ్రిడ్జి పాఠశాలలో ప్రవేశించాను.

పాఠశాలలో నాతోపాటు మిస్. సల్లివాన్ తరగతులకు వచ్చి, అక్కడ చెప్తూన్న పాఠాలను నాకు అర్థమయేటట్లు చెప్పడానికి నిర్ణయించుకొన్నాం.

అక్కడవున్న ఉపాధ్యాయులు మామూలు విద్యార్థులకు చదువు చెప్పడానికి అలవాటుపడ్డవారు కనుక, వారి పెదిమలని చదవడంద్వారా తప్ప వారితో మాట్లాడటానికి వేరే గత్యంతరం లేకపోయింది. మొదటిసంవత్సరం నా పాఠ్య విషయాలు ఆంగ్ల చరిత్ర, ఆంగ్లసారస్వతం, జర్మన్, లాటిన్, గణితం, లాటిన్ వ్యాసాలు, మరికొన్ని ప్రత్యేకవిషయాలు అంతవరకూ కళాశాలలో చదవాలనేఉద్దేశంతో నేను పాఠాలు చదువలేదు. ఆంగ్ల భాషలో మిస్. సల్లివాన్ నాకు మంచి శిక్షణ ఇవ్వడంచేత నాకు ప్రత్యేకశిక్షణ ఇప్పుడు అవసరం లేకపోయింది. అదిగాక ఫ్రెంచిభాషలో నాకు మంచిప్రవేశం వుంది. లాటిన్ భాషలోకూడా ఆరునెలలు శిక్షణపొందాను. ఇక జర్మన్ భాష నాకు మొదటినుంచీ అభిమానవిషయమే!

ఇన్ని సదుపాయాలువున్నా నాపురోగమనానికి అనేక అడ్డంకులు వచ్చాయి. పాఠ్యపుస్తకాలలో వున్న ప్రతివిషయాన్నీ మిస్. సల్లివాన్ నాచేతిద్వారా బోధించలేకపోయేది. లండన్, ఫిలడెల్ఫియా నగరాలలో వున్న నా స్నేహితులు బ్రెయిలీ లిపిలో ఈ పుస్తకాలను తయారుచేసి నాకు కావలసిన సమయానికి వాటిని పంపలేకపోయారు. తక్కిన బాలికలతోపాటు చదవడానికి లాటిన్ పాఠాలను బ్రెయిలీ లిపిలో కాపీ చేసుకోవలసివచ్చేది. త్వరలోనే నా అధ్యాపకులు నేను మాట్లాడే అసమగ్రమైన మాటలను అర్థంచేసికొని, నా అనుమానాలకి తగిన జవాబులు ఇస్తూ, నా తప్పులనుదిద్దుతూ నాకెంతో తోడ్పడసాగారు. తరగతిలో నేను వ్యాఖ్యానాలనీ అభ్యాసాలనీ వ్రాసుకొనలేక పోవడంచేత ఇంటిదగ్గర 'టైప్ రైటర్' మీద వీటిని చేసేదాన్ని.

ప్రతిరోజూ మిస్. సల్లివాన్ నాతోపాటు తరగతులకు వస్తూ, అధ్యాపకులుచెప్పినవాటిని ఎంతో ఓరిమితో నా చేతిలో వ్రాసేది. ఇంటిదగ్గర పాఠాలుచదువుకొనేసమయంలో నాకోసం ఎన్నో కొత్తమాటలను వెతికిపెడుతూ, బ్రెయిలీ లిపిలోలేని పాఠాలకు వ్యాఖ్యానాలు వ్రాసిపెడుతూ నాకు తోడ్పడేది. మా పాఠశాలలో జర్మన్ అధ్యాపిక ఫ్రౌగ్రోటే, ప్రిన్సిపాల్ మిస్టర్. గిల్మన్, ఈ ఇద్దరే నాకు పాఠాలుచెప్ప డానికి 'హస్తాక్షరమాల'ని నేర్చుకొన్నారు. ఫ్రౌగ్రోటే అతి నెమ్మదిగా ఈ హస్తాక్షరమాలద్వారా చెప్పగలిగినా, నాపై ఎంతో ప్రేమతో వారానికి రెండుపర్యాయములు నాకు ప్రత్యేక శిక్షణ నిచ్చేది. ఈసమయంలో మిస్. సల్లివాన్‌కి స్వల్ప విశ్రాంతికి అవకాశం లభించేది. అందరు మాయందు సానుభూతికలిగి సహాయముచేయుటకు సిద్ధముగ నున్నను కష్టములను సుఖములుగా మార్చగలిగినది ఒకరు మాత్రమే.

ఆ సంవత్సరం గణితం పూర్తిచేసి, లాటిన్‌వ్యాకరణాన్ని సమీక్షించి, సీజర్ 'గాలిక్ వార్'లో మూడుప్రకరణాలు చదివాను. కొంతవరకూ నా వ్రేళ్ళద్వారానూ, కొంతవరకూ మిస్. సల్లివాన్‌సహాయంవల్లా జర్మనుభాషలో షిల్లర్ రచించిన 'లైడ్ ఫాన్‌డెర్‌గ్లోక్', 'డెర్‌టాషర్' హైన్ రచించిన 'హార్జ్‌రైష్' ఫ్రేటాగ్ రచించిన 'జైస్ డెమ్‌స్టాట్ ఫ్రెడ్‌రిష్స్ డెస్‌గ్రాసెన్' రైల్స్ రచించిన 'ఫ్లుష్‌డెర్ షాన్ హైట్', లెస్సింగ్స్ రచించిన 'మిన్నా ఫాన్ బార్న్‌హెల్మ్', గోథే రచించిన 'ఔస్ మైనేమ్ లీబెన్' — చదివాను. జర్మన్ పుస్తకాలు ముఖ్యంగా షిల్లర్ రచించిన మనోహర

మైన గీతాలు, ఫ్రెడరిక్ ది గ్రేట్ ఘనవిజయాలు, గోథే జీవితవిశేషాలు — వీటిని చదవడంతో నే నెంతో ఆనందం పొందాను. హైన్ హార్జ్‌పర్వతాలలలో తిరుగుతూ వ్రాసిన ప్రకృతివర్ణనలు — ప్రకృతితో అవినాభావసంబంధంకలిగిన వ్యక్తికే శక్యమౌతాయికాని, అనితర సాధ్యమని నాకు తోచింది.

మిస్టర్. గిల్మన్ కొన్ని నెలలు షేక్స్పియర్ రచించిన 'ఆజ్ యు లైక్ ఇట్', బర్క్ రచించిన 'స్పీచ్ ఆన్ కన్సిలియేషన్ విత్ అమెరికా', మెకాలే రచించిన 'శామ్యూల్ జాన్సన్ జీవితం' నాకు చెప్పారు. మిస్టర్. గిల్మన్ విశేషానుభవం నా కెంతగానో తోడ్పడింది. తరగతులలో చెప్పిన వ్యాఖ్యానాలుమాత్రమే చదివివుంటే నా కింత విపులంగా, సులభముగా పై పుస్తకాలు అర్థమైవుండేవికావు.

రాజకీయశాస్త్రానికి సంబంధించిన ఏ ఇతర పుస్తకాలకంటె బర్క్ ఉపన్యాసాన్ని చదువుతూంటే అప్పటి పరిస్థితులన్నీ నాకు కండ్లకుకట్టినట్లు కనుపించాయి.

ఇంకొకవిధంగా మెకాలే రచించిన 'శామ్యూల్ జాన్సన్ జీవితం' నాకు నచ్చింది. అనేక కష్టాలమధ్య అతను బాధామయజీవితాలనుగడపే తన తోడివారియెడల సానుభూతి చూపించి ఏవిధంగా సహాయంచేసేవాడో నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. అతనిలో అనేక లోపాలు లేవనికాదు — ఆ లోపాలమధ్య నలిగి, నశించిపోకుండా వాటితో పోరాడి, నిలిచి గెలిచినందుకు అతనిని అభినందిస్తూన్నాను.

కేంబ్రిడ్జి పాఠశాలలో నా జీవితంలో మొదటిసారిగా నాతోడి పిల్లలతో కలసిమెలసి తిరిగాను. ఈ పాఠశాలకు చేరివున్న ఒక పెద్దఇంటిలో మేమందరం వుండటంవల్ల నా కెంతో సదుపాయంగా వుంది. తక్కిన పిల్లలతోపాటు నేను కూడా ఎన్నో ఆటలు ఆడేదాన్ని. మంచుమీద జారడం, చాలాదూరం షికారుగా నడచివెళ్ళడం దారిలో మా పాఠాలని గురించి చర్చించడం, మాకు నచ్చిన పద్యాల్ని గట్టిగా పాడటం, చేసేవాళ్ళం. కొంతమంది పిల్లలు నాచేతిలో వ్రాయడం నేర్చుకొనడంవల్ల మిస్. సల్లివాన్ శ్రమపడి నాకు చెప్పే అవసరం లేకపోయేది.

క్రిస్టమస్ పండుగకి మా అమ్మ, చెల్లెలు నాతో గడపడానికి వచ్చారు. మా చెల్లెలు పాఠశాలలో చదువుకొనడానికి మిస్టర్. గిల్మన్ దయతో అంగీకరించారు. అందుచేత మిల్డ్రెడ్ నాతో ఆరునెలలు కేంబ్రిడ్జీలో గడిపింది. ఒకరితో కలసి ఒకరు ఆడుకుంటూ, ఒకరికిఒకరు సహాయపడుతూ ఇక్కడ గడపిన రోజులు నా కెప్పటికీ మరపురావు.

రాడ్ క్లిఫ్‌లో ప్రవేశించడానికి ప్రాథమికపరీక్ష 1897వ సంవత్సరం జూన్ 29వ తేదీ నుండి జూలై 3వ తేదీవరకూ జరిగింది. ప్రాథమికజర్మన్, ప్రత్యేక జర్మన్, ఫ్రెంచి, లాటిన్, ఇంగ్లీషుభాషాసాహిత్యం, గ్రీక్, రోమన్‌దేశాలచరిత్ర వీనిలో మొత్తం తొమ్మిదిగంటలసేపు పరీక్ష జరిగింది. వీటిఅన్నిటిలో ఉత్తీర్ణురాల నగుటయేకాక, జర్మన్, ఇంగ్లీషుభాషలలో ఉత్తమశ్రేణిలో నెగ్గ గలిగాను.

నేను పరీక్షలు ఏ విధంగా వ్రాసినదీ ఇక్కడ చెప్పడం అసమంజసం కాదనుకుంటాను. ప్రతివిద్యార్థి మొత్తం పద హారుగంటల సేపు—పన్నెండుగంటల ప్రాథమిక విషయాలపైన, నాలుగు గంటలు ప్రత్యేక విషయాలపైన — పరీక్షవ్రాయాలి. ప్రతి ఐదు గంటలకీ, అప్పటివరకూ వ్రాసిన పరీక్షల ఫలితా లను ప్రకటిస్తారు. ఉదయం తొమ్మిదిగంటలకు హార్వర్డులో ఇచ్చిన ప్రశ్నపత్రాలను ఒక ప్రత్యేక వార్తావహుడు రాడ్ క్లిఫ్‌కి తీసుకువచ్చేవాడు. పరీక్షవ్రాసే ప్రతిఅభ్యర్థి తనపేరునుగాక, తనకిచ్చిన ఒకసంఖ్యనే తన సమాధాన పత్రాలమీద వేయాలి. నా సంఖ్య 233; కాని నేను టైప్ రైటరును ఉపయోగించ డంవల్ల నాపేరు రహస్యంగా వుంచడానికి వీలులేకపోయింది.

నా టైప్‌రైటరు చప్పుడు తక్కిన బాలికలకు అసౌ కర్యము కలిగించకుండా ఒక ప్రత్యేకమైనగది నాకు ఏర్పాటు చేయబడింది. మిస్టర్. గిల్మన్ 'హస్తాక్షరమాల' ద్వారా ప్రశ్నపత్రాలను నాకు చదివి వినిపించారు. మధ్యలో ఏవిధ మైన అంతరాయం కలుగకుండా ఆగదికి గుమ్మందగ్గర ఒకరిని కాపలావుంచారు.

మొదటిరోజు నాకు జర్మన్ పరీక్షజరిగింది. నాప్రక్కని మిస్టర్. గిల్మన్ కూర్చున్నారు. మొదట ఒకసారి ఆప్రశ్న పత్రాన్ని పూర్తిగా చదివి, ఆతరువాత ఒకవాక్యం తరువాత ఇంకొకవాక్యం చదువుతూండగా, నేను వాటిని పూర్తిగా అర్థంచేసుకొన్నట్లు నిర్ధారణ కావడానికి గట్టిగాచదివి ఆయనకి వినిపించాను. ఆనాటి ప్రశ్నాపత్రం కఠినంగావుంది. వాటికి

సమాధానాలు ఆదుర్దాతో టైప్‌రైటరుమీద వ్రాశాను. నేను వ్రాసిన సమాధానాలను మిస్టర్. గిల్మన్ నాకు వ్రాసి విని పించి, అవసరమైనచోట నేను చెప్పిన మార్పులను చేర్చారు. ఇంతకుముందు జరిగిన పరీక్షలో నాకీ అవకాశం కలుగ లేదు. రాడ్ క్లిఫ్‌లో నేనువ్రాసిన సమాధానాలను ఎవ్వరూ నాకు చదివి వినిపించలేదు. అందుచేత నిర్ణయించిన సమయా నికి ఎంతోముందుగా సమాధానాలను వ్రాయడం ముగించుతే కాని, తప్పులను దిద్దుకొనడానికి తగిన వ్యవధి వుండేదికాదు. అలాంటి సమయంలో చివర అదనంగా ఇవ్వబడిన కొద్దిసేపటిలో అంతకుముందు వ్రాసిన సమాధానాలలోని తప్పులు జ్ఞాపకం చేసికొని, సమాధాన పత్రాలచివర ఈ సవరణలను వ్రాయ వలసి వచ్చేది.

నేను అంతిమపరీక్షలలోకంటె, ప్రాథమికపరీక్షలలో ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణురాలనగుటకు రెండు కారణా లున్నాయి. అంతిమపరీక్షలలో నేనువ్రాసిన సమాధానము లను నాకు తిరిగిచదివి వినిపించే అవకాశంలేకపోవడం ఒకటి; ప్రాథమికపరీక్షలో నేనువ్రాయవలసిన విషయాలలో అంతకు ముందే నేను బాగా ప్రవేశంకలిగివుండటంఒకటి. ఆ సంవత్స రారంభంలో మిస్టర్. గిల్మన్ నాకిచ్చిన ఇంగ్లీష్, దేశచరిత్ర ఫ్రెంచ్, జర్మన్‌లలో హార్వర్డ్‌కి చెందిన పాతప్రశ్నపత్రాలలో ఉత్తీర్ణురాలనవడంకూడా ఇందుకు కారణము.

"233 సంఖ్యగలిగిన అభ్యర్థినైన నేను ఈ సమాధాన పత్రాలను వ్రాశాను" అన్న ప్రమాణంమీద తన సంతకం

పెట్టి నా సమాధానపత్రాలను పరీక్షాధికారులకు పంపించారు. తక్కిన ప్రాథమికపరీక్షలన్నీ ఈవిధంగానే నిర్వహింపబడ్డాయి. మొట్టమొదటి ప్రశ్నపత్రాలంత కష్టముగా తక్కిన వేవీ లేవు. లాటిన్ ప్రశ్నపత్రాలు మాకు ఇచ్చినరోజున నేను జర్మన్ పరీక్షలో సంతృప్తికరంగా ఉత్తీర్ణురాలనైనట్లు ప్రొఫెసర్ పిల్లింగ్ వచ్చి చెప్పారు. ఈవార్త నాకు మరింత ఉత్సాహాన్నివ్వడంతో, తక్కిన అన్ని పరీక్షలలోనూ ధైర్యంతో ఏవిధమైన కష్టమూ లేకుండానే ఉత్తీర్ణురాలనైనాను.



# పందొమ్మిదవ ప్రకరణము

గిల్మన్ పాఠశాలలో తప్పక విజయంసాధించాలనే పట్టుదలతో నా రెండవ సంవత్సరం ప్రారంభించాను. కాని ప్రారంభములో కొద్దివారాలలోనూ నేను అనేక కష్టాలను ఎదుర్కొనవలసి వచ్చింది. గణితం ప్రధానవిషయంగా నేను అభ్యసించడానికి మిస్టర్. గిల్మన్ అంగీకరించారు. నాకు కావలసిన ముఖ్యమైన పరికరాలు, భౌతికశాస్త్రం, బీజగణితం, రేఖాగణితం, ఖగోళశాస్త్రం, గ్రీక్, లాటిన్ — వీటికి సంబంధించిన బ్రెయిలీలిపి పుస్తకాలు నాకు లభించలేదు. నేను చదివే తరగతిలో ఎంతోమంది విద్యార్థులుండటంచేత నాపై ప్రత్యేక శ్రద్ధతీసుకొనడానికి వీలులేకపోయింది. మిస్. సల్లివాన్ ఈ పుస్తకాలన్నీ చదివి ఉపాధ్యాయులుచెప్పిన విషయాలు వీటితో సమన్వయపరచి చెప్పవలసివచ్చేది. నాతో వున్న పదకొండుసంవత్సరాలలో మొట్టమొదటిగా నాకు ప్రియతమమైన మిస్. సల్లివాన్ చేయి ఈ మహత్తర కార్యాన్ని నిర్వహించలేకపోయింది!

నేను నాతరగతిలో వ్రాసుకొనవలసిన బీజగణితం, రేఖాగణితపు పాఠాలు, భౌతికశాస్త్ర సంబంధమైన కొన్ని సమస్యలు, నాకు 'బ్రెయిలీరైటర్' వచ్చేవరకూ వ్రాయలేక

పోయాను. నల్లబల్ల మీదవేసే రేఖాగణిత చిత్రాలనుకూడా నేను అర్థంచేసుకోలేకపోవడంచేత, చివర సూదిగావున్న, వంగిన, నిడుపు, వంకర తీగల సహాయంతో ఈ రేఖాచిత్రాలను ఒక మెత్తపైనఅమర్చి, వాటిని అర్థంచేసుకొనేదాన్ని. ఈ రేఖాచిత్రాలకు మనస్సులోనే అక్షరాలనుపెట్టి, దాని నిర్మాణాన్ని, సూత్రాన్ని ఋజువుచేసే కార్యక్రమాన్ని మనస్సులోనే ఒక క్రమపద్ధతిలో వుంచుకొని, కడపట ఏవిధంగా ముగింపుకి వచ్చేదాన్నో మిస్టర్. కెయిత్ వివరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే ప్రతిశాఖలోను అనేక ప్రతిబంధకాలున్నాయి. ఒక్కొక్క సమయంలో నా ధైర్యాన్ని కోల్పోయి, సిగ్గుపడవలసినవిధంగా ఆత్మవంచన చేసుకొనేదాన్ని. నా అసమర్థతవల్ల ఈ ప్రతిబంధకాలను దాటలేనప్పుడు నాకు అన్నివిధాలా తోడ్పడి, వక్రమార్గాలను రాజబాటలుగాను, ముళ్ళదారిని పూలపాన్పుగాను చేయగల శక్తిగల మిస్. సల్లివాణ్కి ఈ అసమర్థతని ఆరోపించినప్పుడు నా మనస్సు ఎంత కృంగిపోయిందో వ్రాయడానికి నాకు శక్తిలేదు.

క్రమంగా ఈ కష్టాలు తొలగిపోసాగాయి. బ్రెయిలీ లిపిలో నాకుకావలసిన పుస్తకాలు, ఇతర పరికరాలు వచ్చాయి. నూతనోత్సాహంతో నేను తిరిగి చదువులో మునిగిపోయాను. బీజగణితం, రేఖాగణితంమాత్రం నాకు కొరకరాని కొయ్యలుగానే తయారయినాయి. నే నిదివరలో చెప్పినట్లు గణితశాస్త్రంఅంటే నాకు అంత అభిరుచిలేదు. నాకు కావలసినవిధంగా అనేక అనుమానాలను తీర్చి చెప్పేవారు లేకపోయారు. మెత్తమీద తీగలసహాయంతో రేఖా

గణిత చిత్రాలను నిర్మించినా ఒక భాగానికీ మరియొక భాగానికి వుండే సంబంధాన్ని నేను గ్రహించలేకపోయేదాన్ని. ఆఖరికి మిస్టర్. కెయిత్ నాసందేహాలను తీర్చిచెప్పడంలో గణితాన్ని గురించి నేను బాగా అర్థంచేసికొనగలిగాను.

ఈ కష్టాలనుండి గట్టెక్కిన సమయంలో జరిగిన ఒక సంఘటన నా విద్యావిధానాన్ని పూర్తిగా మార్చివేసింది. నేను ఎక్కువగా అలసటచెంది పనిచేస్తున్నాననీ అందుచేత నాకు పాఠాలు తగ్గించాలనీ మిస్టర్. గిల్మన్, మిస్. సల్లివాన్‌తో గట్టిగా చెప్పారు. ఈ సంఘటన నా బ్రెయిలీ పుస్తకాలు రావడానికి ముందుగా జరిగింది. నేను ఎన్నివిధాల ఈతగ్గింపుకి ఇష్టపడకపోయినా ఆయన ఒప్పుకోలేదు. నేను ఈపాఠశాలలో ప్రవేశించగానే కళాశాలలో ప్రవేశించే అర్హతను పొందడానికి ఐదుసంవత్సరాలు చదువుకోవాలని నిర్ణయింపబడింది, కాని, నా మొదటి సంవత్సరాంత పరీక్షలలో నేను వ్రాసిన సమాధానములనుబట్టి మరియొక రెండు సంవత్సరాలలో అనగా మూడవ సంవత్సరాంతానికే కళాశాల ప్రవేశార్హతను నేను సులభముగా సంపాదించగలనని మిస్. సల్లివాన్, మిస్.హార్‌బాగ్ (ప్రధానోపాధ్యాయిని), మరియొకరు కలసి నిర్ణయించారు. ఈఏర్పాటుకు మిస్టర్. గిల్మన్ మొదటఅంగీకరించినా తరువాత నేను మామూలుకంటె ఎక్కువ కష్టపడి, అలసిపోతున్నాననీ, ఇంకొక మూడు సంవత్సరాలవరకూ ఈ పాఠశాలలోనే వుండి చదవాలనీ, ఆయన నిర్ణయించారు. కాని కళాశాలలో మా తరగతి విద్యార్థులతోపాటు చేరాలనే ఉద్దేశంతో నేనీ నిర్ణయానికి ఒప్పుకోలేదు.

నవంబరు పదిహేడవ తేదీని నాకు ఒంట్లో బాగాలేక పాఠశాలకి వెళ్ళలేదు. ఇది ఏమంత పెద్ద జ్వరంకాదని మిస్. సల్లివాన్ చెప్పినా, మిస్టర్. గిల్మన్ నేను ఎక్కువగా శ్రమ పడుతూండడంవల్లనే ఈ జ్వరంవచ్చిందనీ. అందుచేత అంతగా ఎక్కువ శ్రమపడి పాఠాలు చదువరాదనీ, వాటిని పాఠ్యక్రమాన్నుంచి తగ్గించారు. కాని ఈ పద్ధతివల్ల నా తరగతిలోని తక్కిన విద్యార్థులతోపాటు కళాశాలలో ప్రవేశించే అవకాశం కలుగనందున మిస్. సల్లివాన్‌కీ, మిస్టర్. గిల్మన్‌కీ ఈ విషయంలో అభిప్రాయభేదాలు వచ్చాయి. ఈఅభిప్రాయ భేదాల కారణంగా మాఅమ్మ నన్నూ, మాచెల్లెలుమిల్డ్రెడ్‌నీ పాఠశాలనుండి మాన్పించివేసింది.

కొన్నిరోజులతరువాత కేంబ్రిడ్జికిచెందిన మిస్టర్. మెర్టన్ ఎస్. కీత్ వద్ద నేను చదువు కొనసాగించేఏర్పాటుచేయబడింది. ఆ శీతకాలాన్ని మిస్. సల్లివాన్, నేనూ బోస్టన్‌కి ఇరవైఐదు మైళ్ళ దూరంలోవున్న రెంథామ్‌లో ఛాంబర్లీన్ దంపతుల ఇంటివద్ద గడిపాము.

మిస్. సల్లివాన్ వ్యాఖ్యానించి చెప్తూండగా మిస్టర్. కీత్ వారానికి రెండుసార్లు రెంథామ్ వచ్చి 1898వ సంవత్సరం ఫిబ్రవరి నెలనుండి జూలై నెలవరకూ నాకు బీజగణితం, రేఖాగణితం, గ్రీక్, లాటిన్ బోధించారు.

1898వ సంవత్సరం అక్టోబరుమాసంలో మేము బోస్టన్‌కి తిరిగివచ్చాము. ఇక్కడ మిస్టర్. కీత్ ఎనిమిదినెలలపాటు వారానికి ఐదు పర్యాయములు, ప్రతిరోజూ ఒకగంటసేపు నాకు చదువు చెప్పేవారు. అంతకుముందు చెప్పిన పాఠంలో

అర్థంకాని విషయాలను తెలియజెప్పి, క్రొత్తగా చదువవలసిన పాఠాలను చెప్పి, ఆ వారంలో నేను నా టైప్‌రైటరుమీద వ్రాసిన గ్రీక్ పాఠాలను తనతో ఇంటికి తీసుకువెళ్ళి వాటిని సరిదిద్ది నాకు తెచ్చిఇచ్చేవారు.

ఈ విధంగా కళాశాలలో జేరడానికి నేను చేసే ప్రయత్నాలు అంతరాయంలేకుండా సాగుతూన్నాయి. తరగతులలో నలుగురితోపాటు నేర్చుకొనేపద్ధతికంటె, ప్రత్యేకంగా నేర్చుకొనడమే నాకు సులభమనిపించింది. అక్కడవుండే తొందరగాని, గజిబిజికాని లేదు. నాకు తెలియని విషయాలు విపులంగా మిస్టర్. కీత్ చెప్పడానికి కావలసినంత అవకాశంవుంది. అందుచేత పాఠశాలలో కంటె ఎక్కువ వేగముగా ఇక్కడ నా పాఠాలు జరుగుతూన్నాయి. తక్కినవిషయాలన్నిటికంటె గణితంమాత్రం నాకు కష్టంగానే వుంది. రేఖాగణితము, బీజగణితముకూడ భాష, సారస్వతమువలె సులభముగా వుండవలెనని కోరేదాన్ని. అయినా మిస్టర్. కీత్ వీటినికూడా ఎంతో సులభంగా అర్థంచేసుకొనేలా బోధించారు. ఇంతకుముందువలె, నేలవిడిచి సాముచేయకుండా, లెక్కల్ని బాగా అవగాహన చేసుకొని, స్పష్టంగా, శాస్త్రీయంగా నిర్ణయానికి వచ్చే పద్ధతిని ఆయన నాకు అలవరచారు. విషయగ్రహణశక్తి నాలో ఎంతతక్కువగావున్నా, ఓరిమితో, సహనంతో ఆయన ఎంతో ప్రేమతో నాకు బోధించారు.

1899 వ సంవత్సరం జూన్ 30వ తేదీని నేను రాడ్‌క్లిఫ్ కళాశాలలో ప్రవేశం పొందడానికి నిర్ణయించేఅంతిమ పరీక్షకు కూర్చొన్నాను — మొదటిరోజున ప్రాథమిక గ్రీక్ భాష,

లాటినులో ప్రధానభాగంలోను, రెండవ రోజున రేఖాగణితం, బీజగణితం, గ్రీక్‌లో ప్రధాన భాగంలోనూ పరీక్ష జరిగింది.

ఈ పరీక్ష సమయంలో మిస్. సల్లివాన్ పరీక్షాపత్రాలను చదివి నాకు చెప్పడానికి పరీక్షాధికారులు అనుమతించలేదు. పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూషన్‌లో అధ్యాపకుడుగా వున్న మిస్టర్. యుగీన్‌సి వైనింగ్ పరీక్షాపత్రాలను 'అమెరికన్ బ్రెయిలీ' లిపిలో వ్రాసి నా కివ్వడానికి నియమింపబడ్డారు. ఒక్క బ్రెయిలీవ్రాయడంతప్ప మరేవిధంగాను మిస్టర్. వైనింగ్ నాతో మాట్లాడలేదు. అంతకుముందు నా కీయనతో పరిచయం లేదు. అదేవిధంగా పర్యవేక్షకుడుగా వచ్చిన ఇంకొక అధ్యాపకుడు నాతో మాట్లాడనేలేదు. గ్రీక్, లాటిన్ భాషల విషయంలో బ్రెయిలీలిపిపద్ధతి బాగా పనిచేసిందికాని, రేఖాగణితం, బీజగణితం దగ్గరకు వచ్చేసరికి చిక్కులు ప్రారంభమయాయి. బీజగణితపు పరీక్షాపత్రాల విషయంలో నిరుత్సాహంతో, కంగారుతో ఎంతో అమూల్యమైన కాలాన్ని వృథాచేయవలసి వచ్చింది. వాస్తవంగా 'ఇంగ్లిష్' 'అమెరికన్' 'న్యూయార్క్ పాయింట్' అనే మూడురకాల 'బ్రెయిలీలిపి'తో నాకు పరిచయమున్నా, బీజగణితంలోనూ, రేఖాగణితంలోనూ ఉపయోగించే గుర్తులు ఆ యా పద్ధతులలో వేరువేరుగా వుంటాయి. బీజగణితంలో నేను ఇంగ్లీష్ బ్రెయిలీపద్ధతికి అలవాటుపడ్డాను. అందుచేతనే ఈ చిక్కులు వచ్చాయి.

పరీక్షలకి రెండురోజులకుముందు మిస్టర్. వైనింగ్ పాత హార్వర్డ్ రేఖాగణిత పరీక్షాపత్రాలను నాకు పంపించారు.

కాని అవి 'అమెరికన్ బ్రెయిలీ' లిపిలో వున్నాయి. అందు చేత తక్షణం కూర్చుని ఆ యా గుర్తులను వివరించవలసినదిగా మిస్టర్. వైనింగ్‌కి ఒక ఉత్తరం వ్రాశాను. ఆ తిరుగుటపాలో ఒక క్రొత్తపరీక్షాపత్రం, గుర్తులువున్న కాగితం వచ్చాయి. తక్షణం వాటినిగురించి తెలిసికొనడానికి కూర్చున్నాను. బీజగణిత పరీక్షకి క్రితంరాత్రి క్లిష్టమైన విషయాలమధ్య చాలాసేపు పెనగులాడాను — కుండలీకరణము, రాసులు, మూలము — వీటి సంబంధాన్నిగురించి సరిగా చెప్పలేక పోయాను. మరునాడు ఏమిజరుగుతుందో అని మిస్టర్. కీత్, నేనూ ఎంతో బెంగపెట్టుకున్నాం.

మరునాడు పరీక్షసమయానికి రెండుగంటల ముందు గానే కళాశాలకి వెళ్ళాం. మిస్టర్. వైనింగ్ 'అమెరికన్‌పద్ధతి' గుర్తులను పూర్తిగా నాకు బోధపరచారు.

రేఖాగణితంలో ప్రశ్నలను నేను 'ఎత్తుఅక్షరాల' ద్వారాగాని, నా చేతిలోవ్రాయడం పద్ధతిలోగాని చదవడానికి అలవాటుపడ్డాను. నా కిచ్చిన ప్రశ్నలు సరిగావున్నా, దానిలో వున్న బ్రెయిలీ లిపి నన్ను తికమకపెట్టింది. నేనుచదువు తూన్నది సరిగా అర్థంచేసుకోలేకపోయాను. బీజగణితం విషయంలో మరింత కష్టమైంది. నాకు బాగా వచ్చుననుకున్న కొత్త గుర్తులు తికమకలు తెచ్చిపెట్టాయి. అదీకాక నేను నా టైప్‌రైటర్‌మీద వ్రాసినది తిరిగి చూడలేకపోయాను. అంతకుముందు వీటిని బ్రెయిలీలోగాని, జ్ఞాపకంద్వారాగాని చేసేదాన్ని. మిస్టర్. కీత్ నా జ్ఞాపకశక్తిమీదనే ఎక్కువగా ఆధారపడి, పరీక్షాపత్రాలకు సమాధానంవ్రాసే పద్ధతిలో

నాకు శిక్షణ ఇవ్వలేదు. అందుచేత నేను ఆ ప్రశ్నలను అర్థం చేసికొనడానికి మరల మరల చదువవలసి వచ్చింది. ఈ గుర్తులను నేను సరిగా చదివాననే నమ్మకం కూడా నాలో కలుగక పోవడంవల్ల నేను మరింత వెనుకపడ్డాను. ఆ సమయంలో నేనుపడిన ఆ వేదన ఊహాతీతం!

కాని ఈవిషయంలో నేను ఎవరినీ నిందించదలచుకో లేదు. రాడ్ క్లిఫ్ పరీక్షాధికారులు నా పరీక్షల్ని ఎంత కఠిన తరం చేస్తూన్నారో, ఈవిషయంలో ఎన్ని కష్టాలను నేను లోనుకావలసి వచ్చిందో గమనించినట్లు కనుపించదు. కాని ఈ అడ్డంకులన్నిటిని ప్రయత్నపూర్వకంగా రాడ్‌క్లిఫ్ అధికారులు పెట్టివుండకపోయినా — వీటిని అధిగమించగలిగాననే విషయం నాకు ఎంతో సంతృప్తి కలిగించింది.



# ఇరువదవ ప్రకరణము

ఈవిధంగా కళాశాలలో ప్రవేశించడానికి నేనుచేసిన సమరం ముగిసింది. ఇప్పుడు నేను రాడ్ క్లిఫ్‌లో ఎప్పుడైనా చేరవచ్చును. అయినా ఇంకొక సంవత్సరం మిస్టర్. కీత్ దగ్గరే చదువుకొనడం మంచిదని నిశ్చయించుకొన్నాను. అందుచేత నే 1900 వ సంవత్సరాంతంవరకూ కళాశాలలో ప్రవేశించాలనే నా కల నిజంకాలేదు.

రాడ్ క్లిఫ్‌లో చేరిన మొట్టమొదటిరోజు నాకు ఈనాటికీ జ్ఞాపకంవుంది. ఈరోజుకోసమే నేను సంవత్సరాలతరబడి ఎదురు చూచాను. నాలోవుండే ఒక మహత్తరమైన శక్తి — నా స్నేహితులెంతమంది వలదని చెప్పినా, నా మనస్సు ఎంత వెనుకకు లాగినా — తక్కిన చూడగలిగే, వినగలిగే విద్యార్థుల ప్రమాణాన్ని అందుకొనడానికి పాటుపడవలసినదిగా నన్ను పురికొల్పింది — "రోమ్‌నుంచి బహిష్కరింపబడ్డా వంటే, రోమ్‌బయట వుండడమన్నమాటే" అన్న ఒక రోమన్ విజ్ఞానవేత్త అన్న మాటలు నాకు హృదయంలో నాటుకుపోయాయి. విజ్ఞానపు రాజబాటద్వారాలు నాకు బంధింపబడటంచేత, ఎన్నో చుట్టుదారులగుండా ప్రయాణంచేయవలసి వచ్చింది — అంతే! కళాశాలలో ప్రవేశించగానే, నాలాగే

ఆలోచిస్తూ, ప్రేమిస్తూ, విజ్ఞానసముపార్జనకు పోరుసల్పే విద్యార్థులతో చేతులుకలుపవచ్చుననే సంగతి నేను తెలిసికొన్నాను.

ఎంతో ఉత్సాహంతో నేను నా చదువు ప్రారంభించాను. క్రొత్తవెలుగునిచ్చే రమణీయమైన ప్రపంచాన్ని నా ముందు ఊహించి, నాకు బోధించే అన్నివిషయాలను సులభముగా అర్థంచేసికొనగల శక్తి నాలోవున్నట్లు నా మనో విహాయసంలో స్వేచ్ఛగావిహరించే విహంగంలా నన్ను నేను భావించుకొన్నాను. ఇతర విద్యార్థులవలె నాకుకూడా ఈ స్వేచ్ఛకలదని భావించాను. నేనుకూర్చునే, పాఠాలు వినే కళాశాల నూతన చైతన్యంతో ఉట్టిపడుతూంది. విజ్ఞాన వేత్తల, మహాపురుషుల ఆదర్శాలతో నిండిన ఆ వాతావరణంలో అధ్యాపకులు విజ్ఞానమూర్తులుగా నాకు గోచరించారు.

కాని త్వరలోనే ఈ కళాశాల నేనుకన్న కలలకి తగిన స్థలం కాదని తెలిసికొన్నాను. నా యువక హృదయాన్ని పులకింపజేసిన కలలన్నీ క్రమంగా కరగిపోవడం గమనించాను. క్రమంగాకళాశాలకివెళ్ళడంలో అసౌకర్యాలేకాని సౌకర్యాలు లేవనేవిషయాన్ని గ్రహించాను.

వీటిలో ముఖ్యమైనది చెప్పినదానిని ఆలోచించడానికి కూడా కాలం సరిపోకపోవడం. అంతకుముందు నేను విన్న దానినిగురించి బాగా ఆలోచించడానికీ, నా అభిప్రాయాలను ఏర్పరచుకొనడానికీ తగిన వ్యవధివుండేది. అతి సన్నిహితమైన ఒక మహాకవివాక్యాలు ప్రశాంతంగా కూర్చుని ఆలోచించు

తూన్నప్పుడు, నా హృదయతంత్రులను చలింపజేసి, ఒక మనోహరమైన సంగీతాన్ని పలికించడం నా అనుభవంలో ప్రశాంతమైన వాతావరణంలోనే నేను గమనింపగలిగాను. కాని కళాశాల వాతావరణంలోమాత్రం ఈ వ్యవధికి అవకాశం లేదు. 'కళాశాలకివెళ్ళడం చదువుకొనడానికిమాత్రమే కాని ఆలోచించడానికి కాదు' అన్నట్లు తోస్తుంది. కళాశాలలో అడుగుపెట్టగానే ప్రశాంత, పుస్తకాలు, ఆలోచన — వీటిని ఎక్కడో రహస్యాలుపలికే దేవదారువృక్షాల నీడలలో వదలిరావలసివస్తుంది! ముందుముందు నాకు ఈ చదువు ఉపయోగించగలదనే తృప్తి నాలో కలుగుతుందని అను కొన్నా నాకు అలాంటి 'ముందుఆలోచన' లేదాయెను!

కళాశాలలోప్రవేశించిన మొదటి సంవత్సరం నేను చదువవలసినవి ఫ్రెంచ్, జర్మన్, దేశచరిత్ర, ఇంగ్లీష్ సారస్వతం, వ్యాసాలు. ఫ్రెంచ్ భాషలో కార్నీలీ, మోలియర్, రేసిన్, ఆల్ఫ్రెడ్ డి. ముస్సెట్ — వీరిగ్రంథాలుకొన్ని; జర్మన్ భాషలో గోథే, షిల్లర్ల రచనలు, దేశచరిత్రలో రోమన్ సామ్రాజ్యపతనం మొదలుకుని 18వ శతాబ్దంవరకూ గల చరిత్రని వేగంగా సింహావలోకనంచేసి, ఇంగ్లీష్ సారస్వతంలో మిల్టన్ పద్యాలు, రచనాస్వాతంత్ర్యంకోసం మిల్టన్ వ్రాసిన 'ఏరియోపాగిటికా' అనే వ్యాసం సవ్యాఖ్యానంగా చదివాను. నా ప్రత్యేకపరిస్థితులలో నేను కళాశాలలో ఏవిధంగా పరిస్థితుల నెదుర్కొగలిగాను అని చాలామంది నన్ను అడుగుతూంటారు — నాతరగతిలో ఇంచుమించు నేను ఒంటరిగా ఉన్నట్లు అనిపించేది. అధ్యాపకులు ఎంతో దూరాన

వుండేవారు. వారు మాట్లాడేది టెలిఫోన్‌లో మాట్లాడే టట్లుండేది. వేగంగా వారు చెప్పేది నా చేతిలో వ్రాయబడేది. ఈ పరుగులో అధ్యాపకులద్వారా వినే ప్రత్యేకత నాకు కనుపించేదికాదు — కుందేటినితరిమే వేటకుక్కలవలె ఆ మాటలు నా చేతిలో మహావేగంతో పరుగెత్తేవి. కాని ఈ విషయంలో తక్కిన విద్యార్థులకు నేను తీసిపోలేదని చెప్ప గలను. తరగతిలో చెప్పే విషయాలను మహావేగంతో వ్రాసు కుంటూంటే వాటి అర్థంకాని, సందర్భంకాని వ్రాసుకొనేవారికి అవగాహనఅవడం కష్టం. నా చేతులు ఎంతో వేగంగా వింటూండగా వ్రాసుకొనడం కష్టం. అందుచేతనే తరగతిలో విన్నదానిని ఇంటికివెళ్ళి వ్రాసుకొనేదాన్ని. ఆవిధంగా ప్రతి దినం వ్రాసే విషయాలు, చేసే సాధకాలు, వ్యాఖ్యానాలు; గంట పరీక్షలు, అర్థసంవత్సర పరీక్షలు, సంవత్సరాంత పరీక్షలు వీటికి సమాధానములు టైప్‌రైటర్‌ మీదే వ్రాసేదాన్ని. వీటిని పరిశీలించిన అధ్యాపకులు నాకు తెలిసిన విషయాలు ఎంత స్వల్పమో సులభముగా తెలిసికొనేవారు. లాటిన్ ఛందస్సునేర్చుకొనడానికి ప్రారంభించినప్పుడు వివిధ యాత్రలనీ, పరిమాణాలనీ తెలిపే కొన్ని సంజ్ఞలను మా అధ్యాపకునికి తెలిపాను.

నేనుఉపయోగించేది 'హేమండ్ టైప్‌రైటర్' నా ప్రత్యేక పరిస్థితులకిది ఎంతగానో ఉపయోగకరంగావుంది. ఈ యంత్రంలోమారే 'నాడా'ల ఉపయోగంద్వారా గ్రీక్, ఫ్రెంచ్, గణితశాస్త్రసంబంధమైన అక్షరాలను మన అవస రాన్నిబట్టి ఉపయోగించవచ్చును. ఈ యంత్రపుసహాయమే

లేకపోతే నేను కళాశాలకివెళ్ళడం అసంభవమే అయేది. నేను చదువవలసినవిషయాలకు సంబంధించిన పుస్తకాలు అంధులలిపిలో లేకపోవడంచేత నా చేతిలో వ్రాయడం ద్వారానే వాటిని చదువుకొనవలసి వచ్చేది. అందుచేత తక్కిన బాలికలకంటె నేను వెనుకపడవలసివచ్చేది. ఏనికితోడు నాకుకలిగే వింతసందేహాలను తీర్చుకొనడానికికూడా చాలా కాలం వ్యర్థమయేది. తోడిబాలికలందరూ ఆడుతూ, పాడుతూ నృత్యంచేస్తూన్నసమయంలో నేను పాఠ్యవిషయాలనిగురించి నా కాలాన్ని వినియోగింపవలసిరావడం నా కెంతో కష్టంగా వుండేది. కాని త్వరలోనే నా గురుతరబాధ్యతను గుర్తించి హృదయపూర్వకంగా చిరునవ్వుతో నా చదువులో మునిగి పోయేదాన్ని. వాస్తవమైన విజ్ఞానాన్ని పొందగోరేవారు ఆ పర్వతశిఖరారోహణంలో పడవలసిన కష్టాలన్నిటినీ ఎదుర్కొని తీరాలి. దీనికి మరియొకమార్గం లేనేలేదు. అందుచేత అనేక అవరోధాలనుదాటి నా గమ్యస్థానానికి అవిరామంగా నడచి పోవడానికే నిశ్చయించుకొన్నాను. ఈ నా ప్రయత్నంలో అనేకపర్యాయములు పరాజయంపొందినమాట వాస్తవమే. ప్రతిపర్యాయం మరింత శక్తితో, పట్టుదలతో ముందుకు ప్రయాణం సాగించాను. ప్రతి పోరాటం ఒక విజయమే. ఈ నా సమరంలో నేను ఒంటరిగాలేను. మిస్టర్. విలియం వేడ్, పెన్సిల్వేనియా ఇన్‌స్టిట్యూషన్ ప్రిన్సిపాల్ మిస్టర్. ఇ. ఇ. ఎలెన్ నాకుకావలసిన పుస్తకాల నెన్నిటినో అంధులలిపిలో వున్నవాటిని నాకు పంపించారు. వీటివల్ల నేను ఎంతఉపయోగాన్ని పొందానో వారికి తెలియదు!

రెండవసంవత్సరం రాడ్క్లిఫ్‌లో నేను ఇంగ్లీష్‌వ్యాసావళి, సారస్వతవిషయంగా బైబిల్ గ్రంథం, యూరప్, అమెరికా ప్రభుత్వ చరిత్ర, హొరేస్ ఓడ్స్, లాటిన్ కామెడీ చదివాను. వ్యాసావళిపాఠాలు ఎంతో బాగుండేవి. ఆ తరగతులలో నాకెంతో ఉత్సాహంగా వుండేది. అధ్యాపకులు ఎంతో చమత్కారంగా అనేక విషయాలను మాకు హృదయాలకు పట్టేటట్లు చెప్పేవారు. ఒక్క గంటవరకూ ప్రాచీనమహాకవుల కవితారసాన్ని నిరాటంకముగా గ్రోలడానికి అవకాశంకలిగేది. పురాతన మహాకావ్యాలలోని రామణీయకత, సత్యం, శాశ్వతం మనోవీధిలో ఆ సమయంలో గోచరించి, ఎంతో తృప్తిగా ఇండ్లకు తిరిగివెళ్ళేవాళ్ళం.

నేను ఏ యే విషయాలను ఎక్కువగా ఇష్టపడేదాన్నో వాటినే ఈ రెండవసంవత్సరంలో చదువవలసిరావడం నిజంగా నా అదృష్టమనే చెప్పాలి; ఆర్థికశాస్త్రం, 'ఎలిజబెత్ యుగపు సారస్వతం,' — ప్రొఫెసర్. జార్జి ఎల్ కిట్రెడ్జ్ వద్ద షేక్స్పియర్ చదువుకొనడం, ప్రొఫెసర్ జె. రోయ్స్‌వద్ద వేదాంతచరిత్ర చదువుకొనడం గమనార్హమైన విషయాలు.

కళాశాల మహావిజ్ఞానవేత్తల నిలయమనీ, విజ్ఞానాన్ని గురుముఖంగా గ్రోలవచ్చు ననే నాఅభిప్రాయం నిజంకాలేదు. విజ్ఞానవేత్తలకు అది నిలయమైనా, వారి ముఖతః నేర్చుకొనడంమాట అటుంచి, వారు అక్కడ ఉన్నారనే విషయంకూడా నమ్మడం నాకు కష్టమైంది. మహాకవులను అర్థంచేసికొనడానికి ఈ అధ్యాపకుల వ్యాఖ్యానాలు నాకు తోడ్పడలేదు సరికదా వారు చెప్పేది ముగ్గినపండ్లు చెట్టునుండి రాలి పడిపోయినట్లు

నా మనస్సునుండి అంతర్ధానమైపోయేవి. మనం ఆ మహాకవు లను అర్థంచేసికొనడంకంటె, మన హృదయాంతరాళాలనుండి వారితో సహానుభూతి ప్రకటితమైనప్పుడే వారి విశిష్టతసార్థకం పొందుతుందనే విషయాన్ని ఈ అధ్యాపకులు మరచిపోతా రనే విషయం నాకు తోచింది. ఈ విద్యావిధానంలో పువ్వు, చెట్టు యొక్క వివిధభాగాలు, వేళ్ళు అవిపెరిగే విధానం వీటని గురించిన వివరాలు తెలిసికొనగలం కాని, మంచుబిందు వులతో తడిసిన అమృతతుల్యమైన పుష్పపరిమళాల అనిర్వచనీ యానందాన్ని మాత్రం గ్రహించలేము! 'ఈ వ్యాఖ్యానా లన్నిటితో మనకి పనేమిటి?' అనే ప్రశ్న నాలో ఎన్నోపర్యా యములు ఉత్పన్నమౌతూండేంది. ఒక విషయాన్ని గురించి సాకల్యంగా తెలిసికొనవలసినదే. కాని ఈ వ్యాఖ్యానాలన్ని 'అంధ విహంగం తనరెక్కలను ప్రయోజనంలేకుండా గాలిలో రెపరెపలాడించినట్లు' నా మనోవీధినుంచి దాటిపోయేవి. ఒక అంతమంటూలేని ఈ వ్యాఖ్యానాలు ఏ విషయాన్ని స్పష్ట పరచలేవు సరిగదా, మరింత క్లిష్టతరంగా చేస్తాయి. వీటివలన ఒక్కవిషయంమాత్రం స్పష్టమౌతుంది; 'ప్రపంచంలో ఎంత మంది మనుష్యు లున్నారో అన్ని వివిధాభిప్రాయాలున్నాయి' ప్రొఫెసర్ క్రిట్జ్ వంటి ఏ మహామహుడో షేక్స్పియర్ మహాకవిని మనముందు సాక్షాత్కరింపజేయ గలుగుతాడు!

అప్పుడప్పుడు నేనుచదువవలసిన వాటిలోసగం చదువ కుండానే విడిచివేయవలె ననిపించేది. అప్పటికే ఎంతో శ్రమ పడిన నామెదడుకి మరింత బరువు కల్పించడం నా కిష్టంలేదు. ఒక్కరోజులో నాలుగైదు వివిధవిషయాలపైన, వేర్వేరు

భాషల పుస్తకాలు చదివి వాటి సారాన్ని అర్థంచేసుకొనడం నాకు తలకుమించిన పని అనిపించింది. కేవలం పరీక్షలకోసం ఏవో ముఖ్యమనుకొన్న వాటిని ముక్కునపెట్టుకొని, భయపడుతూ, తొందరగా చదవడంవల్ల ప్రయోజనం లేకపోవడమే కాక, విద్య లక్ష్యమే నశిస్తుంది. ఈ కలగాపులగపు విషయాలన్నీ నా మనస్సులో చిందరవందరగా చెలరేగి ఒకపద్ధతిలో వాటిని పెట్టడమే కష్టమనిపించింది. ఎప్పుడైనా ఆలోచనా మందిరంలో ప్రవేశించగానే రకరకాల ఆలోచనలు వడగళ్ళ వానలా నా నెత్తిమీదపడి, కనుపించని కళాశాలదయ్యాలు నన్ను చుట్టుముట్టి "నేనుచేసిన పొరపాటుకి నన్నుక్షమించు! నేను తెలియక ఆకాశహర్మ్యాలు నిర్మించుకొన్నాను. ఇక ఈజోలికి రాను!" అని మొరపెట్టుకొనేదాకా నన్ను వదలేవి కావు!

ముఖ్యంగా పరీక్షలు రాక్షసరూపం ధరించిన పీడకలలవలె నాకు ప్రత్యక్షమయ్యేవి. ఎన్నోసార్లు నేను వీటి నెదురొక్కొని పట్టి కరపించినా, వాటి తలయెత్తడం మానలేదు. ఈ పరీక్షలముందు అర్థంకాని సూత్రాలతో తల దిమ్మెక్కిపోయేది. చరిత్రలోని ముఖ్యఘట్టాల తేదీలు జ్ఞాపకంవచ్చేవి కావు, తిండి సయించేదికాదు. ఆఖరికి ఈ పుస్తకాలనీ, పరీక్షలనీ తీసుకువెళ్ళి పదినిలువులలోతున పాతిపెట్టాలని అనిపించేది. ఏలాగైతేనేం ఆ ఘడియ సమీపిస్తుంది పుణ్యంబాగుండి నీకు అడిగిన ప్రశ్నలకు సమాధానం జ్ఞాపకం వచ్చాయా సరేసరి, కాని అదే జరుగుతూండదు సాధారణంగా—నీ తెలివితేటలు అక్కడ పనిచేయవు. జ్ఞాపకాలు రెక్కలు కట్టుకొని ఎగిరి

పోతాయి. అన్నినాళ్ళూ నీవు వల్లెవేసిన, కంఠస్తంచేసిన విష యాలన్నీ అక్కరకురాకుండా పోతాయి!

ప్రశ్న: 'హాస్' అనగా నెవరు? ఆయన చేసినపనులను సం క్షిప్తముగా వర్ణింపుడు?

'హాస్సా?' ఎవరబ్బా ఈ హాస్? ఈ పేరు నాకు ఎక్కడో చదివినట్లు బాగా జ్ఞాపకం వుందే! ఈ విధంగా నీకు తెలిసిన చరిత్ర విషయాలన్నీ వల్లించుకుంటావు. నీమనస్సులో ఈ మాట ఎక్కడో వున్నట్లు. మొన్నను 'సంస్కరణ అధ్యాయం' చదువుతూండగా ఈ పేరు వచ్చినట్లుకూడా నీకులీలగా తోస్తుంది. కాని పెద్ద గుడ్డపీలికల సంచిలో చిన్న రంగుపట్టు పీలికని వెతికి పైకి తీయడంలా తోస్తుంది. నీకు తెలిసిన తిరుగు బాట్లు, అంతఃకలహాలు, చిత్రవధలు, ప్రభుత్వ విధానాలు— ఒకటేమిటి అన్నీ జ్ఞాపకం వస్తాయి. కాని ఎవరీ హాస్? ఎక్కడవున్నాడు? పరీక్షాపత్రంలో నిన్నడిగిన ప్రశ్నలకి సమా ధానాలు తప్ప తక్కినవన్నీ నీకుజ్ఞాపకంవస్తాయి; ఇక తెగించి నీ ఆలోచనల మూటని విప్పి ధారాపాతంగా వ్రాయడానికి ప్రారంభిస్తావు. అంతవరకూ నీకు రాబోయే అపాయాన్నైనా చూడకుండా, తన ఆలోచనలలో తాను మునిగి ఒకమూల కూర్చొనివున్న ఆ 'హాస్' ఇప్పుడు బయటపడతాడు! ఇంతలో 'టైమ్ అయిపోయింది!' అంటూ పర్యవేక్షకుడు నీకు సూ చిస్తాడు; పట్టరానికోపంతో, ఉడుకుమోతుతనంతో ఆ కాగి తాల కట్టని ఒకమూలకి పారేసి 'అసలీ అధ్యాపకులకి మన సమ్మతిలేకుండా పరీక్షించే అధికారం రద్దుచేయాలి' అనే విప్లవ భావాలు నీలో రేకెత్తుతూండగా ఇంటికి తిరిగివస్తావు!

ఇక్కడ ఒక్కవిషయం చెప్పవలసివుంది. మిస్. కెల్లర్ తనకిచ్చిన ప్రశ్నపత్రాలన్నింటికీ ఎంతో ప్రశంసనీయంగా సమాధానాలువ్రాసి రాడ్‌క్లిఫ్‌లో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. ఆమె రాడ్‌క్లిఫ్‌లోవున్న నాలుగుసంవత్సరాలు తన తరగతికి ఉపాధ్యక్షురాలుగా వుంటూవచ్చింది — 1904 వ సంవత్సరపు 'రాడ్‌క్లిఫ్ సంవత్సరనివేదికలో ఆమెతరగతి విద్యార్థులు ఆమెనుగురించి ఈవిధంగా వ్రాశారు: "ఆమె సాధించిన విజయాలముందు మావి సూర్యునిముందు దివిటీల వలె వుంటాయి. పరాజయాన్ని హెలెన్ కెల్లర్ ఎరుగదు. ఆమె తన రక్తాన్ని ధారపోసి సాధించినవిజయాలముందు మేము సాధించినవి హస్తిమశకాంతరంగలవి."

ఇంతకుముందు రెండుమూడుపుటలలో నేనువర్ణించిన విషయాలు, ఉపయోగించిన ఉపమానాలు చదివి బహుశా అందరూ నన్ను హేళనచేయవచ్చును. అవును — ఆలోచనలనే వడగళ్ళవానలు, పరీక్షలనే దయ్యాలు — ఇవ్వన్నీ నవ్వుపుట్టిస్తాయి. వీటినిచూచి అందర్నీ నవ్వనీ! — ఆ సమయంలో స్థిరత్వములేని నా ఊహాప్రపంచాన్నే ఇవి వర్ణిస్తాయి — ఆవిధంగా నవ్వేవారివైపుతిరిగి — ఒక మహా సత్యాన్ని నేను తెలిసికొన్నట్లు ముఖంపెట్టి 'కళాశాల విషయంలో నాకుండే అభిప్రాయలు ఈవిధంగా మారినాయని చెప్తాను !'

రాడ్‌క్లిఫ్‌లో ప్రవేశించకపూర్వం నేను నిర్మించుకొన్న ఊహాసౌధాలు వాస్తవానికి వచ్చేసరికి క్రమంగా కూలిపోయాయి. కాని ఊహాలోకాన్నుంచి వాస్తవలోకానికి ప్రయాణం

చేసే లోపులో నేను అనేకగుణపాఠాలను నేరుకొన్నాను అందులో ఒకటి 'ఓరిమి'ని గురించినది. ముఖ్యంగా చదువు విషయంలోమాత్రం — ఒక పల్లెటూరులో రమణీయమైన దృశ్యాల్ని చూడడానికి, ఏ విధమైన తొందరాలేకుండానెమ్మదిగా, మనకు కనుపించిన వాటిని చూసి ఆనందిస్తూ నడచి వెళుతూన్నట్లుగానే వుండాలి. ఆ విధంగా గ్రహించిన అనుభవమే మనస్సుకి శాశ్వతమైన విజ్ఞానాన్ని, శాంతిని ఇవ్వగలుగుతుంది. 'విజ్ఞానమే శక్తి' అని బేకన్ అన్నాడు. అంతే కాదు విజ్ఞానం శాశ్వతానందాన్నిస్తుంది — గంభీరమైన, నిరవధికమైన విజ్ఞానం సత్యాన్ని అసత్యంనుంచీ, ఔన్నత్యాన్ని నీచత్వంనుంచి వేరుచేస్తుంది. మానవుని ప్రగతికి తోడ్పడిన మహావ్యక్తుల ఆశయాలనీ, సాధించిన కార్యాలనీ గమనించడంద్వారా, ఆనాటి ప్రజాచరిత్రనీ వారు అధిగమించిన అవరోధాలనీ కళ్ళకు కట్టినట్లు మనం తెలిసికొనవచ్చును. వీటిని విస్మరించడం, ప్రజావాహిని ప్రగతిని గమనించనట్లు కండ్లు మూసుకొనడమే అవుతుంది.



# ఇరువదొకటవ ప్రకరణము

ఇంతవరకూ నేను నా జీవితంలోని కొన్ని ఘట్టాలను గురించి వివరించాను. సాధారణంగా తక్కిన అందరూ చూడడంద్వారాను, వినడంద్వారాను సంపాదించిన జ్ఞానాన్ని నేను పుస్తకాలద్వారా ఏవిధంగా గ్రహించినదీ చెప్తాను. వాస్తవంగా నా విద్యాభ్యాసంలో పుస్తకాలే ఎక్కువభాగంతోడ్పడ్డాయి. అందుచేత నేను మొట్టమొదట చదువు ప్రారభించిన రోజుల దగ్గరనుంచి ప్రారంభిస్తాను.

1887వ సంవత్సరం మే మాసంలో నేను మొట్టమొదటి కథని వరుసగా చదువగలిగాను. అప్పుడు నావయస్సు ఏడు సంవత్సరాలు. అప్పటినుంచీ విజ్ఞానతృష్ణతో అలమటించే నా చేతివ్రేళ్ళకి తగిలిన అచ్చుపుట లన్నిటినీ నేను మ్రింగసాగాను ఆతొలిరోజులలో ఒకనియమానికి కట్టుబడిగానీ, ప్రతిదినమూ గాని నేను చదువలేదు.

మొట్టమొదట నేను చదవడానికి వీలుగా 'ఉబికినఅక్షరాలతో వుండే పుస్తకాలు వుండేవికావు. ప్రారంభ తరగతులకి పనికివచ్చే కొన్నివాచకములు, కథలపుస్తకములు, 'మన ప్రపంచం' అనే భూగోళపు పుస్తకం—ఇవే నాదగ్గరవుండేవి. వీటిని తిరిగితిరిగి ఎన్నోపర్యాయములు చదివాను. వాటిని

ఎన్నిసార్లు చదివినానంటే నా వ్రేళ్ళక్రింద అరిగిఅరిగి ఆ పుస్తకంలోని అక్షరాలు గుర్తుపట్టలేనంతగా అయిపోయాయి! ఒక్కొక్కప్పుడు మిస్. సల్లివాన్ తనకు తెలిసిన కథలు, పద్యాలు నా చేతిలో వ్రాసి చెప్పేది. కాని నాకు ఇష్టమైన వాటిని తిరిగితిరిగి నా అంతట నేనే చదువుకొనడానికి ఇష్టపడే దాన్ని.

నేను తొలిసారిగా బోస్టన్ వెళ్ళినప్పటినుండి అంత రాయం లేకుండా చదవడంప్రారంభించాను. ఇన్‌స్టిట్యూషన్‌కి చెందిన పుస్తకభాండాగారంలో ప్రతిరోజూ కొన్నిగంటలసేపు నేను గడపడానికి అనుమతింపబడింది. ఒకఅరనుంచి మరియొక అరకు వెళ్ళి నా వ్రేళ్ళకు వచ్చిన పుస్తకాన్ని నేను తీసుకొనే దాన్ని, ఆ పుస్తకాలలోవుండే ప్రతిపుటలోను పదింటికిఒకటో రెండో మాటలు మాత్రమే నాకు తెలిసేవి. ఆ కొద్దిమాటలే నాకు బ్రహ్మానందాన్ని కలిగించేవి. నేను చదివే విషయాన్ని గురించి తెలిసికొనాలనే పట్టింపు నాకు లేకపోయినా క్రొత్త క్రొత్త మాటలను నేర్చుకొనడంలోనే నేనుతృప్తిచెందేదాన్ని. నా జ్ఞాపకశక్తి ఎంత ఎక్కువగా ఉండేదంటే, నాకు మాటలాడడం చేతనయినప్పుడు నా భాషాజ్ఞానానికి నిజంగా నా స్నేహితులు ఆశ్చర్యపోయేవారు. ఆ రోజులలో నేను ఏఒక్క పుస్తకాన్నీ పూర్తిగా చదువకపోయినా అక్కడక్కడ చదివిన వాక్యాలు, పద్యాలు నాకు తరువాత ఎంతో ఉపయోగించాయి. నేను పూర్తిగా అర్థంచేసుకొంటూ చదివినమొదటి పుస్తకం 'లిటిల్ లార్డు ఫాంటిలే రాయ్' అనేది.

ఒకనాడు నేను లైబ్రరీలో ఒకమూల కూర్చొని

'ది స్కార్లెట్ లెటర్' పేజీలను తిరగవేస్తూండగా మా ఉపాధ్యాయిని చూచింది. అప్పుడు నా వయస్సు ఎనిమిది సంవత్సరాలు. ఆమె నన్ను కథానాయికకూతురైన 'పెరల్' నాకు నచ్చిందా అని అడిగి, నాకు తెలియని కొన్నిమాటలకు అర్థాలుకూడా చెప్పింది. అప్పుడు ఆమె తనదగ్గర 'ది స్కార్లెట్ లెటర్' కంటె ఎంతో బాగుండే కథ ఒకటుందనీ, దానిని వచ్చే వేసవిలో తప్పక చెప్తాననీ చెప్పింది. ఆ కథే 'లిటిల్ లార్డ్ ఫాంటిల్ రాయ్' – కాని సముద్రపుటొడ్డున అనేక చిత్రవిచిత్రాలనుచూస్తూ తక్కినవాటిని మరచిపోవడం చేతనూ, మిస్. సల్లివాన్ బోస్టన్‌లోవున్న తన స్నేహితులను చూడడానికి వెళ్ళడంచేతనూ ఈ కథని ఆగస్టునెలవరకూ ప్రారంభించడానికి వీలులేకపోయింది.

ఆమె తిరిగి రాగానే మేముచేసిన మొదటిపని 'లిటిల్ లార్డు ఫాంటిల్ రాయ్'ని ప్రారభించడం. ఈ పిల్లల కథని ప్రారంభించడం నాకు బాగా జ్ఞాపకంవుంది. మా ఇంటికి దగ్గరగావున్న రెండు దేవదారుచెట్లకి దళమైన గుడ్డతో కట్టిన ఉయ్యాలలో మే మిద్దరం కూర్చొని కథని ప్రారంభించాం. దేవదారు చెట్ల ఆకులమధ్యనుంచి సూర్యకిరణాలు మామీద పడుతూండగా వెచ్చగా ఏంతో హాయిగావుంది. ఆనాడు మా భోజనాలు త్వరగా ముగించుకొని, పాత్రలు తొందరగాకడిగి, వడివడిగా మా ఉయ్యాలదగ్గరికి బయలుదేరాం. పొడుగుగా పెరిగిన గడ్డిమధ్యనుంచి నడచి వెళుతూండగా, గొల్లభామలు మాచుట్టూ మూగి, మా బట్టలమీద కరచిపట్టుకొని కూర్చు న్నాయి! వీటిని తీసివేయకపోతే గుచ్చుకొంటాయని మిస్.

సల్లివాన్ చెప్పడంవల్ల, మరికొంతసేపు ఈవిధంగా వ్యర్థమైంది ఒక్క నిమిషంకూడా వ్యర్థంకావడం నా కిష్టంలేదు. చాలా రోజులుగా మా ఉపాధ్యాయిని లేకపోవడంవల్ల ఉయ్యాలనిండా దేవదారుముళ్ళు పడివున్నాయి. వాటిని శుభ్రంచేసి,కూర్చొని కథ ప్రారంభించాం. దూరంనుండి వచ్చే సముద్రపుగాలితో దేవదారు పరిమళాలు కలసి హాయిగా గాలివీచుతూంది. నాకు తెలియని మాటలకు అర్థం చెప్తూ మిస్. సల్లివాన్ కథ ప్రారంభించిన కొంతసేపటివరకూ పెళ్ళివారినడకతో కథ సాగింది. కాని త్వరలోనే నాకు పరిచయమైన అనేక వాక్యాలకి వ్యాఖ్యానం అవసరం లేకుండానే ముందుకి సాగిపోయాం. కాని కొంతసేపటికి మిస్. సల్లివాన్ వ్రేళ్ళు అలసిపోవడంతో ఆపుస్తకాన్ని నాచేతులతో పుచ్చుకొని ప్రతిపంక్తిని ఆసక్తితో తడవడం ప్రారంభించాను. ఈవిధంగా మధ్యలో కథ ఆగిపోవడంతో నా జీవితంలో మొట్టమొదటిసారిగా భగవంతుడు కలిగించిన నా అవకరానికి ఎంతో బాధపడ్డాను.

ఆ తరువాత నాకోరికను మన్నించి మిస్టర్. అనాగ్నస్ ఈ కథని 'ఎత్తుఅక్షరాలలో' అచ్చువేయించి నాకుఇచ్చారు. అప్పుడు నాకు కంఠస్థంగావచ్చేవరకూ ఎన్నోపర్యాయములు ఈ కథని నేను చదివాను. నా బాల్యంలో 'లిటిల్ లార్డ్ ఫాంటెల్ రాయ్' నాకు 'ఎడబాటుకాని చెలికాడు' అయింది!- అక్కడక్కడ మాటలనుమాత్రమే గుర్తింపగలిగే నామొదటి పాఠాలకీ, వరుసగా ఒకకథరూపంలో చదివిన ఈ ఘట్టానికీ భేదాన్ని స్పష్టంగా తెలియజేయడానికే ఇంత విపులంగా వివరించాను.

'లిటిల్ లార్డు ఫాంటిల్ రాయ్'తో నాకు పుస్తకాల మీాద నిజమైన అభిమానం ఏర్పడింది. ఆ తరువాత రెండు సంవత్సరాలలోనూ మా ఇంటికిదగ్గర, బోస్టన్‌లోనూ, నేను ఎన్నోపుస్తకాలు చదివాను. నేను చదివిన పుస్తకాలన్నీకాని, వాటిని చదివిన క్రమంగాని నాకు జ్ఞాపకం లేకపోయినా ఈ క్రిందిపుస్తకాలు జ్ఞాపకంవున్నాయి—ఛార్లెస్ కింగ్సులే వ్రాసిన 'గ్రీక్ హీరోస్', లాఫాన్ టైన్ వ్రాసిన 'జంతువులకథలు, హాథార్న్ వ్రాసిన 'వండర్ బుక్'; 'బైబిలు కథలు' లాంబ్ 'షేక్స్పియర్ కథలు', డికెన్సువ్రాసిన 'ఇంగ్లండుదేశపుచరిత్ర' 'అరేబియన్ నైట్సు', 'స్విస్ ఫేమిలీ రోబిన్సన్', 'పిల్గ్రిమ్స ప్రోగ్రెస్' 'రాబిన్సన్ క్రూసో' 'లిటిల్ వుమన్' 'హెయిడీ' అనే చక్కని జర్మన్ కథ. ఈ పుస్తకాలను వ్యాఖ్యానసహితంగా కాకపోయినా నా ఆనందంకోసం విరామసమయంలో చదివాను. వీటిని వ్రాసిన గ్రంథకర్తలనుగూర్చిగాని, వాటి శయ్యనుగూర్చి కాని నేనంతగా పట్టించుకోలేదు. అప్రయత్నంగా లభించే సూర్యరశ్మినీ, స్నేహితుల ప్రేమనీ ఏవిధంగా ఆస్వాదించానో, ఆవిధంగానే వీటి అమూల్యమైన భావాలని, సౌందర్యాన్ని గ్రహించాను. అవి నా హృదయానికి ఒక అనిర్వచనీయమైన ఆనందాన్నిచ్చాయి. 'లిటిల్ వుమన్' చదవడంద్వారా, వినగలిగే, చూడగలిగే బాలికలతో స్నేహభావం అలవడింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఇతరులతో సంబంధంలేని అంధప్రపంచంలో వున్న నాకు బాహ్యప్రపంచ వార్తలన్నీ ఈ పుస్తకాలద్వారానే లభించాయి. లా ఫాంటైన్ కథలలో జంతువులచేత నీతిని చెప్పించే విధానం నా

కెందుచేతనో నచ్చలేదు. మనుష్యుడు తనవితాను ప్రేమించు కొనడంద్వారానే నీతిమార్గాన్ని అవలంభింపగలుగుతాడనే లా ఫాంటైన్ అభిప్రాయంతో నేను ఏకీభవించలేను. 'అన్ని చెడుగులకీ మూలం మానవుడు తననుతాను ప్రేమించుకొనడమే' అని నా అభిప్రాయం. బహుశా ఈవిషయంలో మనుష్యుల తత్త్వాన్ని నాకంటె బాగా అవగాహన చేసుకొనే అవకాశం గల లా ఫాంటైన్ అభిప్రాయమే సరియైనదికావచ్చు— హేళనపూర్వకంగా సంఘదురాచారాలను దూషిస్తూ, కోతుల చేత, నక్కలచేత ఆయన పలికించిన యథార్థాలకిమాత్రం నా అభ్యంతరం ఏమీలేదు.

కాని, 'ది జంగిల్ బుక్' 'వైల్డ్ యానిమల్స్ ఐ హేవ్ నోన్' అనే పుస్తకాలు నాకు బాగా నచ్చినాయి.

గ్రీస్‌కి సంబంధించిన ప్రాచీనగాథలు చదువుతూంటే ఆ యా ప్రాంతాలతో నేనుకలసి తిరుగుతూన్నట్లనిపించింది. కాని, ఒక్కవిషయంమాత్రం నాకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. "భగవంతుడు వీరిని పాపాలుచేయనిచ్చి, ఆ తరువాత వారిని ఎందుకు శిక్షిస్తాడు?" ఈ సమస్య నాకు ఈనాటికీ పరిష్కారం కాలేదు. 'ఇలియడ్' ద్వారా గ్రీస్ స్వర్గసౌందర్యాన్ని నేను చూడగలిగాను. ఇలియడ్‌లోని రమణీయమైన కొన్ని కొన్ని వాక్యాలు చదువుతూంటే నా పరిసరాలను మరచి, ఒక అనిర్వచనీయమైన ఆనందంతో మహోన్నత స్వర్గపథానికి తేలిపోతూవుంటాను — అధ్యాపకులు తమ వ్యాఖ్యానాలతో వీటిని కొలవడం వా రెంత విజ్ఞానవేత్తలైనా సమంజసంకాదని నాకుతోచింది. తరువాత వర్జిల్ రచించిన 'ఈనీడ్' కావ్యాన్ని

చదివాను. వర్జిల్ ప్రకృతివర్ణనలు కుంచెతో తీర్చిదిద్దినట్లుంటాయి. చంద్రుని వెన్నెలలో మెరిసే సూర్యదేవుని పాలరాతి విగ్రహంలా కనుపించుతాడు. స్వచ్ఛంగా నాకు వర్జిల్ హోమర్ సూర్యకాంతులలో ధగ ధగ మెరిసే యౌవ్వనం మూర్తీభవించిన ప్రతిమలా కనుపించుతాడు గాలికి పైకిలేచిన జుట్టుతో !

నేను వ్యాకరణాల చుట్టుదారులను, నిఘంటువుల అడ్డుగోడలను, పరీక్షల గోతులను దాటి వచ్చేలోపున అనేక పర్యాయములు భూప్రదక్షిణం చేసిరాగలిగేటంత కాలం పట్టింది. ఒకటితర్వాత ఒకటిగా ఎదుర్కొన్న ఈ నా కష్టాలు వృధాకాలేదనే చెప్పవచ్చును.

మొట్టమొదట అర్థం తెలియకుండానే నేను బైబిల్ ఎన్నోసార్లు చదివాను. కాని దీనిలోని కథలకంటె గ్రీక్ కథలే నాకు బాగున్నట్లు తోచినాయి. గ్రీక్ కథలంటే నా కీ పక్షపాతం బహుశా నేను బోస్టన్‌లో వుండగా అనేకమంది గ్రీక్ దేశస్థులను కలసికొనడం, వారిదేశపు కథలయెడల వారి అమితోత్సాహాన్ని ప్రత్యక్షంగా చూడడమే అయివుంటుంది! కాని బైబిల్‌లోవున్న అనేక మహత్తరవిషయాలను ఆ తరువాతనే కనుగొనగలిగాను. ఇప్పుడు బైబిల్‌ని ప్రేమించినంతగా ఏ ఇతరపుస్తకాన్ని ప్రేమించలేను. 'మనకండ్లకి అగోచరమైనవి శాశ్వతమైనవనీ, మనకి ప్రత్యక్షంగా కనుపించేవన్నీ ఒకనాడు నశించుతాయనీ' నేను బైబిల్ ద్వారానే తెలిసికొన్నాను. ఈస్తర్, రూత్ కథలను చదివి వాటిలోని అనేక విషయాలకు ముగ్ధురాలనయ్యాను.

మాత్ స్వార్థరాహిత్యం మనమున్న ఈ చీకటిప్రపంచానికి ధృవతారలా నాకు తోచింది. ఆవిధమైన ప్రేమను అలవరచుకొన్నప్పుడే స్పర్థలతో, ద్వేషాలతోకూడిన దుర్భర జీవితాలను విడనాడి ఉన్నతాదర్శసీమలకి చేరుకోనగలుగుతాం.

షేక్స్పియర్ రచనలు నాకు ఎప్పుడూ అభిమాన విషయాలే. లాంబ్ వ్రాసిన 'టేల్స్ ఫ్రమ్ షేక్స్పియర్' నేను నా చిన్నతనంలో చదివాను. అన్నిటిలో నాకు 'మేక్‌బెత్' ఎంతో బాగుంది. ఒక్కసారి చదవగానే ప్రతి పాత్ర నా మనస్సుకి పట్టిపోయింది. చాలరోజులవరకూ ఆ కథలోని దయ్యాలు నాకు కలలో ప్రత్యక్షమయేవి — తెల్లని మేక్‌బెత్ భార్యచేతిని, ఖడ్గాన్ని, ఆ భయంకరమైన రక్తపు మరకనీ — ఈనాటికీ నేను కండ్లకుకట్టినట్లు చూడగలను! 'మేక్ బెత్' చదివినతరువాత నేను 'కింగ్ లియర్' చదివాను. అందులోని భయానకదృశ్యాలను చదువుతూంటే నా వ్రేళ్ళు అక్షరాలమీద కదలక నిలిచిపోయేవి. 'గ్లాసెస్టర్' కండ్లు పొడిచినఘట్టం చదివినప్పుడు నా హృదయం కోపంతో, ద్వేషంతో నిండిపోయింది.

షేక్స్పియర్ నాటకాలలోని షైలాక్ లాంటి దుష్టపాత్రలను తలచుకొన్నప్పుడు నా కెందుచేతనో విచారం, సానుభూతి కలుగుతుంది. ఈనాటికికూడా ఆ పాత్రలను నేను గర్హించలేను. అదృష్టచక్రంలో ఆ పాత్రలు విరిగిపోయిన ఆకులవలె కనుపించుతాయి. షేక్స్పియర్ సుఖాంతనాటకాలకంటె, దుఃఖాంతనాటకాలే నా హృదయానికి బాగా పట్టి

పోయాయి. బహుశా సంతోషానికి, ఉల్లాసమయ జీవితానికి అలవాటుపడిన నా బాల్యం ఈ సుఖాంతనాటకాలని అంతగా హర్షించలేకపోయిందేమో! 'పిల్లలమనస్సు అంత చంచల మైనది, ఏ విషయాలను అది జ్ఞాపకంవుంచుకుంటుందో, దేనిని మరచిపోతుందో తెలిసికోనడం కష్టం!

అప్పటినుంచీ నేను అనేకపర్యాయములు షేక్స్పియర్ నాటకాలను చదివాను. వాటిలో అనేక పంక్తులు నాకు కంఠస్థంగాకూడా వచ్చును. వాటిలో నాకు ఏవి ఎక్కువగా వచ్చినాయో చెప్పడంకూడా కష్టమే. నా మనోభావాలు ఎన్నివిధాలుగా వుంటాయో, వాటియందుండే నా అభిరుచి కూడా అన్నివిధాలుగా వుంటూంటుంది. షేక్స్పియర్ యెడల నాకుండే గౌరవభావంతో ఒక్కవిషయం చెప్పదలచుకొన్నాను. 'ఆయనరచనలపై వచ్చిన విమర్శలు, వ్యాఖ్యానాలు నన్ను విసిగించినంతగా మరియేవీ నన్ను విసిగించలేదు. అందుచేతనే ఏ వ్యాఖ్యానాలనీ చదువరాదని రహస్యంగా నాలో నేనే ఒక నిశ్చయంచేసుకొన్నాను. కాని ఈ నియమానికి విరుద్ధముగా ఒక్క ప్రొఫెసర్. క్రిట్జ్ విషయంలో నడచుకొన్నాను. షేక్స్పియర్ రచనలకు ఆవరించియున్న తెరలను ఒకొక్కటిగా ఆయన సడలించి, అందలి రామణీయకతనీ, మనోహర భావాలనీ నాకు సాక్షాత్కరింపజేశారు.

నా అభిమానవిషయాలలో తరువాతిది చరిత్ర. నాకు దొరికినంతమట్టుకు వివిధదేశ చరిత్రలను చదివాను. నా పద మూడవ పుట్టినరోజుపండుగకు బహుమతిగా వచ్చిన స్వింటన్ 'ప్రపంచచరిత్ర' నా కెంతగానో తోడ్పడింది. ఈ పుస్తకం

ద్వారానే వివిధజాతుల ప్రజలు ఏ విధంగా ఒక ప్రదేశా న్నుంచి మరియొక ప్రదేశానికి వలసవెళ్ళారో, మహానగరా లను ఏవిధంగా నిర్మించారో, కొద్దిమంది పరిపాలకులు విశాల భూభాగాలను పాదాక్రాంతంచేసికొని, ప్రజలని పీడించేవారో; మహాసామ్రాజ్యాలు పతనంచెందాయో, మానవ నాగరికత అధఃపాతాళానికిపోయి, తిరిగి వృద్ధిచెందినదో, స్వాతంత్ర్యం, సహనం, విద్యావ్యాప్తిద్వారా యావత్ప్రపంచానికీ ముక్తి లభించిందో — ఈ విషయాలన్నిటినీ తెలిసికొనగలిగాను.

నా కళాశాలవిద్యాభ్యాసంద్వారా ఫ్రెంచి, జర్మన్ సాహిత్యాలతో పరిచయంకలిగింది. ఒక్క జర్మన్‌సాహి త్యంలో 'స్త్రీయొక్క నిస్స్వార్థ ప్రేమ' అత్యంత రమణీయంగా చిత్రింపబడింది. నేనుచదివిన ఫ్రెంచ్ రచయితలలో మోలి యర్, రేసీన్‌లు నాఅభిమాన రచయితలు. బెల్జాక్, మెరిమీ, రచనలు సూటిగా హృదయానికి గ్రుచ్చుకుపోతాయి — ఆల్ఫ్రెడ్ డి. ముస్సెట్‌ని అర్థంచేసుకొనడం అసంభవం! విక్టర్ హ్యూగో అంటే నాకొక ప్రత్యేక గౌరవం. విక్టర్ హ్యూగో, గోథే, షిల్లర్ మొదలైన ప్రపంచ మహాకవులు తమ రచనలలో వ్యక్తంచేసిన నిత్యసత్యాలను తలచుకొంటే నా మనస్సు వినమ్రభావంతో వారికి నమస్కరించి, సత్యానికీ, మంచితనానికీ, రామణీయకతకీ ఆలవాలమైన మహాప్రపం చానికి నన్ను కొనిపోతుంది!

నా పుస్తకమిత్రులనుగురించి బహుశా ఎక్కువగా వ్రాశానేమో. అయినా నేను ఎక్కువగా ఇష్టపడేరచయిత లనుగురించి మాత్రమే వ్రాశాను. దీనినిబట్టి నా స్నేహితులు

చాలా తక్కువమందిఅనీ, ప్రజాస్వామ్య విరుద్ధభావాలు గలదానిననీ ఎవరైనా అనుకుంటే వారు చాలా పొరపాటు పడుతున్నారనిమాత్రం చెప్పగలను. నాకు అనేక రచయితలపై అనేక కారణాలవల్ల ప్రత్యేకాభిమానంవుంది — సంఘంలో వుండే మోసాన్ని నిర్మొహమాటంగా బట్టబయలుచేసే కార్లైల్, ప్రకృతికీ, పురుషునికీవున్న అవినాభావసంబంధాన్ని వ్యక్తంచేసే వర్డ్స్‌వర్త్, హాస్యాన్ని చిందించే హుడ్, కలువ, గులాబీ పరిమళాలని సుస్పష్టంగా వ్యక్తంచేసే పద్యాలను వ్రాసిన హెర్రిక్ — వీరంతా నా అభిమాన రచయితలే. విట్టియర్ ఉత్సాహం, నిజాయితీ అసమానం. ఈయనతోగల నా పరిచయం ఈయనపద్యాలు చదువుతూంటే మరింత ఉత్సాహాన్నిస్తుంది — మార్క్ ట్వెయిన్ అంటే నా కెంతో ఇష్టం — ఎవరికి ఇష్టంకాదు? భగవంతుడే ఆయన్ని ప్రేమించి, అతని మనస్సుని ఇంద్రధనస్సులోవుండే వివిధవర్ణాలతో నింపి, నిరాశావాదిగా మారకుండా మళ్ళించాడు! స్కాట్ రచన లోని తీవ్రత, నిజాయితీ, స్వచ్ఛత నాకు నచ్చాయి — ఒక్క మాటలో చెప్పాలంటే మంచినీ, ఆనందాన్నీ, సానుభూతినీ, దయనీ, ఆశావాదాన్నీ తమ రచనలలో వ్యక్తంచేసిన ప్రతి రచయిత నా అభిమాన రచయితే!

సారస్వతమే నేను నిర్మించుకున్న ఆదర్శస్వర్గం. ఇక్కడ నాకు ఏ అవరోధలూ లేవు. ఇక్కడ నా పుస్తక మిత్రులు నన్నెంతో ఆప్యాయంగా పలుకరించి, తమదగ్గరకి తీసుకుంటారు. ఇక్కడ నాకులభించిన వాత్సల్యం, వితరణం — వీటితో నా చదువునికాని, నాకు నేర్పిన పాఠాలనుకాని పోల్చిచూస్తే హస్తిమశకాంతరంవుంటుంది!

# ఇరువదిరెండవ ప్రకరణము

ఇంతకుముందు నేను వ్రాసినదానినిబట్టి ఒక్క పుస్తకాలే నా ప్రధాన వినోదమని మా పాఠకులు భావించరాదని నా మనవి. వినోదాల విషయంలో నా అభిరుచి బహుముఖమైనదనీ ఈ ప్రకరణములో గ్రహింపగలరు.

రమణీయమైన పల్లెసీమలగురించి, ఆరుబయట నా ఆటలనుగురించి ఇదివరలో చెప్పేవున్నాను. బాగా చిన్నతనంలోనే నేను ఈత, పడవనడపడం నేర్చుకొన్నాను. నన్ను చూడడానికి వచ్చిన స్నేహితులను నాతో పడవమీద షికారుకి తీసుకుపోవడం నాకెంతో సరదా, నేను అంత బాగా చుక్కాని పట్టలేకపోయినా, నాతోవచ్చిన ఎవరో ఒకరు వెనుకకూర్చొని చుక్కాని పట్టుతూండేవారు. నేను సాధారణంగా చుక్కాని లేకుండగానే పడవ నడుపుతూండేదానను. నీటిలోవుండే నాచు మొక్కల, కలువల సువాసననిబట్టి పడవనడపడం నాకెంతో ఉత్సాహాన్నిచ్చేది. తోలుపట్టీలు వేసిన తెడ్లను ఉపయోగించడంచేత అవి కొక్కేలనుండి జారిపోకుండావుండేవి. నీటి ఒత్తిడినిబట్టి తెడ్లు సరిసమానంగా ఎప్పుడువున్నదీ, ప్రవాహానికి ఎదురుగా వెళుతూన్నదీ, వాలుగా వెళుతూన్నదీ నాకు తెలిసేది.

దోనెపైన నీటిప్రయాణం నాకెంతో సరదా. ముఖ్యంగా వెన్నెలరాత్రులలో నా కిది మరింత ఉల్లాసంగా వుంటుందని చెప్తే మీరు నవ్వరనుకుంటాను. అవును! దేవదారువృక్షాల వెనుకనుంచి క్రమంగా ఆకాశంపైకి ఎక్కివచ్చి, ఆ స్వర్గసీమలకు తేలిపోతూ, వెలుగుదారిని చూపించే చంద్రుడు నాకు కనుపించకపోయినా అక్కడేవున్నాడు! నేను నా తలగడ మీద ఆనుకొని వెల్లకిలా పండుకొని, నా వ్రేళ్ళను నీటిలోపల వుంచినప్పుడు కలిగే ఆ మిలమిలలు నాకు కనుపించుతూనే వుండేవి! ఒక్కొక్కప్పుడు నా వ్రేళ్ళ సందునుంచి, చిన్న చిన్న చేపలు కొంటెగా జారిపోతూండేవి. ఒకొక్కప్పుడు మెత్తని కలువపూలు నా చేతిని ఒత్తుతూండేవి. ఒకొక్కప్పుడు నా మనస్సులో వెలుతురునిచ్చే వెచ్చదనం నాకు హాయిని కలిగిస్తూండేది. గాలిలోని ఈ వెచ్చదనం సూర్యరశ్మికి వేడెక్కిన చెట్లనుంచే వస్తుందో, నీటిపైనుంచేవస్తుందో కనిపెట్టలేకుంటిని. జనసమ్మర్దము గల నగరాలమధ్యకూడా నాకీ అనుభూతే కలిగింది. చల్లని తుపాను రేగిన రాత్రులలో ఆ గాలికి వెచ్చని పెదిమలు నానుదుటిమీద ముద్దుపెట్టుకుంటూన్నట్లు అనిపించేది.

1901 వ సంవత్సరపు వేసవిలో నోవస్కోషియా వెళ్ళాము. 'లాంగ్ ఫెలో' వర్ణించిన ఈసముద్రతీరంలో కొన్ని రోజులు గడపి, మిస్. సల్లివాన్, నేనూ హాలిఫాక్సు వెళ్ళి అక్కడ వేసవిలో చాలరోజులు గడపినాము. అక్కడి నౌకాశ్రయంలో వందలకొలది తెరచాపలతోవున్న నావల మనోహరదృశ్యం ఎన్నటికీ మరపురాదు. ఒకనాడు తెరచాపలనెత్తి

అనేకనావలు పోటీ చేస్తుండగా దానిని చూడడానికి వెళ్ళాం. ఆరంభములో ఆకాశం నిర్మలంగా వుంది. పోటీఅయి తిరిగి తీరమునకు వస్తూండగా దూరాన ఒక నల్లటిదేదో కనుపించి, క్రమంగా ఆకసమంతా మబ్బులతో నిండిపోయింది. గాలి కూడా ప్రారంభించింది. కెరటాలు నురుగులు గ్రక్కుతూ మమ్మల్ని చుట్టుముట్టాయి. అయినా మా నావనినడపే నావికుడు సముద్రయానంలో ఆరితేరినదిట్ట. అతనిపైన మాకు పూర్ణవిశ్వాసం వుంది, భయంకరమైన ఆ సముద్ర తరంగాల మధ్యనుండి మమ్మల్ని తీరానికి చేర్చగలిగాడు. మా నావ ఒడ్డుకి చేరుకుంటూండగా, నౌకాశ్రయములో ఓడలపైవున్న వందలకొలది నావికులు హర్షధ్వానాలు చేస్తూ, తీరానికిచేరుకొన్న మా నావని, మమ్మల్ని అభినందించారు!

న్యూ ఇంగ్లండులోవున్న రెంథామ్‌లో జె.ఇ. ఛాంబర్లిన్ దంపతులతో నేను ఎన్నోరోజులు గడపినాను. ఆ దంపతులకు నాయెడల అపారమైనప్రేమ, వారిపిల్లలకి కథలు చెప్తూ, వారితో ఆడుకుంటూ గడపినరోజులు ఎన్నటికీ మరపురావు. మిస్టర్. ఛాంబర్లిన్ నాకు రకరకాల చెట్లనుగురించీ, అడవి పూలనుగురించీ ఎన్నోవిషయాలు చెప్పి, వాటిని ప్రత్యక్షంగా నాకు చూపించారు; ఆఖరికి సింధూరవృక్షాల వేరడుక్రింద ప్రవహించే 'జీవరసాన్ని' నిశ్శబ్దంగా నేను వినగలిగాను! దీని ద్వారానే "చీకటిలో కప్పబడిన చెట్లవ్రేళ్ళుకూడా, ఎండలో తళతళమెరిసే చెట్ల ఆకుల, పరిమళాలనువెదజల్లే రంగురంగుల పువ్వుల, పండ్ల మాధుర్యాన్ని, ప్రకృతిద్వారా పంచుకొన గలుగుతూన్నా" యనే పరమ సత్యాన్ని నేను గ్రహింపగలి

గాను. మానవకోటి పుట్టుకనుంచీ, తరతరాలుగా పొందిన అనుభూతినీ' హృదయపరివర్తనాన్ని అర్థంచేసుకొనేశక్తి సహజంగా ప్రతివ్యక్తిలోనూ పుట్టుకతోనే వుంటుందని నా అభిప్రాయం — సువిశాలమైన భూమిపైన వుండే పచ్చికరంగునీ, గలగల ప్రవహించే నీటి ధ్వనిని, ప్రతిఒక్కరి మనస్సు తరతరాల అనుభవంద్వారా గ్రహింపగలిగి వుంటుందనీ, అంధత్వము, బధిరత్వము, ఈ దివ్యశక్తిని అడ్డలేవనీ, ఈవిధమైన 'ఆరవశక్తి' భగవంతుడు ప్రతి ఒక్కరికీ ఇచ్చివున్నాడనీ నేను గ్రహింపగలిగాను. ఈ శక్తికిని చూడగలిగే, వినగలిగే, స్పర్శింపగలిగే సామర్థ్యంవుంది! రెంథామ్‌లోవున్న వృక్షాలలో నాకు స్నేహితులెన్నో వున్నాయి. ఇందులో ఒక పురాతన దేవదారువృక్షాన్ని చూచి నేను గర్వించుతూంటాను. దీని వయసు ఎనిమిదివందల సంవత్సరాలో, పదివందల సంవత్సరాలో అని నాకు తెలిసినప్పుడు నా హృదయం విస్మయ సంతోషాలతో ఉప్పొంగిపోయింది; రెండవది 'రెడ్‌ఫారంలో' ఇంటికి దగ్గరగావుండే నిమ్మచెట్టు, ఒకనాడు పెద్దగాలివానలో హోరుపెట్టుకుంటూ కూలిపోయి నేలమీద సాష్టాంగపడి వుంది. అనేక సంవత్సరాలుగా గాలివానలకు తట్టుకొని, నిలచివున్న ఈ చెట్టు ధైర్యంతో పోరాడి, రణరంగంలో చనిపోయి సాగిలపడివున్న వీరునిలా ఇప్పుడు పడివుండటం నాకొక విచిత్రానుభూతిని కలిగించింది.

నా పరీక్షలవగానే వేసవిసెలవులను రెంథామ్‌లో గడపడానికి మిస్. సల్లివాన్ నేనూ వచ్చాము. పట్టణాల రణగొణధ్వనీ, కళాశాల పాఠాలు, అన్నిటినీమరచి, పచ్చపచ్చనిపొలా

లలో, చెట్లనీడలలో హాయిగా గడిపాం. ఎక్కడో జరిగే యుద్ధం (1904_'05 లో జపాన్‌కీ రష్యాకీ యుద్ధం జరిగింది) తిరుగుబాటులు, సంధులు - ఇవేవీ మాకు ముఖ్యంఅనిపించ లేదు. ఇవేవీ శాశ్వతం కాదనీ, సరస్సులు, పచ్చికబయళ్ళు, నక్షత్రాల పువ్వుల ఆకాశపు చాందినీ - ఇవే మనస్సుకిశాంతి నిచ్చే శాశ్వత ప్రకృతి చిహ్నాలనీ నాకనిపించింది.

మనచుట్టూవుండే వాటిని కళ్ళద్వారాను, చెవుల ద్వారానే తెలిసికొనగలుగుతా మనుకొనేవారు పట్టణాలకీ, పల్లెలకీ తేడా మనుష్యులు నడచివెళ్ళడానికి ప్రత్యేకంగారోడ్డుకి ప్రక్కగా కాలిదారివుండకపోవడం తప్ప మరేదైనా నాకు కనిపించుతూందా అని ప్రశ్నించారు. నాచుట్టూజరిగే ప్రతి చిన్నవిషయం నా శరీరం కనిపెట్టగలుగుతుం దనే విషయాన్ని వారు గమనించలేకపోతూన్నారు. పట్టణంలోని రణగొణధ్వనీ ఎముకల్ని కొరికే యంత్రాల చప్పుడూ నాముఖంమీదవుండే నరాలని కొరుకుతూ వుంటాయి. రాయిలావుండే రోడ్లమీద దొర్లుతూ వెళ్ళే యంత్రాల చప్పుడు ఎంత బాధనికలిగిస్తుందో చెప్పలేను. ఆ వీధులలో వుండే జనసమ్మర్దాన్ని చూడలేని నాబోటివారికి ఈ చప్పుడు మరింత బాధాకరంగావుంటుంది.

కాని పల్లెసీమల ప్రకృతి మనోహరదృశ్యాలు మనల నెంతో ఆప్యాయంతో పిలుస్తాయి. దైనందిన జీవితావసర వస్తువులకోసం పెనగులాడే జనంతో క్రిక్కిరిసిన పట్టణాలకీ, పల్లెలకీ ఎంతభేదంవుందీ ! పట్టణంలో వున్నప్పుడు సూర్యరశ్మి కూడా చొరని ఇరుకుసందులలో పందులవలె జీవితాన్నిగడపే నిరుపేదల నివాసాలనీ, ఆ భయంకర వాతావరణాన్నీ నేను

చూచాను. ధనవంతులు మరింత ధనాన్ని సంపాదిస్తూ, ఆరోగ్యకరమైన, పుష్టికరమైన ఆహారాన్ని తింటూ, విశాలమైన భవనాలలో నివసిస్తూ, సరిపడీ, సరిపడని తిండితో, చినిగిన గుడ్డలతో, దుర్భరజీవితాన్ని గడపే నిర్భాగ్యులచేత పనులు చేయించుకుంటూ, వారినీ, వారి పిల్లల పిల్లల్నీ దారుణ దారిద్ర్యకూపంలో పడద్రోసే వీరితత్వాన్ని చూస్తే నాకు కడుపు దహించుకుపోతూంటుంది. వారుపడేశ్రమకీ, వారికి కలిగే అవకాశాలకీ ఎంత అంతరాయంవుంది! సూర్యకాంతి, గాలి, భగవంతుడు అందరికీ సమానంగాఇచ్చిన ప్రకృతి సౌకర్యాలు. కాని ఇది నిజంగా జరుగుతూందా? నిరంతరం అంధకార కూపాలలో దుర్గంధభూయిష్టమైన వాతావరణంలో వీరు నిజంగా మానవజీవితాన్ని గడుపుతున్నారా? "ఓ సభ్యమానవుడా! నీవు ఈ దుర్భరజీవితాలనిగడపే అనాధుల్ని చూడలేదూ? ఇదంతా చూస్తూకూడా చూడనట్లు "భగవంతుడా ఈరోజు నా తిండికి ఆహారాన్ని ప్రసాదించు!" అని నిశ్చలహృదయంతో ప్రార్థనచేయగలవా? నీ తోటిసోదరుని పరిస్థితినిచూచి సహించగలవా? నిరంతరం పొంగిపొరలే ధనరాసులమధ్య తిండికికూడా నోచుకోని ఈ నిర్భాగ్యులు పచ్చ పచ్చని పొలాలకి, పల్లెసీమలకివచ్చి హాయిగా పని చేసుకొనేభాగ్యం ఎప్పుడో కదా! అప్పుడేకదా వీరి పిల్లలు పంచనితలలతో విరాజిల్లే మహావృక్షాల్లా పెరిగి, తీయని ఆలోచనలనే పూలతావుల్ని వెదజల్లుతారు! ఒక్క సంవత్సరంపాటు పట్టణవాతావరణంలో గడపిన నాకు ఈ ఆలోచనలు జ్ఞప్తికిరాకమానవు!

పట్టుపరుపులవలెవుండే పచ్చని పచ్చిక దారుల్లలో నడచివెళ్ళడం, సెలయేటి నీటిప్రవాహాల చన్నీటిలో నా వ్రేళ్ళనిముంచడం, చుట్టూవున్న రాతిగోడనిదాటి నిలువెత్తున పెరిగిన చేలలోపలికిదుమికి దానిలో మాయమవడం — ఇదంతా ఒక్క పల్లెజీవనానికే చెల్లు!

తరువాత రివ్వునవీచేగాలిలో నా సైకిలుతొక్కుతూ, నా 'ఇనుపగుర్రం' వేగంగాపోతూంటే నా ముఖానికితగిలే చల్లనిగాలికి ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయేదాన్ని; ఈ విధంగా సైకిలు ప్రయాణంచేశాక ఒకవిధమైన నూతనోత్సాహంతో నా హృదయం ఉప్పొంగిపోయింది.

నేను చాలాదూరం నడచివెళ్ళినప్పుడూ, సైకిలు తొక్కుతూ వెళ్ళేటప్పుడూ నాతో నా కుక్కకూడా వచ్చేది. నాతో ఎన్నో కుక్కలు స్నేహముగా వుండేవి. నా హద్దులను బాగాతెలిసిన నా కుక్కలు నేను ఒంటరిగావున్నప్పుడు ఎప్పుడూ నన్ను కాచుకొనివుండేవి. అవి తోక ఆడిస్తూ, నామీదచూపే ప్రేమకి నేను మురిసిపోతూంటాను.

వర్షంగా వున్నప్పుడు కుట్టుపనో, లేకపోతే స్నేహితులతో చదరంగం ఆడుకొనడమో చేసేదాన్ని. నాకు ఒక ప్రత్యేకమైన చదరంగపుబల్ల వుంది. దాని గళ్ళు లోతుగా చెక్కబడి బలగం పడిపోకుండా స్థిరంగా నిలబడివుండటానికి ఏర్పాటువుంది. నల్లబలగానికి పైభాగం చదునుగాను, తెల్లబలగానికి పైభాగం వంపుతిరిగి వుండటంచేత నేను వ్రేళ్ళతో వాటిని సులభముగా అర్థంచేసికొనగలను. చదరంగపుబలానికి ప్రతిఒక్కదానికీ మధ్యలో ఒక కన్నంవుంటుంది. దానిలో

ఇత్తడి గుబ్బను పెట్టడంద్వారా తక్కిన బలగాన్నీ, రాజునీ వేరువేరుగా తెలిసికొనేదాన్ని తెల్లబలగం నల్లబలగంకంటె పెద్దవిగా ఉండటంచేత రెండింటినీ వేరువేరుగా తెలిసికొనేదాన్ని, నా ప్రతిపక్షి బలగంపైన నాచేతిని ఉంచడంద్వారా అతను వేసిన ఎత్తులను తెలిసికొని నా ఎత్తులను నేను వేసేదాన్ని. ఒకగడినుంచి మరొకగడికి ఎదిరిపక్షంవారు బలగాన్ని కదిపేధ్వనివల్ల ఇప్పుడు ఎత్తువేయడం నావంతు అని గ్రహించేదాన్ని!

నేను ఒంటరిగా ఏమీ తోచకుండా వున్నప్పుడు నేనొక్కతెను పేకాట ఆడుకొనేదాన్ని! నాకు ఈ రకపుఆట ఎంతోఇష్టం నేను ఆడుకొనే పేకముక్కలకు పైగా కుడిమూలను బ్రెయిలీలో ఆ ముక్కవిలువ సూచింపబడివుండేది.

చిన్నపిల్లలు నాచుట్టూవున్నప్పుడువారితో ఆడుకొనడం కన్నా నా కిష్టమైనది మరియొకటి వుండేదికాదు. పిల్లలునన్ను ఎప్పుడూ ప్రేమించేవారు నా చేతిని పట్టుకొని వారికినచ్చిన చోటికి తీసుకువెళ్ళి ఏవేవో వస్తువులను చూపించేవారు. వ్రేళ్ళతో నా చేతిలో వ్రాయలేకపోయినా, వాళ్ళ పెదిమలను తాకి వారుచెప్పేది అర్థంచేసికొనేదాన్ని. కాని ఆవిధంగాను తెలిసికోలేనప్పుడు పిల్లలు మూగసంజ్ఞలు చేసేవారు. నేను చెప్పుకోలేనప్పుడు కొంటెగా నవ్వేవారు! నేను వాళ్ళకి కథలుచెప్పేదాన్ని. ఈవిధంగా ఎన్నో గంటలు ఎగిరి ఇట్టే పోయేవి!

చిత్రవస్తుప్రదర్శనశాలలు నా కెంతో సంతోషాన్ని కలిగించేవి. గొప్ప గొప్ప కళాఖండాలు నా కేవిధంగా సంతో

షాన్ని కలిగిస్తాయని అనేకమంది అడుగుతూవుంటారు. పాల రాతిపై మహాశిల్పులు తీర్చిదిద్దిన రేఖలను నా చేతితో తాకడంద్వారా అనేక దేవుళ్ళ, నాయకుల ముఖభంగిమలను స్పష్టంగా తెలిసికొనగలను. సజీవులైనవారిముఖాలను వారి అనుమతితో స్పృశించడంద్వారా ముఖలక్షణాలను తెలిసి కొనగలిగినట్లే, ఆ పాలరాతి విగ్రహాల ముఖాలలో ప్రేమ, వైరత్వం, క్రోధం మొదలైన లక్షణాలను తెలిసికొనగలిగాను. వేటకి దేవతయైన డయానావిగ్రహాన్ని ముట్టుకొని, అందలి శిల్పచాతుర్యానికి అచ్చెరువొందాను. సౌందర్యదేవత 'వీనస్' విగ్రహంకూడా నన్ను ముగ్ధురాల్ని చేసింది.

నేనుచదువుకొనే గదిలో క్రిందుగా నా చేతిని అందే ట్లు హోమర్ విగ్రహం చెక్కబడిన పతకం వ్రేలాడుతూ వుంటుంది. విచారగ్రస్తమైన ఆయన అందమైన ముఖం, నుదుటి రేఖలు నేను స్పృశించినప్పుడు వినమ్రతతో ఆయనకి నమస్క రింప బుద్ధివేస్తుంది. విచారంతో సన్నిహిత సంబంధంగల హోమర్ మహాకవి పద్యాలు చదువుతూంటే నా కొక అనిర్వచనీయమైన ఆనందం, విచారం ముప్పిరిగొని, నన్ను మైమరపించుతాయి. "కన్నులు మిరుమిట్లుగొల్పే మధ్యా హ్నపు సూర్యకాంతిలో, కన్నులుపోడుచుకొన్నా కనుపించని ఈ అంధకారాన్ని నాలో సృష్టించావేం ప్రభూ! పగటి వెలు తుర్ని చూసే భాగ్యం నాకు లేనేలేదా, ఇక లేనే లేదా" అని ఆ మహాకవి ఆక్రందిస్తుంటే ఎవనిగుండె ద్రవింపదు? తడబడుతూన్న అడుగులతో తడుముకుంటూ నడచివెళ్ళే హోమర్ మహాకవి ఈ పై వచనాన్ని అంటూ నా కండ్లను

కట్టినట్లే కనుపించుతూన్నాడు. అజరామరమైన ఈ అమృత వాక్కులు ఆచంద్రార్కం సాహిత్యాకాశంలో ప్రకాశింపగలవు ! శిల్పసౌందర్యాన్ని కన్నులకంటె చేతులే సునిశితంగా గ్రహింపగలవని నా నమ్మకం. ఒక క్రమపద్ధతిని మలచిన ఆ రేఖల సౌందర్యాన్ని స్పృశించాలేకాని, చూడగలమా ? ఏది ఎటున్నా, ఆ ప్రాచీన గ్రీక్ దేవతావిగ్రహాల సౌందర్యాన్ని నేను కనుగొనగలిగాను.

నాటకశాలకి వెళ్ళడం నాకు ఎంతో వినోదాన్ని కలిగిస్తుంది. నాటకం జరుగుతూండగా దానిని నాకు వర్ణించి చెప్తూంటే నాటకం చదువుతూన్నప్పటికంటె ఎక్కువ ఆనందాన్ని నేను పొందగలను. దీనికికారణం ఆ యా సంఘటనల మధ్య నేను కూర్చొని వుండటమే. ఆ యా పాత్రలను అతి సమర్థనీయంగా నటింపగలిగే నటీ నటులెందరితోనో నాకు పరిచయంవుంది. కాలాన్నీ, దూరాన్నీకూడా మరచిపోయి, గతించిన ఊహాజగత్తులో వీరిమధ్య మనంవున్నట్లే భావిస్తాము. ప్రఖ్యాత నటీనటకుల పరిచయభాగ్యం నాకు చాలాసార్లు కలిగింది. రాణివేషధారిణి మిస్. ఎలెన్ టెర్రీ ముఖాన్ని స్పృశించడానికి నాకు అనుమతిఇవ్వబడింది. మూర్తీభవించిన ఠీవితో ఆమె రాణీపాత్రకి ఎంతో చక్కగా సరిపోయింది. రాజలాంఛనాలతో ఆమెప్రక్క సర్. హెన్రీ ఇర్వింగ్ గంభీరంగా నిలచివున్నప్పుడు నేను స్పృశించినఘట్టం నా కెప్పుడూ మరపురాదు !

మిస్టర్. జెఫర్సన్ నాకు ఆప్తమిత్రుడు. మొట్టమొదటి సారిగా ఆయనను నేను న్యూయార్కులో పాఠశాలలోవుండగా

చూచాను. అప్పుడాయన 'రిప్ వాన్ వింకిల్' పాత్ర వేశారు. నేను అంతకుముందు 'రిప్ వాన్ వింకిల్' కథని అనేక పర్యాయములు చదివాను. కాని అంతకుముందెప్పుడూ 'రిప్' శాంతమైన, వింతయైన కారుణ్యస్వభావాన్ని అర్థంచేసికొనలేక పోయాను. మిస్టర్. జెఫర్సన్ నటన నన్ను మహాశ్చర్యంలో ముంచివేసింది. నాటకం ఆఖరయినతరువాత మిస్. సల్లి వాన్ నన్ను తెరలవెనుకకి తీసుకువెళ్ళి మిస్టర్. జఫర్సన్ ధరించిన వింతదుస్తుల్నీ, గాలికిఎగిరే జుట్టునీ, గడ్డాన్నీ నాకు చూపించింది. ఇరవై సంవత్సరాల నిద్రతరువాత 'రిప్' ముఖకవళికలు ఏవిధంగా మారినదీ, అతని కాళ్ళు ఏవిధంగా తడబడుతూన్నదీ తెలిసికొనడానికి మిస్టర్. జెఫర్సన్ తన ముఖాన్నీ, శరీరాన్నీ నేను తడిమిచూడడానికి దయతో అంగీకరించాడు.

'ది రైవల్స్'లో నటిస్తూండగా కూడా నేను మిస్టర్. జెఫర్సన్‌ని చూశాను. ఒకసారి బోస్టన్‌లో వుండగా నేను జెఫర్సన్‌ని చూడడానికి వెళ్ళాను. అతిథులకి ప్రత్యేకింపబడిన ఒకగదిని రంగస్థలంగా మార్చి ఆయన 'ది రైవల్స్'లోని రసవత్తరమైన ఘట్టాన్ని నటించి నాకు చూపించారు. ఒక పెద్ద బల్లదగ్గర ఆయనతోపాటు ఆయన కొడుకుకూడా కూర్చొని వున్నాడు. బాబ్ యాకర్స్ సవాలుచేయడం ఆ తరువాత భయంకరమైన కత్తియుద్ధంజరగడం, నేనుప్రత్యక్షంగాఅక్కడ చూచాను. కత్తియుద్ధంలో ఆయన వివిధభంగిమలు నేను కూడా ఆయనతో కదలుతూ తెలిసికొన్నాను. నా చేతిలో వ్రాయడంద్వారా ఇంత విపులంగా తెలిసికొనే అవకాశం నాకు కలిగివుండేదికాదు. మెరపు మెరిసినట్లు కదలే ఆకత్తుల

వేగం, క్రమంగా తనశక్తి తన అరచేతులగుండా కారిపోతూంటే పాపం తడబడుతూన్న బాబ్‌ని నేను ప్రత్యక్షంగాచూశాను. మిస్టర్. జెఫర్సన్ 'రిప్ వాన్ వింకిల్'లోని రమణీయమైన సంభాషణలను చదివి నాకు వినిపించారు. అందులో చిరునవ్వుకి దగ్గరగా కన్నీరు రావడం నా హృదయాన్ని చలింపజేసింది. ఆ యా ఘట్టాలని తాను ఏవిధంగా అర్థంచేసుకొన్నదీ చూపించవలసినదిగా మిస్టర్. జెఫర్సన్ నన్ను కోరారు. నటించడంలో లేశమైనా ప్రవేశంలేని నేను ఊహామాత్రంగా కొద్ది విషయాలు చెప్పగలిగాను! సంభాషణలకి తగిన నటనలో ఆయనది అందెవేసిన చేయి. 'మనుష్యుడు గతించినతరువాత ప్రజలాతనిని అంతత్వరితంగా మరచిపోతారా?' అనినెమ్మదిగా నిట్టూర్చుతూ, దీర్ఘకాలపు నిద్రతరువాత 'రిప్' తనతుపాకికోసం, కుక్కకోసం వెతకడం, డెర్రిక్‌తో ఒప్పందం చేసికొనడం — ఈ ఘట్టాలన్నీ కళ్ళకు కట్టినట్లు వాస్తవంగా చిత్రింపబడ్డాయి — 'ఆ యా ఘట్టాలు వేరొకవిధంగా జరిగి వుండవు' — అన్నంత యథార్థంగా, అతి సమర్థతతో మిస్టర్. జెఫర్సన్ నటించారు.

పన్నెండు సంవత్సరాల క్రితం నేను మొట్టమొదటి సారిగా నాటకశాలకు వెళ్ళడం నాకు జ్ఞాపకంవుంది. బాల నటి ఎల్సీలెస్లీ అప్పుడు బోస్టన్‌లోవుంది. ఆమె నటిస్తూన్న 'ది ప్రిన్స్ అండ్ ది పాపర్' చూడడానికి మిస్. సల్లివాన్ నన్ను తీసుకువెళ్ళింది. రాజకుమారుని దుస్తులలోవున్నఎల్సీని చూడడానికి తెరవెనుకకువెళ్ళడానికి నాకు అనుమతినిచ్చారు. బుజాలమీద గాలికి ఎగురుతూన్న మబ్బులాంటిజుట్టుతో ఎల్సీ నవ్వుతూంటే జగన్మోహన విగ్రహంలా వుంది! వేలాదిప్రేక్ష

కులముందునటించినా ఆమెలో సిగ్గుకానీ, అలసటకాని కొంచ మైనా నాకు కనుపించలేదు! అప్పుడే ఆమెపేరును పలుకడానికి కొద్దిగానేర్చుకొని విడివిడిగా పలుకగానే, ఏవిూకొత్తలేకుండా తన చేతిని చాపి హృదయపూర్వకంగా నాతో కరచాలనం చేసింది. ఎల్సీ! పీటిసిబట్టి ఎన్ని లోపాలకి లోనైనా, రమణీయ మైన ఈ లోకపు మాధుర్యాన్ని నాజీవితం చవిచూడగలిగిం దనడం నా సవమేకదూ?

ప్రతి విషయంలోనూ ఒక ప్రత్యేకత వుండితీరుతుంది. ఆఖరికి అంధకారంలోనూ, నిశ్శబ్దంలోనుకూడా; ఏపరిస్థితులలో వున్నా సంతృప్తితో జీవించడాన్ని నేను నేర్చుకొన్నాను.

మూయబడిన జీవితద్వారందగ్గర ఒక్కతెనేకూర్చొని వున్నప్పుడు ఒంటరితనం భయంకరంగా నన్నావహిస్తుంది. నాకు ప్రవేశములేని ఆ ద్వారానికి ఆవల వెలుతురు, స్నేహి తులు, సంగీతం వుంది. నాలోవుండేబాధని ఆపుకోలేక నాకు విధింపబడిన ఈ క్రూరశిక్షకి ఎదురుతిరగాలనే ప్రయత్నం చేస్తూంటాను. కాని నా నోటిచివరవరకూ వచ్చిన అర్థంలేని, వ్యర్థమైన మాటల్ని నా నాలుక పలుకదు! లోలోన అణచు కొన్న కన్నీటిలా అవి నాహృదయంలోనికి తిరిగివెళ్ళిపోతాయి నీరవ; నిబిడాంధకారం నన్నావహిస్తుంది. అప్పుడుచిరునవ్వుతో ఆశాజ్యోతి నన్ను తట్టి 'అన్నీ మరచిపోవడంలోనే ఆనందం వుందితే!' అని చెప్తుంది. అందుచేతనే ఇతరుల కండ్లలోవుండే కాంతిని నా సూర్యునిగాను, చెవులలోవుండే మధురస్వనాన్ని నా సంగీతముగాను, పెదవులపై వుండే చిరునగవుని నా సం తోషంగాను చేసికొనడానికి ప్రయత్నిస్తూంటాను.

# ఇరువదిమూడవ ప్రకరణము

నా జీవితాన్ని ఆనందమయంగా చేసినవారి పేర్లను ఈ ప్రకరణములో వ్రాయడంద్వారా ఈ నా జీవితకథ ఒక నూతనాభరణాన్ని సంతరించుకొని, నూతన తేజంతో తనరారుతుందనడానికి సందేహంలేదు. అందులో కొందరిపేర్లు మన సాంస్కృతంలో చిరస్థాయిగా వుండి, మనహృదయాలలో శాశ్వతస్థానం ఏర్పరచుకొన్నవి; బహుశా కొందరిపేర్లు మా పాఠకులకి పరిచితం అయి వుండకపోవచ్చును. కాని ఎవరి ప్రభావంవల్ల నావంటివారి జీవితాలు ఆనందమయమైనాయో వారి దివ్యస్మృతి నావంటివారి హృదయాలలో చిరస్థాయిగా నిలచిపోతుంది. ఎవరిని కలసికొనడంవల్ల ఒక మధురగేయం మనకి గుర్తువస్తుందో, ఎవరి కరచాలనం మనహృదయాలను సంతోషంలో ఉప్పొంగింపజేస్తుందో, ఎవరిసాన్నిధ్యం కలత చెందిన హృదయాలకు అనిర్వచనీయమైన శాంతిని, అమృతోపమానమైన శాశ్వతత్వాన్ని ప్రసాదిస్తుందో, ఆ యా ఘట్టాలు మన జీవితాలలో చిరస్మరణీయంగానిలిచిపోతాయి. మనల నావరించిన కలతలు, ఉద్రేకాలు, మన నిద్రలోకాంచిన కలలవలె గడచిపోయి, ఒకవిధమైన నవోత్సాహంతో, నవచైతన్యంతో నిద్రనుండి మేల్కాంచి, భగవంతునిసృష్టిలోని

మాధుర్యాన్ని దివ్యశక్తులతో కాంచగలుగుతాం; నిర్జీవమైన జీవితపు ఎడారి ఫలపుష్ప సమన్వితమవుతుంది. అలాంటి మహా వ్యక్తుల సాన్నిధ్యంలో మన కష్టాలేమాయమైపోతాయి. బహుశా ఆ వ్యక్తుల్ని ప్రత్యక్షంగా మనం ఇంతకుముందు కలుసుకోనకపోవచ్చును; బహుశా మనజీవితకాలంలో కలసి కొనే అవకాశం కూడా కలుగకపోవచ్చును; కాని అజరామర మైన అనుహానుహుల ప్రవచనాలు మన క్షుభితహృదయాలకి సదా, శాంతినిస్తూనే వుంటాయి.

'నీ చుట్టూచేరినవారు నీకు విసుగుపుట్టించరా?' అని నన్ను చాలామంది ప్రశ్నిస్తూంటారు. కాని ఈప్రశ్న అంత రార్థం ఏమిటో నాకు అర్థంకాదు. అయినవేళలా, కానివేళలా వచ్చి రకరకాల ప్రశ్నలవర్షాన్ని కురిపించే పత్రికావిలేఖర్ల ప్రవర్తన నాకు వింతగావుంటుంది. నాకు అర్థమయేటట్లు మాట్లాడాలని కొందరు చేసే ప్రయత్నం నాకు నచ్చదు. 'నీతో నడుస్తూన్నప్పుడు తమ నడక వేగాన్ని తగ్గించి, మెల్ల మెల్లగా అడుగులువేస్తూ నడచే అవకాశవాదుల ప్రవర్తన బూటకం మాత్రమే!

నేను కలసికొన్న కొందరిచేతులు మౌనంగానే నాతో మాట్లాడుతాయి. కొందరిచేతుల్ని ముట్టుకోగానే వాటిలో సాగదుబోతుతనం వ్యక్తమవుతూవుంటుంది. ఏమాత్రం ఉత్సాహం లేని, గడ్డకట్టుకుపోయినట్లుండే కొందరి చేతివ్రేళ్ళ కొనలను తాకగానే ఉత్తరధృవ ప్రాంతపు మంచుతుపాను నాకు జ్ఞాపకంవస్తుంది. మరికొందరి చేతులలో సూర్యకిరణాలుండి, వాటిని పట్టుకొనగానే వెచ్చగా, హాయినికలిగిస్తాయి. మా

మూలుగా చూడగలిగేవారికి ముసిముసినవ్వులతో ఆనందాన్ని కలిగించే పసిపిల్లలచేతులే, నన్ను స్పృశించి, సూర్యకిరణకాంతులని వెదజల్లుతాయి! హృదయపూర్వకమైన ఒక కరచాలనమో, స్నేహపూర్వకమైన ఒక ఉత్తరమో నాకు నిజమైన ఆనందాన్ని కలిగిస్తాయి!

దూర, దూరదేశాలలో నాకు ఎంతోమంది స్నేహితులున్నారు. నేను వారిని చూడకపోయినా, వారిఉత్తరాలకు సమాధానాలు వ్రాయలేకపోయినా నాయందువారుచూపించే ప్రేమకు వారికి ఎల్లప్పుడూ నేను కృతజ్ఞురాలను. మహామేధావంతులతో వారున్న పరిచయభాగ్యానికి నేను ఎంతోగర్వించుతూవుంటాను. బిషప్ బ్రూక్స్‌తో పరిచయంవున్నవారికి ఆయన స్నేహం ఎంత అమూల్యమైనదో తెలుస్తుంది, నా బాల్యంలో నేను ఆయన మోకాలిపైకూర్చొని, ఆయనచేతిని నా చేతితో పట్టుకొన్నప్పుడు, నా రెండవచేతిలో మిస్. సల్లివాన్ భగవంతునిగురించీ, ఆత్మనిగురించీ, ఆయనచెప్పే ప్రవచనాలను వ్రాసేది. అంతటి మహోన్నతపథాలకి నేను చేరుకొనలేకపోయినా, ఆయన ప్రవచనాలద్వారా జీవితంలో యథార్థమైన ఆనందాన్ని నేను పొందగలిగాను. ప్రపంచంలో ఇన్నిమతాలు ఎందుకువుంటాయో నాకు అర్థంకాక బిషప్ బ్రూక్స్‌ని అడిగినప్పుడు ఆయన ఈవిధంగా సమాధానం చెప్పారు: 'హెలెన్, ప్రపంచంలో ఒకేఒక్కమతం వుంది. అదేప్రేమ అనే మతం. మనస్ఫూర్తిగా, ఆత్మసాక్షిగా ఆ భగవంతుణ్ణిప్రేమించు. భగవంతుని బిడ్డలైన నీతోటిమానవులని నీశక్తికొలదీ ప్రేమించు అప్పుడు ప్రపంచంలో చెడుగుకంటె

మంచికే ఎక్కువ అవకాశంవుంటుంది. స్వర్గద్వారపు తాళపు చెవులు నీ చేతిలోనే వుంటాయి' — ఆయనజీవితం ఈ ప్రధాన సూత్రాలమీదనే ఆధారపడి వుంది. బిషప్ బ్రూక్స్ నాకు ఒక ప్రత్యేక మతమేమీ బోధించలేదు. భగవంతుడు మనఅం దరికీ తండ్రిఅనీ, తోటిమానవులు మన సోదరులనీ, సర్వ మతాల రహస్యం ఇదేననీ ఆయన చెప్పారు. భగవంతుడే ప్రేమ, ఆయన మనకందరికీ తండ్రి, ఆయనబిడ్డలం మనమంద రము, అందుచేతనే మూసుకువచ్చే నల్లటి మేఘాలన్నీ విడి పోతాయి, సత్యం అనే కష్టాలను లోనైనా, అసత్యంమాత్రం గెలువలేదు!

ఈ ప్రపంచంలో నేను తృప్తిగా కాలంగడుపుతూ వుండటంచేత మరొక ప్రపంచపు ఆలోచన అంతగా నన్ను వేధించదు. అత్యంత ప్రేమపాత్రులైన నా స్నేహితులందరూ భగవంతుని మనోహరస్వర్గసీమలో ఎక్కడోవున్నా, నాకు వారంతా ఎంతో సన్నిహితంగా వున్నట్లూ, ఏ క్షణంలోనైనా వారు నా చేతిని ప్రేమపూర్వకంగా పట్టుకొని, మనసారా నన్ను పలుకరించినా నేను ఆశ్చర్యపడవలసినవిషయం కానట్లు నా కనిపిస్తూంది!

డాక్టర్ ఆలివర్ వెండెల్‌హోమ్స్‌ని మొట్టమొదటి సారిగా మేము కలసికొనడం నాకు జ్ఞాపకంవుంది. ఒక ఆదివారంనాటి మధ్యాహ్నం తమఇంటికి రావలసినదిగా ఆయన మమల్ని ఆహ్వానించారు. అవి వసంతకాలపు తొలిరోజులు నేను మాట్లాడటం నేర్చుకొని ఆట్టేరోజులు కాలేదు. వెచ్చ

దనానికి ఏర్పాటుచేయబడిన ఒక పొయ్యికి దగ్గరగా వున్న కుర్చీలో ఆయన తన లైబ్రరీలో కూర్చొనివున్నారు. ఆ గదిలో అచ్చు, అట్టలకు ఉపయోగించిన తోలు, వాసన బాగా వేస్తూంది. ఈ వాసననిబట్టి అక్కడ ఎన్నో పుస్తకాలు వున్నట్లు నేను గ్రహించాను. డాక్టర్ ఆలివర్ నన్ను తన కుర్చీలో కూర్చోపెట్టుకొని, నాకు వింతగావుండే అనేక వస్తువులను తెచ్చి నా కిచ్చారు. అప్పటిలో నాకు అభిమాన పాత్రమైన 'ది ఛాంబర్డ్ నాటిలస్' అనే పద్యాన్ని ఆయన కోరి నాచేత చదివించారు. ఆ తరువాతకూడా డాక్టర్ ఆలివర్‌ని నేను ఎన్నోసార్లు కలసికొన్నాను.

డాక్టర్ ఆలివర్‌ని కలసికొన్న కొద్ది రోజులతరువాత మిస్. సల్లివాన్, నేనూ విట్టియర్‌ని మెర్రీమాక్‌లోవున్న ఆయనఇంటిదగ్గర కలసికొన్నాం. ఆయన శాంతస్వభావం, నాపై చూపించే ప్రేమ నన్ను ముగ్ధురాల్ని చేశాయి. ఉబికిన అక్షరాల అచ్చుతోవున్న ఆయన స్వంత పద్యాల పుస్తకంనుండి 'ఇన్ స్కూల్ డేస్' అనే పద్యాన్ని నేను చదివాను. నేను స్పష్టంగా ఆ పద్యాన్ని చదువగలగడంచూసి ఆయన ఆశ్చర్యపోయారు. ఆ పద్యాన్నిగురించి ఆయనను నేను అనేక ప్రశ్నలువేశాను. ఆయనచెప్పే సమాధానాలను ఆయన పెదిమలను తాకడంద్వారా నేను తెలిసికొన్నాను. ఆ తరువాత ఆయనచదువుకొనే గదిలోనికివెళ్ళాము. అక్కడ ఆయన మిస్. సల్లివాన్‌కి తన 'ఆటోగ్రాఫ్'ని ఇచ్చారు. 'ప్రియమైన నీ శిష్యురాల్ని శాశ్వత దాస్యవిముక్తి గావించిన నీ ఉదారస్వభావానికి ఇవే నాహృదయపూర్వకాభివందనములు

— నీ ప్రియమిత్రుడు – జాన్ జి. విట్టియర్' అని దానిలో ఆయన వ్రాశారు – ఆఖరున మాకు వీడ్కోలు చెప్తూ, వీధిగుమ్మందాకా వచ్చి, నా నుదుటిమీద ప్రేమపూర్వకంగా ముద్దుపెట్టుకొన్నారు. వచ్చే వేసవిలో తిరిగి నేనువస్తానని ఆయనకి వాగ్దానంచేశాను. కాని నా వాగ్దానం నెరవేర కుండానే ఆయన చనిపోయారు !

డాక్టర్ ఎడ్వర్డ్ ఇవరెట్ హేల్ నాకు చాలా పాత స్నేహితులలో ఒకరు. ఆయనను నా ఎనిమిదవయేటినుంచీ ఎరుగుదును. ఆయన సానుభూతీ, సలహాలు మిస్. సల్లివాన్ కీ, నాకూ అత్యంత క్లిష్టపరిస్థితులలో ధైర్యాన్ని, ఉత్సాహాన్ని కలిగించి, నూతనోత్సాహంతో ముందుకి తీసుకుపోయేవి — తాను చెప్పినవే తన జీవితంలో ఆచరించిన ఆదర్శమూర్తి ఈయన. దేశాన్ని ప్రేమించడం, తోటి సోదరమానవుల్ని ప్రేమించడం, ఉన్నతాదర్శపూరితమైన జీవితాన్ని గడపడం — ఆయనచూపించిన ఉన్నత లక్ష్యాలు. ఈయన విశ్వమానవ సుహృన్మణి. భగవంతుడు ఆయనకు మేలుచేయుగాక !

డాక్టర్ అలెగ్జాండర్ గ్రాహంబెల్ను తొలిసారిగా నేను కలసికొన్నవిషయాన్ని ఇదివరకే చెప్పాను. అప్పటి నుంచీ ఆయనతో గంటలతరబడి ఎన్నోరోజులు సంతోషంగా గడపినాను. ఆయన గాలిపటాలు ఎగురవేస్తూంటే, ఆయన పరిశోధనశాలలో పనిచేస్తూంటే దగ్గరేవుండి అనేక పాత విషయాలను చూచాను. రాబోయే 'గాలిఓడ'ని గురించిన పరిశోధనలు ఈయన ఈ గాలిపటాలతో చేశారు! విజ్ఞాన శాస్త్రపు వివిధశాఖలలో ఈయనఅనుభవం అద్వితీయం.

ఆయనచేపట్టిన ఏ విషయాన్నైనా, అత్యంత ఆకర్షణీయంగా నిర్వహించేవారు. కవిత్వంఅన్నా, హాస్యమన్నా ఈయనకి ఒక ప్రత్యేకాభిమానం — పిల్లలంటే చెప్పలేనంతప్రేమ ఈయనకి. ఆయనచేతులలో ఒక చెవిటిపిల్ల వున్నప్పుడు ఆయన పొందే ఆనందం మేరలేనిది. చెవిటివారివిషయంలో ఈయన చేసిన పరిశోధనలు, రాబోయే తరాలవారికి ఈయనచేసిన సేవ చిరస్మరణీయాలు!

న్యూయార్క్ నగరంలో నేనుగడపిన రెండుసంవత్సరాలలోనూ అనేకమంది ప్రముఖుల్ని కలుసుకొనే అవకాశం నాకు కలిగింది. అంతకుముందు వీరిపేర్లు నాకు పరిచితములైనా, వీరిని కలసికొంటానని ఎప్పుడూ అనుకోలేదు. వీరిలో చాలామందని నా ప్రియమిత్రులైన లారెన్స్ హట్టన్ దంపతుల ఇంటిలో కలసికొన్నాను. మనిషిలోవుండే మంచితనాన్ని పైకితీసుకువచ్చే అద్భుతశక్తి మిస్టర్. హట్టన్‌కి వుందనడంలో సందేహంలేదు. హట్టన్‌సతి నాయెడల చూపిన ఆదరాభిమానాలు చిరస్మరణీయాలు. నిరుత్సాహాన్ని కలిగించే అనేక కష్టసమయాలలో ఈమె నాకువ్రాసిన లేఖలే నాలో ద్విగుణీకృతమైనఉత్సాహాన్నికలిగించాయి. సాహిత్యరంగంలోదిగ్గంతులైన అనేక ప్రముఖవ్యక్తుల పరిచయభాగ్యం మిస్టర్. హట్టన్ ద్వారానే నాకు కలిగింది. మిస్టర్. విలియమ్ డీన్ హొవెల్స్, మార్క్ ట్వెయిన్ వీరిలో ముఖ్యులు. మిస్టర్. రిచర్డ్ వాట్సన్ గిల్డర్‌నీ, మిస్టర్. ఎడ్మండ్ క్లారెన్స్‌స్టెడ్‌మన్‌నీ కూడా కలసికొన్నాను. కథలుచెప్పడంలో నిధియైన మిస్టర్. చార్లెస్ డడ్లీ వార్నర్‌ని నే నెరుగుదును. తన పొరుగువారిని

తనవానివలె ప్రేమించే ఈయనస్వభావం అత్యంత ప్రశంసనీయం. ఈయనే మిస్టర్. జాన్ బర్రోస్ కవిని నా దగ్గరకి తీసుకువచ్చి పరిచయంచేశారు. వీరంతా నాయెడల ఎంతో ఆదరాభిమానాలని చూపించారు. ఆదర్శశిఖరాలకు ఎంతో ఠీవిగా, వేగముగావెళ్ళే 'ఈవాన్'తో సమానముగా చిన్న 'అస్కానియస్' వెళ్ళలేకపోయినట్లు నేను వారి సంభాషణలలో పాల్గొనలేకపోయేదాన్ని. వారి చర్చలలో పాల్గొనే సామర్థ్యం నాకు లేకపోయినా, వారి సాన్నిధ్యమే నాకు అనిర్వచనీయమైన ఆనందాన్నిచ్చేది. మిస్టర్. గిల్డర్ వెన్నెల రాత్రులలో పిరమిడ్ల వద్దకు ఎడారిగుండా తన ఒంటరి ప్రయాణాన్ని వర్ణించిచెప్పారు. ఆ తరువాత నాకు వ్రాసిన ఉత్తరంలో తని సంతకం క్రిందుగా నా చేతితో తాకడానికి వీలుగా ఒక గుర్తునుపెట్టి నాకు ఆశ్చర్యంకలిగించారు; దీనిని చూచినప్పుడు డాక్టర్ హేల్ నాకు వ్రాసిన ఉత్తరాలలో తన సంతకాన్ని "బ్రెయిలీలో" గుచ్చిరాయడం నాకు జ్ఞాపకం వస్తుంది.

మార్క్ ట్వెయిన్ పెదిములద్వారా ఆయన స్వంత కథలను ఒకటి రెండింటిని నేను విన్నాను ఆయన ఆలోచనలోను, చెప్పేమాటలలోను, చేసే పనులలోను ఒకప్రత్యేకత వుంది. ఆయన కరచాలనంచేస్తూంటే ఆయన కళ్ళలోని మెరుపు అందులో ద్యోతకమయ్యేది. మార్క్ ట్వెయిన్ తెల్లని దుస్తులనే ధరించేవారు. ఆయనకి పిల్లలంటే అమితమైనప్రేమ. ఈ విషయంలో ఆయననుగురించి ఒక వింతకథ చెప్తారు. తన ఇంటిలో దొంగతనం చేయడానికి వచ్చేవారికి

ఒక సూచన అట్టమీద వ్రాసి గోడకి వ్రేలాడగట్టేరట. అందులో తనఇంటిలో విలువైన వస్తువులు ఎక్కడవున్నదీ, వివరంగా చెప్తూ మేడమెట్లక్రింద బుట్టలోవున్న పిల్లిపిల్లల్ని మాత్రం కదపవద్దని అందులో విజ్ఞప్తి చేశారట మార్క్ ట్వెయిన్!

న్యూయార్కులో నేను కలసికొనిన స్నేహితులింకా ఎంతోమంది వున్నారు. 'సెయింట్ నిఖాల్స్' సంపాదకురాలు మిసెస్. మేరీ మేప్స్ డాడ్జ్, 'పాట్సీ' రచయిత్రి రిగ్స్‌సతి నాకు అత్యంత సన్నిహితులైనారు. హృదయపూర్వకంగా వీరు నాకిచ్చిన పుస్తకాలు, ఛాయాచిత్రాలు, దయతో నాకు వ్రాసిన ఉత్తరాలు నాకు అమూల్యమైన జ్ఞాపకచిహ్నాలుగా ఉండిపోయాయి. నాకు తెలిసిన అందరి స్నేహితులపేర్లను స్లాఘావంచేతను, వారి పవిత్రనామాలను నగ్నమైన అచ్చు అక్షరాలలో పెట్టడానికి మనస్కరించకనూ ఇక్కడ ఉదహరించుటలేదు. లారెన్సు సతి విషయంకూడా సంకోచిస్తూనే వ్రాశాను.

ఇంకొక ఇద్దరు స్నేహితుల విషయంమాత్రంవ్రాస్తాను. అందులో ఒకామె పిట్స్‌బర్గ్‌కి చెందిన విలియమ్ థా సతి. ఎవర్నో ఒకరిని సంతోషపెడుతూ వుండడమే ఈమెపని మిస్. సల్లివాన్, నేనూ ఈమె ఇంటికి వెళ్ళాము. ఆమె సలహా, సహాయసహకారాలు మే మెన్నటికీ మరచిపోలేము.

రెండవ స్నేహితునివిషయంలోకూడా నే నెంతగానో ఋణపడివున్నాను. పేరుకోసం తాపత్రయపడకుండా అజ్ఞాతంగా, మౌనంగా ఈయన తన సహాయ సౌహార్ద్రాలతో

ప్రతి ఒక్కరికి ఆప్తమిత్రుడైనాడు. ఈయనకు నాయెడలగల ఆదరాభిమానాలద్వారానే నేను కళాశాలలో ప్రవేశింప గలిగాను.

ఈవిధంగా నా స్నేహితులే ఈ నా జీవితచరిత్ర రచించారు. నా స్నేహితులే నాలో వుండే లోపాలు ఏ విధంగానూ అడ్డురాకుండా, నా జీవితాన్ని వేయి విధాలుగా సంతోషమయంగా చేశారు. ఈ నా స్నేహితులవలననే శారీరకమైన నా లోపాల ఛాయలనుండి ఒడుదుడుకులు లేకుండా, ప్రశాంతంగా ముందుకు సాగిపోగలిగాను.



